

రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

Published by

**www.pravachanam.com**

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)

శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.



వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు

తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక

# బాల కాండము



పరిష్కర్త

శ్రీ వింజమూరి శేషఫణి శర్మ

ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# బాల కాండము

శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి. రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆథ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ-ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు - లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య - భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు - విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా

సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరఫున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ముందుమాటలు

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియైయున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావుగారిచే రచింపబడినది. కనుక

దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించు చుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాలస్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకటరాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తలపైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్‌లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచన లిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయిభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము,

శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీనారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

**(సం) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారిరుద్రవరము)**






శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞానవైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రతయగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

"సీతాయాశ్చరితం మహత్" అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పుకొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము – కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మికమైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష–విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో – గ్రాంధికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు – వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండ ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠకలోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింపచేసిన ధన్యచరిత మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీసంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**26-12-1989**



**శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ఆశీస్సు

**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖాపేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుషశేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనము లేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షాప్రేక్ష మగుట చేతనున్నూ - ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాస ముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు

అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతఃప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్ఛరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదఃప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా

సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె – గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయా శ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యములగు నటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

**(సం) మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

# విషయసూచిక

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

## బాలకాండము

## కథా ప్రారంభము-సంక్షిప్తరామాయణము

### మొదటి సర్గము

**శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్ముని పుంగవమ్॥**

ఒకానొక దినంబున నారదమహాముని వాల్మీకాశ్రమంబునకు వచ్చెను. తపస్సంపన్నుడు వేదాధ్యయన తత్పరుడునగు ఆ నారద మహర్షిని పూజించి తపోనిష్ఠుడగు వాల్మీకి యిట్లు ప్రశ్నించెను. ఈ భూమండలమున నిప్పుడు ఉత్తమ గుణములు గలవాడు, అధికశక్తి సమన్వితుడు, ధర్మము నెఱింగినవాడు, ఉపకారము చేయువాడు, సత్యమునే పలుకువాడు, స్థిరమైన సంకల్పము గలవాడు, సదాచారముగలవాడు, అన్ని ప్రాణులకు మేలొనరించువాడు, సకల శాస్త్రములు చదివినవాడు, తనకర్తవ్యమును నెరవేర్చుట యందు నేర్పుగలవాడు, ఎల్లరకు సంతోషముగలిగించు సుందరమైన రూపముగలవాడు, ధైర్యవంతుడు, కోపములేనివాడు మహాప్రకాశము గలవాడు, అసూయలేనివాడు, కోపము వచ్చినచో దేవతలలైనను యుద్ధమున భయపడజేయువాడు ఎవ్వడైననుండెనా? ఉన్నచో ఆతడెవ్వడో? ఓమహర్షి ! నేను వినగోరుచున్నాను. విన నాకెంతయో

అభిలాష కలదు. అట్టి నరుని తెలిసికొని చెప్పుటకు నీవే సమర్థుడవు నాకు తెలియజెప్పుమనగా మూడు లోకముల నెఱింగిన నారదమహర్షి వాల్మీకి మాటలను విని నేనేది చెప్పదలంచితినో దానినే ఈ వాల్మీకి ప్రశ్నించెనే యని తన మనంబున సంతసించి ఇదిగో వినుమని ఆతనిని తన యెదుట గూర్చుండ బెట్టుకొని యిట్లు చెప్పదొడంగెను.

"సత్వగుణ సంపన్నుడవగు ఓ మునీంద్రా! వినుము. నీవు కీర్తించిన సుగుణములు లోకమున నొక్కచోనుండుట దుర్లభము. కాని యిక్ష్వాకు వంశమున నిట్టి సర్వసద్గుణములు గలవాడు నేడు జన్మించి రాముడని జనులందరిచే పిలవబడుచున్నాడు. ఆతడు స్థిరసంకల్పముగల మనస్సు గలవాడు. మహాశక్తి మంతుడు. మిగుల తేజస్సు, ధైర్యము, జితేంద్రియత గలవాడు. ప్రఖ్యాతమైన తెలివిగలవాడు. ఉత్తమమైన నీతిగలవాడు. చక్కగా మాట్లాడుట యందు నేర్పరి. మిక్కిలి సంపదగలవాడు. శత్రువుల దునుమాడువాడు, విశాలమైన మూపు, బలిష్ఠములై పొడవైన చేతులుగలవాడు, శంఖమువంటి మెడ, గొప్ప చెక్కిళ్ళు, విశాలమైన వక్షస్థలము గల్గువాడు, గొప్పవిల్లు చేబూనువాడు, లోపలి వెలుపలి శత్రువులను జయించినవాడు, మోకాళ్ళ వరకు నున్న పొడవైన బాహువులు గలవాడు. చక్రవర్తి లక్షణములు గల చక్కని శిరస్సు గలవాడు. విశాలమగు నుదురు గలవాడు. మిగుల పొడవు పొట్టిగాక సమమైన ఆకారముగలవాడు. హెచ్చుతగ్గులు లేక సమయమైన యవయవములు గలవాడు. నిగనిగలాడు శరీరపు రంగు గలవాడు. మహాతేజశ్శాలి. పుష్టిగలిగిన ఱొమ్ముగలవాడు. విశాలనేత్రముల వాడు. సర్వావయవ సౌందర్యము గలవాడు. శరణాగత రక్షణాది ధర్మముల నెఱంగినవాడు. సత్యప్రతిజ్ఞ కలవాడు. ప్రజలు మేలుచేయుట యందాశక్తి గలవాడు. ఆశ్రయించినవారిని రక్షించు కీర్తి గలవాడు సర్వజ్ఞుడు పరిశుద్ధుడు. బ్రహ్మతో సమానమైనవాడు. సర్వజగత్తును పోషించువాడు. సకలైశ్వర్యసంపన్నుడు శత్రువులను సంహరించువాడు. సర్వప్రాణికోటులను గాపాడువాడు. ధర్మమును విశేషముగా రక్షించువాడు. తన ధర్మమును తానాచరించుచు లోకమున ధర్మమును స్థాపించువాడు.

హితులను గాపాడువాడు. ఋగ్వేదము,యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అను నాల్గువేదములను, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము అను ఆరు వేదాంగములను నెఱింగినవాడు. ధనుర్వేదము నందు నిష్ణాతుడు. అన్నిశాస్త్రములను పఠించుటే కాక వాని యర్ధములను పూర్తిగా తెలిసినవాడు. పూర్వము తెలిసిన విషయములను మరువనివాడు. ప్రతిభగలవాడు. జనులందరకు ప్రీతిపాత్రుడు. సజ్జనుడు. కలత చెందని మనస్సు గలవాడు. సర్వవిషయములను సుబోధముగా జెప్పువాడు. నదులచే సముద్రమువలె ఎల్లప్పుడు సజ్జనులచే సేవింపబడువాడు. పూజింపదగినవాడు. శత్రువులయందు, మిత్రులయందు సమబుద్ధి గలవాడు. ఎంత చూచినను తనివితీరని ఆశ్చర్యకరమగు రూపము గలవాడు. సకలసద్గుణ సమన్వితుడు. కౌసల్యాదేవి యానందమును వృద్ధి బొందించు తనయుడు. గాంభీర్యమున సముద్రము వంటివాడు. ధైర్యమున హిమవంతునితో సమానుడు. పరాక్రమమున విష్ణుసదృశుడు. చంద్రునివలె ఆనందమును గలుగ జేయువాడు. సహనమున భూమిని బోలినవాడు. దానమున కుబేరుని వంటివాడు. సత్యముపలుకుట యందు మఱియొక ధర్మదేవత వంటివాడు.

ఇట్లు అనేక సద్గుణములు గలవాడై మహాపరాక్రమవంతుడై సంధి విగ్రహ, యాన – ఆసన – ద్వైదీభావ సమాశ్రయములను షడ్గుణములతో ప్రకాశించు రాజనీతి శాస్త్రమున నిష్ణాతుడై భూజనులకెల్ల ప్రీతి పాత్రుడయిన రాముని తండ్రియైన దశరధుడు ప్రజలకు ప్రియమొనరించు కోరికతో పట్టాభిషిక్తుని జేయదలంచెను. పట్టాభిషేకమునకు తేబడుచున్న సంభారములను జూచి, పూర్వము దశరథునిచే రెండు వరములును పొందియున్న అతని ప్రియభార్యయైన కైకేయి–వెంటనే రాముని నడవులకంపుట, భరతుని రాజుగా నొనర్చుట యను వరములనిమ్మని అతనిని ప్రార్ధించెను. దశరధుడు సత్యసంధుడగుటవలన ధర్మమను త్రాట గట్టబడినవాడై తనప్రియపుత్రుడగు రామునడవులకు బంపించెను. వీరుడు రాజ్యపాలన సమర్ధుడయ్యును. రాముడు కైకేయికిప్రీతి గలిగించుటకును తండ్రియాజ్ఞ పాలించుటకునై తానామెయెదుట తండ్రి

యాజ్ఞపాలింతునని ప్రతిజ్ఞచేసెను. ఆయాజ్ఞ పాటించుటకై అడవులకేగెను.

అట్లు వెడలుచున్న అన్నను, వినయసంపన్నుడును రామునకు ప్రీతి పాత్రుడును ఉత్తమ గుణములు గలవాడును నైన సుమిత్రానందనుడగు లక్ష్మణుడు అనుసరించి వెంటవెళ్ళెను. ప్రాణములతో సమానమైన రాముని ప్రియభార్య జనకుని కులమునబుట్టినది తిలోత్తమ యంతటి సౌందర్యవతి ఉత్తమగుణములచే స్త్రీలలో ఉత్తమరాలు పతివ్రతయగు సీత – చంద్రుని రోహిణి వలె అనుసరించి వెళ్ళెను. పౌరులును, తండ్రియగు దశరథుడును చాలాదూరము రామునివెంట వెళ్ళిరి. ధర్మాత్ముడగు రాముడు వారిని వీడి శృంగిబేరపుర ప్రభువు బోయ రాజయిన గుహుని జేరి, సారధియగు సుమంత్రుని పురమునకు పోయిరమ్మని వీడుకొల్పెను.

అంత గుహుని సాయమున గంగానది దాటి ఆ సీతారామలక్ష్మణులు ముగ్వురును ఒక యడవి నుండి వేఱొక యడవికేగుచు సమృద్ధిగా నీరుగల నదులను దాటి భరద్వాజముని యాజ్ఞననుసరించి చిత్రకూటము జేరి సుందరమగు పర్ణశాల నిర్మించుకొని సుఖముగ నుండిరి. అట్లు రామాదులు చిత్రకూటము జేరగనే దశరథ మహారాజు పుత్రశోకముచే బాధ జెందినవాడై పుత్రుని దలంచి విలపించుచు స్వర్గస్థుడయ్యెను.

దశరథుని మరణానంతరము వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణశ్రేష్ఠులు రాజ్యము చేయమని నియోగించినను, రాజ్యము నిర్వహించు సమర్థుడయ్యును భరతుడు రాజ్యమునంగీకరింపలేదు. విషయ సుఖములకు విముఖుడైన భరతుడు పూజ్యుడగు రాముని ప్రార్థించుటకై అడవికి బయలుదేరెను. వినయవంతుడగు భరతుడు సత్యనిష్టగల రాముని సమీపించి ఇట్లు ప్రార్థించెను.

పెద్దవాడుండగా చిన్నవాడు రాజు కాదగదనునది ధర్మ సమ్మతము. నీవు ఈ ధర్మము నెఱిగిన వాడవు. కాన నీవె రాజువని భరతుడు రామునితో పల్కెను. రాముడు తననాశ్రయించిన వారిని తృప్తినొందించు వాడయ్యును. ఇక్ష్వాకు వంశరాజుల నాశ్రయించి వృధాగా తిరిగి వచ్చువాడు లేడను గొప్పకీర్తి

గలవాడయ్యెను. తండ్రి యాజ్ఞను దలచి రాజ్యపాలనమున కంగీకరింపలేదు. తనపాదుకలను తనకు ప్రతినిధిగా భరతునకొసగి రాముడు తనను వదలి పోవనల్లని భరతునికి మాటిమాటికి నచ్చజెప్పి యచ్చటినుండి వెనుకకు బంపెను.

రాముని గొనివచ్చుటయో లేక తానే రాముసన్నిధి నుండుటయో యను తన కోరిక తీరకయే భరతుడు రాముని పాదుకలను నిత్యము నర్చించుచు రాముడెప్పుడు తిరిగి వచ్చునా యను కోరికతో అయోధ్యకు దాపున నున్న 'నందిగ్రామ' మను నూరునుండి రామునాజ్ఞ తలదాల్చి రాజ్యమును బాలించుచుండెను.

భరతుడట్లు వెడలగనే, రాముడు ప్రతిజ్ఞాభంగమగు నేమోయను భయము విడిచిన వాడై రాజ్యభోగములందాసక్తి లేనివాడై పురప్రజలు మాటిమాటికి నచ్చటికి వచ్చి తన్నుఅయోధ్యకు రమ్మని బాధింతురేమోయని యాలోచించి పితృవాక్య పరిపాలనమునందు స్థిరమైన చిత్తము గలవాడై దండకారణ్యము ప్రవేశించెను.

మున్నెన్నడు చూడని యామహారణ్యమును చూచుటచే కలిగిన సంతోషముతో విప్పారిన కమలములవంటి నేత్రములు గలవాడై రాముడందు సంచరించుచు అట విరాధుని సంహరించి, శరభంగమునిని, సుతీక్ష్ణుని, అగస్త్యుని, అతని సోదరుని, సుదర్శనుడను మునిని దర్శించెను. అగస్త్యముని మాటగా ఆ మునికి ఇంద్రుడిచ్చిన విల్లు ఖడ్గము తరుగని బాణములు గల అమ్ములపొదులు రెండు రాముడు సంతసముతో స్వీకరించెను.

ఆ యడవిలో నాటవికులతో గలసి నివసించుచున్న రాముని కడకు మునులు వచ్చి పలుభాదలు పెట్టు రాక్షసులను వధింపుమని కోరిరి. రాముడు రాక్షస నివాసమగు నాదండకారణ్యమున మునుల కోరికదీర్ప నంగీకరించెను. ఆ ఋషుల చెంత యుద్ధమున రాక్షసుల జంపెదనని రాముడు ప్రతినబూనెను.

వారట్లు దండకారణ్యమున నుండగా జనస్థాన నివాసినియు, ఇచ్చ వచ్చిన రూపముదాల్చు నదియు చేటలవంటి గోళ్ళతో శూర్పణఖయను రాక్షసి రాముని

కుడిభుజమువంటివాడగు లక్ష్మణునిచే ముక్కు చెవులు కోయబడినదై విరూపిణిగా చేయబడెను. పిమ్మట శూర్పణఖ మాటలు విని యుద్ధసన్నద్ధులై ఖరుడు –దూషణుడు త్రిశిరసుడు సర్వరాక్షసులతో యుద్ధమునకు రాగా వారిని, వారి యనుచరులను పదునాల్గువేలమందిని రాముడొక్కడే నిశ్శేషముగా జంపివేసెను.

ఇట్లు జ్ఞాతులగు రాక్షసులందఱును సంహరింపబడుట శూర్పణఖవలన విన్న రావణుడు కోపముచే మూఢుడై తనకు సహాయముగా రమ్మని మారీచుడను రాక్షసుని గోరెను. అంత మారీచుడు రావణా! బలవంతుడగు రామునితో నీకు విరోధము తగినపని కాదు. అని యనేకవిధముల ప్రభోదించెను. మృత్యుదేవత ప్రేరిపించగా రావణుడు ఆతని మాటలను పెడచెవినపెట్టి అప్పుడే మారీచుని దోడ్కొని రామునాశ్రమమునకు వెడలెను. మాయలు తెలిసిన ఆ మారీచుని సాయముతో రామలక్ష్మణులను దూరముగా పంపి రాముని భార్యయగు సీతనపహరించి కొని పోవుచు అడ్డు వచ్చిన జటాయువను గ్రద్దను సంహరించి లంకానగరమును జేరెను. చావనున్న యాజటాయువు వలన సీతను రావణుడపహరించెనని విన్న రాముడు దు:ఖముచే నింద్రియములు కలత నొందగా విలపించెను. పిమ్మట రాముడు తన తండ్రి కాప్త మిత్రుడును తనకై యుద్ధ మొనర్చి ప్రాణములను విడచిన ముసలివాడగు జటాయువునకు దహనసంస్కారమొనర్చెను. హా ! యని విలపించుచు రామలక్ష్మణులా యడవిలో సీతను వెదుకుచు నొకచో వికృతరూపముతో నున్నకబంధుడను రాక్షసుని గాంచిరి.

మహాభుజుడగు రాముడతని వధింపగా శాపముతొలగి యాతడు స్వర్గమున కేగుచు ఓ రామా! ధర్మస్వభావము గలదియు సన్యాసినియునైన శబర స్త్రీ యొకతె గలదు (వైశ్యునకు క్షత్రియస్త్రీకిని బుట్టినది). నీవామెను గలసి కొమ్మనెను. మహతేజశ్శాలియు, శత్రునాశనుడును నగు రాముడు నిమ్న కులమున బుట్టిన శబరి కడకు తానే పోయెను. ఆమెయు దశరథతనయుని జక్కగా బూజించెను.

తరువాత రాముడు పంప యను పద్మసరోవరము తీరమున హనుమంతుడను వానరునిగని యాతని సూచన ననుసరించి సుగ్రీవుని గలసి యతనితో మైత్రి నెఱపెను. మహాబలవంతుడగు రాముడు మొదటినుండియును దన వృత్తాంతమును సీత యపహరింపబడుటను యూర్ధముగా సుగ్రీవున కెఱింగించెను. అది యంతయు వినిన వానర శ్రేష్ఠుడగు సుగ్రీవుడపుడు రామునియందనురాగము గలిగ అగ్నిసాక్షిగా స్నేహము చేసెను. అట్లు మైత్రి చేసికొనిన పిమ్మట రాముడు నీకు వాలితో విరోధమెట్లు వచ్చెనని యడుగగా సుగ్రీవుడు తన వృత్తాంతమును దలంచుకొని యొకింత దుఃఖించి స్నేహముతో దన పూర్వచరిత్రను రామున కెఱింగించెను.

ఆ సుగ్రీవుని వృత్తాంతమును విని రాముడు వాలిని వధింతునని ప్రతిన చేసెను. ఆ సుగ్రీవుడును వాలి బలమును గూర్చి వివరించుచు ఆతడు సూర్యోదయమునకు ముందు బయలుదేరి సూర్యోదయమగు వరకు నాల్గు సముద్రములు నెంతమాత్రము శ్రమలేక చుట్టివచ్చెడివాడని చెప్పెను. వాలి నెదిరించి సంహరించు శక్తి రామునకు గలదాయను సంశయము సుగ్రీవునకు మాటి మాటికి గలుగుచుండెను. రాముని పరాక్రమమునందు తనకు నమ్మిక గలుగుటకై పూర్వము వాలిచే సంహరింపబడిన దుందుభియను రాక్షసుని అస్థిపంజరమును సమీపమునందే కొండవలెపడియున్న దానిని రామునకు జూపెను. అపరిమిత బాహుబలము గల రాముడు ఆఎముకలగూడును జూచియిదెంతయని చిరునవ్వు నవ్వి పూర్వము వాలి పాదము మొత్తముతో నెత్తి యామడదూరము విసిరిన దానిని తాను కాలి బొటనవ్రేలితో పూర్తిగా పది యోజనముల దూరము విసరివేసెను. అంతతో తృప్తి చెందని సుగ్రీవుని నమ్మిక కొఱకై ఏడు సాలవృక్షములను పర్వతమును బాతాళమున బడునట్లు ఒక్క బాణముచే ఛేదించెను. అట్లు చేయుట చూచి సుగ్రీవుడితడు వాలిని జంపగలడని సంతుష్టుడై యప్పుడే రామునితో గలసి గుహవలె పర్వతముల నడుమనున్న కిష్కింధయను వానర రాజధాని కేగెను. అట్లువచ్చి బంగారమువలె

పింగళవర్ణము గల సుగ్రీవుడు గొంతెత్తి గర్జించెను. ఆధ్వని విని వానరరాజు వాలి తన గృహమునుండి బయలువెడలెను. వెడలుచున్న భర్తను జూచి తార పోవలదనుచున్నను ఆమెను సమాధానపరచి వచ్చి సుగ్రీవునితో వాలి యుద్ధమునకు దలపడెను. వాలి సుగ్రీవులయుద్ధము జరుగు సమయమున రాముడొకే బాణముతో వాలిని సంహరించెను. అట్లు సుగ్రీవుని కోరికపై రాముడు వాలిని వధించి వాలి రాజ్యమున సుగ్రీవునకు పట్టము గట్టెను.

అంత వానరరాజగు సుగ్రీవుడు కోతుల సైన్యమును రప్పించి సీత యెచ్చట నున్నదో వెదకుడని వారిని నలుదెసలకు బంపించెను. అంత బలవంతుడగు హనుమంతునకు జటాయువు సోదరుడైన సంపాతియను పక్షిరాజు "ఇచ్చటి నుండి నూరుయోజనముల కావల సముద్రమధ్యమున లంకలో సీత యున్నది. కాన నీవు సముద్రమును దాటుము. సీతను జూచెదవు" అని చెప్పెను. ఆ మాట ప్రకారముగా హనుమ నూరుయోజనముల మహాసముద్రము నవలీలగా దాటి సీతాదేవిని గాంచి శ్రీరాముడు తనకిచ్చిన యంగుళీయకము నామెకు గురుతుగా నొసగెను. సుగ్రీవునితో మైత్రి సీతను వెదికించుట మొదలగు రాముని వృత్తాంతము నామెకెరిగించి రాముడు త్వరలో వచ్చునని యామె నూరడించెను.

అటునుండి యశోకవనము బయట ద్వారము కడకు వచ్చి దానిని పిండి చేసెను. ఐదుగురు సేనాపతులను చంపివేసెను. ఏడ్వురు మంత్రిపుత్రులను సంహరించెను. పరాక్రమవంతుడైన అక్ష కుమారుని చూర్ణముగా జేసి, యింద్రజిత్తు వేసిన బ్రహ్మాస్త్రముచే కట్టువడెను. చొరరాని లంకను బ్రవేశించి యనేకులగు రాక్షసులను బరిమార్చిన వానర శ్రేష్టుడు బ్రహ్మవరమున బ్రహ్మాస్త్ర బంధములు తనను వీడిపోవుట తెలిసియును రావణుని జూచు కోర్కెతో రాక్షసులు తన్నీడ్చుకొనిపోవుచున్నను సహించి రావణుని జూచెను. రాక్షసులు తనతోకకగ్ని ముట్టింపగా దానితోనే సీతయున్న ప్రదేశము తప్ప తక్కిన లంకాపురి నంతయును గాల్చి, రామునకు బ్రియము చెప్పుటకై మరల నాతనికడకేగెను. మహాబుద్ధిమంతు

డగు, హనుమంతుడు రామునకు నమస్కరించి తత్త్వయుక్తముగా "చూచితి సీతను" అని విన్నవించెను.

సాహసవంతుడగు హనుమంతునిచే సీతజాడ తెలిసికొని రాముడు సుగ్రీవసమేతుడై సముద్రతీరమున కేగెను. సముద్రుడు తనకు మార్గమీయకుండుటచే కోపించి రాముడు సూర్యునియంత తేజస్సు గలిగిన బాణములతోనతని నల్లకల్లోల పరచెను. నదులకధిపతి యగు సముద్రుడు రాముని కోపమునకు భయపడి తన నిజరూపముతో రాముని యెదుట నిలిచెను. ఆ సముద్రుని విన్నపమును విని రాముడు విశ్వకర్మపుత్రుండగు నలుడను వానరశ్రేష్ఠునిచే సముద్రముపై సేతువును నిర్మింపజేసెను. ఆ సేతువు మీదుగా, రాముడు లంకను జేరి యుద్ధమున రావణకుంభకర్ణాదులను జంపి, సీతను సమీపించెను. చిరకాలము పరుని యింటనున్న ఈమెనెట్లు స్వీకరించునని, రాముడు మిగుల సిగ్గుపడి తల వాల్చెను. అంత రాముడు దేవతలు మొదలైనవారు వినుచుండ "సీతా! నీవు నేత్రరోగికి దీపమువలె నాకు ప్రతికూలురాలవు" అని పరుషముగా పలికెను. అంత సీత పతివ్రత గాన తన భర్త కఠినముగా పల్కిన సహింపజాలక అగ్నిప్రవేశము చేసెను. అటులామె యగ్నిలో ప్రవేశించగానే అగ్నిదేవుడు సీత యెట్టి దోషములేనిదనుటచే రాముడెంతయు సంతసించెను. సీతను స్వీకరించెను. సర్వదేవతలు నతని ధర్మనిరతిని గొనియాడుచుండ రాముడెంతయో ప్రకాశించెను.

మహాత్ముడగు రామునిచే ప్రశంసింపదగినట్లు జరిగిన రావణవధను దలచి స్థావరములు జంగమములు గల ముల్లోకములను దేవతలు ఋషులు ఎల్లరును ఆనందించిరి. అంత రాముడు విభీషణుని లంకాపురమున రాక్షసరాజుగా నభిషేకించి, తన ప్రతిజ్ఞ నిలుపుకొని కృతకృత్యుడనైతి ననుకొనెను. 'విభీషణుడు ప్రధానమైన కైంకర్య సామ్రాజ్యమును వదలి లంకా రాజ్యమునంగీకరించునో లేక భరతుని వలె నిరాకరించునో నాప్రతిజ్ఞ నెరవేరునో లేదో యను సంశయము తొలగి సంతసించెను.

యుద్ధమున విజయమందిన రాముని జూడవచ్చిన దేవతలు వరముల నీయగా వాని ప్రభావముచే మృతినందిన వానరుల నిద్రలేచినవారివలె బ్రతికిరి. పూర్వము రావణుడు కుబేరుని జయించి తెచ్చిన పుష్పకవిమానమును విభీషణుడు తెచ్చి యీయగా రాముడు మిత్రులగు సుగ్రీవ విభీషణాదులతో అందు గూర్చుండి యయోధ్యకు బయలుదేరెను.

సత్యమగు పరాక్రమముతో ప్రకాశించు రాముడు భరతునకిచ్చిన వాగ్దానము ననుసరించి పదనాలుగవ సంవత్సరపు చివఱిరోజున భరద్వాజశ్రమమునకు వచ్చెను. భరద్వాజ కోరికపైనాడచట నుండెను. తనరాక భరతుడెఱుగనిచో మరునాడే యగ్నిలో ప్రవేశించునని తలచి వెంటనే హనుమంతుని భరతుని కడకు పంపెను.

అటునుండి గదలి సుగ్రీవవిభీషణాదులతో పుష్పకమునెక్కి వేగముగా బోవుచూ మాటిమాటికి సీతకు దక్కినవారికి వెనుకటి వింతలను దెలియజేయుచు అప్పుడే భరతుడున్న నందిగ్రామమును జేరెను. పాపరహితుడైన రాముడా నందిగ్రామమున సోదరులనెల్లరను గలసికొని జడలను విడచి సీతాసమేతుడై పూర్వమొకసారి తనతండ్రిచే దత్తమైన రాజ్యమును తిరిగి వనవాసానంతరము స్వీకరించెను.

తమ రాజుగా రామునెప్పుడు చూతుమోయని నిరీక్షించు ప్రజ లానందమందిన మనస్సులతో తమ కోర్కెతీరెనని ప్రీతినొందిరి. తాము రామునెడబాసితిమను బాధ తీరిన వారై చిక్కి కళదప్పిన శరీరములు మరల పుష్టినంది సుఖించిరి. భక్తి పూర్వ కమగు ధర్మాచరణము గలవారై మనోవ్యధ గాని, శారీరక మగు వ్యాధిగాని లేక కఱవు భయమొకింతము లేని వారైరి. జనులెల్లరు రామరాజ్యమున దమకుమారులు మరణించుట తాము చూచి యెఱుగరు. అట్లే స్త్రీలందఱును సదా పతివ్రతలై వైధవ్యము లేక యుండిరి. అగ్నిలో బడిగాని, నీటమునిగి గాని ఎవ్వరు మరణింపకుండిరి. పెనుగాలి వచ్చుననిగాని జ్వరాదులు వచ్చుననిగాని భయమువారికి కలుగలేదు.

పట్టణములు, పల్లెలు ధనదాన్య సంపన్నములై యుండెను. జనులెల్లరు కృతయుగము నందు వలె ఎల్లప్పుడు సంతుష్టులై యుండిరి. ఆ రాముడు వందల కొలది వాజపేయములను జేసి యందు భూరి సువర్ణ దక్షిణ లొసంగి కోట్లకొలది గోవులను అధికమైన ధనమును బ్రాహ్మణులకిచ్చి గొప్పకీర్తిని బొందెను. ఈ రాముడు ప్రతి రాజవంశీయునకును గొంత రాజ్యమిచ్చి వందల కొలది రాజవంశములను వృద్ధి నందించును. లోకమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాల్గుజాతుల వారిని తమ తమ ధర్మము నాచరింపజేయ గలడు. ఇట్లు పదునొకండువేల సంవత్సరములు రాముడు రాజ్యము చేసి వైకుంఠమునకేగ గలడు.

## ఫలశ్రుతి

పరిశుద్ధిని గలిగించునదియు పాపములను హరించు నదియు పుణ్యమును గలుగు జేయునదియు వేదములవలె నిత్యమును బఠింప దగినదియు నగు నీ రామచంద్రుడు నెవడు చదువునో అతడన్ని పాపములనుండి విడువబడును. ఆయువును బెంచు నీబాలరామాయణమును జదువువాడు పుత్రపౌత్రులతో తన వారెల్లరితో భూమిపై సుఖించి పిదప స్వర్గమును జేరి పూజితుడగును. శ్రద్ధాభక్తులతో నీ బాల రామాయణమును పఠించునను, వినినను బ్రాహ్మణునకు వేదవేదాంగ పారంగతత్త్వమును క్షత్రియునకు సామ్రాజ్యమును వైశ్యునకు క్రయ విక్రయములకు యోగ్యమగు వస్తులాభమును శూద్రునకు గొప్పధనమును గలుగును.

**ఇది**

**ఋషిప్రోక్తము ఆదికావ్యము నగు**
**శ్రీమద్రామాయణమున బాలకాండమున**
**బాలరామాయణమను నామాంతరముగల**
**సంక్షేప రామాయణమను ప్రథమసర్గము**

# రెండవ సర్గము

## వాల్మీకి తమసా తీరమున విహరించుట

అట్లు పరమసంతుష్టుడై నారదుడు రామాయణ కధను దెలియజెప్పగా వాక్యకుశలుడగు వాల్మీకి తన ప్రశ్నకు దగినట్టి సమాధానమును కడు శ్రద్ధతో శిష్యసమేతడై విని యాతని వాక్కుల నెంతయో శ్లాఘించెను. అంత దేవఋషి యగు నారదుడు వాల్మీకిచే దగిన విధముగా ప్రదక్షిణ నమస్కారములచే పూజింప బడినవాడై పోయివచ్చెదనని యతని యనుజ్ఞ వడసి యంతరిక్షమున కేగెను.

అట్లు నారదుడు దేవలోకమున కేగగా వెంటనే వాల్మీకి మధ్యాహ్న స్నానమునకై గంగానదికి సమీపముననే యున్న తమసానదీ తీరమున కేగెను. పరిశుద్ధముగా నున్న యా నదీజలమును జూచి తన వెంట నున్న శిష్యునితో ఇట్లనెను. "ఓభరద్వాజా! బురద లేక సుందరమై నిర్మలమై యుత్తమ మనుజుని మనస్సువలె నున్న యీ జలమును జూడుము. నాయనా! ఈ పాత్రనట నుంచుము. ఆ నారవస్త్రము నిటు తెమ్ము. నిర్మలమైన యీరేవులో స్నానము చేసెదను."మహాత్ముడు అగు వాల్మీకి యిట్లు చెప్పగనే గురుసేవా నిరతుడగు భరద్వాజుడు నట్లే మునికి వల్కలముల నందించెను. జితేంద్రియుడగు నా వాల్మీకి శిష్యుని చేతినుండి యావల్కలముల నందుకొని యావిశాలమైన యడవినంతయు జూచుచు తిరిగెను.

## బోయ క్రౌంచ పక్షిని వధించుటను ఋషి చూచుట

ఆశ్చర్యము శాపానుగ్రహ సమర్థుడయ్యును. నా మహర్షి యాప్రాంతమున నొక్కచో విడువక రతికుతుహలముతో మధురముగా కూయుచున్న క్రౌంచపక్షుల

జంటను జూచెను. అంతలో రతిసమయమున జంపకూడదను నిర్ణయము తెలియని వాడును, పశువులు పక్షులతో సహజముగ శత్రుత్వముగల పాపాత్ముడునగు నొక బోయవాడు ఆజంటనుండి మగపక్షిని ముని చూచుచుండగానే చంపెను. బోయవానిచే చంపబడి రక్తముతో తడువబడిన శరీరములో నేలబడి దొరలుచున్న మగని జూచి యాడుపక్షి వినువారికి జాలిగలుగునట్లు పెద్దగా దుఃఖించెను. ఎప్పుడైనను దన్ను వీడక వెంట సంచరించు నాతడిట్లు విలవిల దన్నుకొనుచు నేల బడియుండుట చూచి పాప మా యాడు క్రౌంచము కీచుకీచుమని కూయుచు, భర్త చెంత వ్రాలి ముక్కుతో అతని మేను గీరుచూ, బోయను జూచి పరువెత్తుచు దాపున నున్న కొమ్మపైవ్రాలి తన మగని జూచుచు విలపించచుండ – దాని దురవస్థను, నేల గూలిన క్రౌంచమును జూచి ధర్మగుణముగల యా మహర్షికి మిగులదయ గలిగెను. రతిపరవశమైన పక్షిని గొట్టుట ధర్మము కాదని నిశ్చయించి కనుబొమలు ముడి వడుచుండగా, కోపమున కన్నులెఱ్ఱవడగా కఠినుడగు నా కిరాతుని జూచి యిట్లు పలికెను.

**శ్లో॥ మానిషాద! ప్రతిష్ఠాం త్వ। మగమః శాశ్వతీస్సమాః ।**
**యత్ క్రౌంచమిథు నాదేక। మవధీఃకామమోహితమ్ ॥**

(తెలియు మా నిషాదుండ! ప్రతిష్ఠ నీక ప్రాప్తమయ్యెడు శాశ్వతహాయనముల గ్రౌంచ మిథునంబునందు నొక్కండు నీవు కామ మోహితముం జంపు కారణమున)

"ఓరీ కిరాతుడా ! నీవు క్రౌంచపక్షుల జంట నుండి కామపరవశమగు మగపక్షిని జంపితివి. కనుక శాశ్వతమైన అప్రతిష్ఠనందుదువు గాక"

ఆపక్షులను రెండిటిని జూచుచు 'మానిషాద' మొదలైన వాక్యములను బలికిన యావాల్మీకి తన మనంబున ఈపక్షి కొఱకై శోకపీడతుడనై నేనేమి పలికితి? నని యాలోచించెను. మిగులబుద్ధి శాలి, శాస్త్రజ్ఞానముగలవాడు నగు

వాల్మీకి మహర్షి యట్టులాలోచించి శిష్యునితో నీవాక్యములు బలికెను”. ఆయాడుపక్షి దుఃఖమును గాంచి శోకపీడితుడనైన నా నోటినుండి బయలు వెడలిన యీ మాటలు నాలుగుపాదములను ఒక్కొక్క పాదమున సమానముగా ఎనిమిదియక్షరములను గలదియై వీణ తీగలయందు తాళలయలతో పలికింపదగినదై శ్లోకలక్షణములు గలదై శ్లోకమన జెల్లునే కాని వేఱొకటి గాదు. అని మునిపల్కిన విని యత్తమమై శ్లోక రూపమై యున్న యావాక్యములను భరద్వాజుడు కంఠస్థ మొనర్చెను. అతడట్లు తన శ్లోకమును వాచోవిధేయము చేసికొనుటచే గురువగు వాల్మీకి మిగుల సంతుష్టుడయ్యెను.

అంత నామునీశ్వరుడు తమసా జలంబుల యధావిధిగా స్నానమొనరించి యా శ్లోక విషయమునే తలంచుచు ఆశ్రమమునకు మఱలెను. శిష్యుడగు భరద్వాజుడును నదీ జలములతో నిండిన పాత్రను తీసుకుని ముని వెనుకనే నడచెను. వాల్మీకియు శిష్యునితో గూడ యాశ్రమమును ప్రవేశించి దేవపూజాది ధర్మముల నాచరించి యొకచో గూరుచుండి అప్రయత్నముగా దననోటి నుండి వెలువడిన శ్లోకమున గూర్చి యాలోచించునే పురాణ పారాయణాదుల నొనర్చుచుండెను.

## బ్రహ్మ వాల్మీకిని చూడవచ్చుట

అంతట లోకములను సృష్టించు వాడును, నాలుగువేదములకు నెలవైన నాలుగు ముఖములు గల వాడును అగు బ్రహ్మ ముని శ్రేష్ఠుడగు వాల్మీకిని జూడవలెననెడు కోర్కెతో నచ్చటికి వచ్చెను. అట్లు వచ్చిన యా బ్రహ్మదేవుని వాల్మీకి చూచి వెంటనే లేచి నెమ్మదిగా మనస్సును స్వాధీనమొనరించుకొని చేతులు జోడించి పరమాశ్చార్యముతో నిలిచి ప్రణామమొనరించి శాస్త్రోక్తముగా మీకు అవిచ్ఛినముగా కుశలమే గదా ! యని కుశల ప్రశ్నలనడిగి అర్ఘ్యపాద్యాదులతో పూజించెను. పిమ్మట నా బ్రహ్మ వాల్మీకిచే సాదరముగా జూపబడిన యాసనమునందాసీనుడై వాల్మీకిని జూచి కూర్చుండ నియోగింపగా

మునియు నొక చిన్న యాసనముపై గూర్చుండెను.

బ్రహ్మయే స్వయముగా తన యెదుట గూర్చుండి యున్నను నా క్రౌంచపక్షిని గూర్చిన చింతయే ఆయన మనస్సున దిరుగుచుండెను. సహజమగు విరోధముతో దుర్బుద్ధితో పాపస్వభావుడగు బోయ యెట్టి నింద్యమగు పనిని జేసినాడు. రతిక్రీడాపరవశమై మనోహరమగు స్వరము గలిగిన పక్షి నే కారణము లేక కూల్చిన యా యెఱకు వాడెంత కఱకు వాడు. అని యాపక్షిని చంపుటను చూచుటచే కలిగిన దుఃఖముచే మరల నా క్రౌంచినే తలంచుచు నప్రయత్నముగ బలికిన "మా నిషాద" అను శ్లోకమును మనసులో నే పఠించెను.

## బ్రహ్మ వాల్మీకిని రామాయణము రచింప నియమించుట

అంత బ్రహ్మదేవుడా ముని శ్రేష్ఠుని జూచి నవ్వుచూ మహర్షీ ! యేల చింతించెదవు. నీవు రచించినదొక శ్లోకమే కాని పదసముదామమాత్రమో శాపమో కాదు. నా సంకల్పము ననుసరించి సరస్వతియే నీనోట నిల్చి యిట్టి వాక్కులను వెల్వరించినది. అంతేగాని యేదో ఆలోచన లేని విధముగా సంభవించినది గాదు. ఓమునిశ్రేష్ఠా! నిర్మలమైన భక్తితో శ్లోకమయముగా రామచరిత్రము నీవు నారదుని నుండి వినినట్టులే రచింపుము.

ఆ మతిమంతుడగు రాముని యొక్కయు తత్సోదరుడగు లక్ష్మణుని యొక్కయు సకల రాక్షసుల యొక్కయు సీతయొక్కయు తదితరుల యొక్కయు జనులెరిగిన – ఎఱుగని వృత్తాంతము లెల్ల నీకు స్పష్ఠముగా తెలియగలవు. నీవు రచింపబోవు మహనీయ కావ్యమున అసత్యముగాని, దోషయుక్తము గాని యుండబోదు. కావున నీవు శ్లోకరూపమై పాపముల బోగొట్టునదై ఆనందముగలిగించు రామకథను రచింపుము. భూతలముపై కొండలెంత కాలము నిలిచి యుండునో, నదులెంతకాలము ప్రవహించుచుండునో యంతవఱకీ రామాయణకథ లోకమున ప్రచారమున నుండును. ఎంతకాలము నీ రామాయణ కావ్యము ప్రచారమున నుండునో అంతకాలము నిలుచు సత్కీర్తిని

బొంది శరీర నాశపర్యంత మిటనుండి యా మీదట మాసత్యలోకమున కేతెంతువు గాక ! అని పలికి భగవంతుడగు బ్రహ్మయటనే యంతర్ధాన మందెను.

పిమ్మట మహాత్ముడగు వాల్మీకి మునియు శిష్య సమేతుడై ఆ యద్భుత సంఘటనమున కాశ్చర్యము నందెను. ఆతని శిష్యులెల్లరు తమ మనస్సు లానందమునలో దేలియాడుచుండ నా శ్లోకమునే మరల మరల చదివిరి. అట్లు పలుమారు పఠించుచు వారు తమలో తాము ఆశ్చర్యముతో సమాన వర్ణములు గల నాలుగు పాదములతో మునీశ్వరునకు గలిగిన శోకమే శ్లోక రూపమును బొంది శ్రీకరమయ్యె నిదియెంత విచిత్రమని తలపోయుచుండిరి. ధ్యాన నిష్ఠుడైయున్న వాల్మీకి మహర్షికి 'నేనిట్టి శ్లోకములతోనే రామాయణమును కావ్యముగా రచించెదనను బుద్ధి కలిగెను. మనోహర వాక్యములతో, రసానుగుణములై సమవర్ణములైన వివిధవృత్తములతో, వాచ్య లక్ష్య వ్యంగ్య రూపములగు అర్థములతో వాచక లక్షక వ్యంజకములగు శబ్దములతో నొప్పులొలుకు రామాయణ కావ్యమును రచించెదను. శాస్త్ర సమ్మతమగు తత్పురుషాది సమాసములను గుణము, వృద్ధి మున్నగు సంధులను సమత అర్థయుక్తి మాధుర్యము మొదలుగా గల గుణములను, ఉపమాద్యలంకారము లను గలిగి రఘువంశరాజులలో శ్రేష్ఠుడగు రాముని చరితమును గూర్చియు రావణ సంహారమును గూర్చియు వివరించు నీ గ్రంథమును మీరెల్లరు వినుడని శిష్యులతో బలికెను.



# మూడవ సర్గము

## వాల్మీకి యోగ దృష్టితో రామాయణ కథ నెఱుగుట

ధర్మాతుడు అగు వాల్మీకి ముని మిగులశ్రద్ధతో మహాధర్మయుక్తమైన యా రాముని కథనంతయు యథార్థముగా తెలినికొనదలచి ఆచమనము చేసి చేతులు జోడించి తూర్పుదిక్కుగా కొసలు గల దర్భాసనము నందు సుఖాసీనుడై పూర్వము నారదునిచే సంక్షేపముగా విన్న రామచరితమును విపులముగా గనదలచి యోగదృష్టితో సవలోకింపదొడగెను. రాముడు, లక్ష్మణుడు, సీత, దశరథమహారాజు, అతని భార్యలు–రాష్ట్రము–వారికి సంబంధించిన సమస్త విషయములు విశదముగా జూచెను. వారి వారి నవ్వులు మాటలు, తిరుగుట, పనిచేయుట అను క్రియాకలాపమెల్లను బ్రహ్మయనుగ్రహబలముచే వాల్మీకి మహర్షికి జరిగినది జరిగినట్లు ఉన్నది యున్నట్లు కనిపించసాగెను. సత్యప్రతిజ్ఞుడగు రాముడు సీతాలక్ష్మణ సమేతుడై దండకారణ్యమున నెట్లు సంచరించునో, యది యెల్లను మహర్షి చూడగలిగెను. అట్లు చూచుచు మహాత్ముడగు వాల్మీకి బ్రహ్మ ప్రసాదమున రాముడు మున్నగువారు మున్నెచ్చటెచ్చట నేమేమిచేసిరో అరచేతిలో నున్న యుసరిక పండు వలె స్పష్టముగా కనుగొనెను. రామ గుణములు గల చరిత్రను జూచుటచే మిగుల ప్రకాశమానుడైన వాల్మీకి యా రామవృత్తాంతము నంతయు – సముద్రము శంఖములు ముత్తెపు జిప్పలతో గూడినదయ్యును. బ్రధానముగా రత్నాకరమైనట్లే అర్థకామమెల ప్రధానముగా గలిగి ధర్మ మోక్షములను పురుషార్థములను ప్రతిపాదించునదై శబ్ధమాధుర్యముచే చెవిని, అర్థమాధుర్యముచే మనస్సును ఆకర్షించునదైన కావ్యముగా రచింపబూనెను. పూర్వము నారదముని తనకెట్లు

చెప్పెనో అటులనే రఘువంశమున బుట్టిన ఆ రాముని చరితమును వాల్మీకి మహర్షి రచింపదలంచెను.

అంత ప్రారంభించి రామచరిత్రమునందు విష్ణువు యొక్క అవతారమై దశరథుని తపోబలముచే ఫలించిన రాముని గొప్ప పుట్టుక. అతడు తాటకను ఆమెపుత్రులను జంపినట్టి పరాక్రమము, అతడందఱకు అనుకూలుడై యుండుట, ఎదుటివారి తప్పులను మన్నించు అతని ఓర్పు ఎవ్వరిని నొప్పించని సత్యస్వభావమును, విశ్వామిత్రుడు యాగసంరక్షణమునకై తీసుకొనిపోయినప్పుడు రామలక్ష్మణులకు జెప్పిన వివిధములైన ఆశ్చర్యజనకములైన కథలును, శివధనుర్భంగము, సీతావివాహము, ఊర్మిళ మొదలగు వారి వివాహము, పరశురామునితో రామునకైన వివాదమును, శ్రీరామగుణ వర్ణనము, పట్టాభిషేకప్రయత్నము, కైకేయి దుష్టహృదయము, దాని ఫలముగా రాముని పట్టాభిషేకవిఘ్నమును, రామునినడవులకు బంపుటయు, దశరథుడు పుత్రశోకముతో మరణించుటయు, ప్రజలు దుఃఖించుటయు, వంచనచే బ్రజలను విడిపించుకొని రాముడడవులకు వెళ్ళుటయు గుహునితో సంభాషించుటయు , సూతుడయోధ్యకు మరలి వచ్చుటయు, గుహుని సాయమున సీతారామలక్ష్మణులు గంగానదిని దాటుటయు, భరద్వాజుని సందర్శించుటయు, ఆయన ఆజ్ఞను బొంది చిత్రకూటమును వాస్తు శాస్త్రము ననుసరించి పర్ణశాల ను నిర్మించుకొనుటయు భరతుడచటికేతెంచి రాముని ప్రసన్నుని జేసి కొనుటయు, తండ్రికి రాముడు జలములతో తర్పణమిచ్చుటయు, అన్ననుండి భరతుడు పాదుకలను పొందుటయు, ఆ శ్రేష్టములగు పాదుకలను పట్టాభిషేకమొనర్చి భరతుడు నంది గ్రామమున నివసించుటయు, రాముడు చిత్రకూటమునుండి దండకారణ్యమున కేగుటయు, విరాధుని వధించుటయు, శరభంగమునిని దర్శించుటయు, సుతీక్ష్ణ మహామునిని గలిసి కొనుటయు, అనసూయ దేవితో కలసి కూర్చుండటయు, ఆ యత్రిముని పత్ని సీతాదేవికి

చందన మిచ్చుటయు, అగస్త్యుని, అతని సోదరుని, సుదర్శనుని సందర్శించుటయు, జటాయువును గలిసికొనుటయు, పంచవటి కేగుటయు, శూర్పణఖ రామలక్ష్మణుల గామించుటయు, లక్ష్మణుడామెను ముక్కు, చెవులు గోసి విరూపను జేయుటయు, ఖరదూషణ త్రిశిరస్కులను పదునాల్గువేల రాక్షసులను రాముడొక్కడే సంహరించుటయు, ఆ వార్త తెలిసి రావణుడు లేచి బయలుదేరుటయు, మాయలేడియగు మారీచుని జంపుటయు, రావణుడు సీతనపహరించుటయు, రాముడు శోకించుటయు, జటాయువు రావణునిచే జంపబడుటయు, రాముడు అగ్నిసంస్కారము చేయుటయు, కబంధుని గాంచుటయు వాని శాపవిమోచనమును, పంపాసరస్సు జూచుటయు, శబరిచే పూజలందుటయు, హనుమంతుని జూచుటయు, ఋష్యమూకపర్వతమున కేగుటయు, సుగ్రీవునితో గలియుటయు, అతనికి విశ్వాసము గలిగించుటయు, అగ్నిసాక్షిగా స్నేహము చేయుటయు, వాలి సుగ్రీవుల యుద్ధమును, రాముడు వాలిని వధించుటయు, సుగ్రీవుని వానరరాజుగా జేయుటయు, తార దుఃఖించుటయు, రామసుగ్రీవుల యొప్పందమును, వర్షాకాలమును గడుపుటయును శ్రీరాముని కోపమును, సుగ్రీవుడు సేనను సమకూర్చుటయు, నలుదిక్కులను సీతను వెదుకుటకై వానర ముఖ్యులను బంపుటయు, సుగ్రీవుడు ద్వీపముల నదీనదముల స్థితిగతులను దెల్పుటయు, రాముడాంజనేయున కంగుళీయకము నిచ్చుటయు, సీత కనబడకపోవుటచే వానరుల ప్రాయోపవేశమును, వానరులు సంపాతిని జూచుటయు, వారు మహేంద్ర పర్వతము నెక్కుటయు, సంపాతి చెప్పినట్లు హనుమంతుడు నూఱుయోజనముల సముద్రమును దాటుటయు, సముద్రుని మాటపై మైనాకుని జూచుటయు, సింహిక యను రాక్షసిని జంపుటయు, హనుమ లంకయందున్న మలయపర్వతమును జేరుటయు, ఆరాత్రి లంకలో బ్రవేశించుటయు, లంకిణిని సంహరించుటయు, ఒంటరిగా ఆలోచనము జేయుటయు, రావణుని

జూచుటయు, పుష్పకవిమానము గాంచుటయు, పానశాలకేగుటయు, అంతఃపురస్త్రీలను జూచి శంకించుటయు, గురుతుగా ఉంగరమును సీతకిచ్చుటయు, రాక్షసస్త్రీల బెదిరింపు మాటలు, త్రిజట కలగనుటయు, సీత హనుమంతునకు గురుతుగా చూడామణి నొసగుటయు, హనుమంతడచ్చటి చెట్లను విరుచుటయు, రాక్షసస్త్రీలు పారిపోవుటయు, రావణభటులను, అక్షకుమారుని జంపుటయు, హనుమంతుడు బ్రహ్మాస్త్రబద్ధుడై రావణుని దర్శించుటయు, లంకాదహనమును, తిరిగి సముద్రమును దాటుటయు, వానరులు మధువనమున తేనెలు పండ్లు నారగించుటయు, చూడామణిని రామున కిచ్చుటయు, రాముడు వానరసేనతో సముద్రతీరమును జేరుటయు, నలునిచే సేతువు నిర్మింప జేయుటయు, వానరవీరులతో రాముడు సముద్రమును దాటుటయు రాత్రి లంకను ముట్టడించుటయు, విభీషణ శరణాగతియు, ఇంద్రజిత్తు మొదలగు వారి జయింప నుపాయమును విభీషణుడు చెప్పుటయు, కుంభకర్ణ మరణమును, ఇంద్రజిత్తు సంహరింపబడుటయు, రావణుని బరిమార్చుటయు, రాముడు లంకానగరమున సీతను నిరసించుటయు, సీత అగ్నిప్రవేశమును, దేవతల దర్శనము, సీత శుచివ్రతయని తెలిసి రాముడు స్వీకరించుటయు, లంకానగరమున విభీషణు నభిషేకించుటయు, వానర రాక్షసులతో పుష్పకము నెక్కి యయోధ్యకేగుటయు, భరతుని గలియుటయు, రాముడు పట్టాభిషేక మహాభ్యుదయమును బొందుటయు, సైన్యమునంతయు బంపి వేయుటయు, తన రాష్ట్రము నానందింపజేయుటయు మున్నగు కథలను ఆరుకాండములుగాను, తరువాతి సీతాపరిత్యాగాది కములయిన జరుగనున్న కథనంతయు నుత్తరకాండముగాను. భగవంతుడగు వాల్మీకిముని రచించెను.



# నాల్గవ సర్గము

## రామాయణ వైలక్షణ్యము

బ్రహ్మ యనుగ్రహముచే లభించిన దివ్యజ్ఞానము గలవాడగు ఋషియు (ఋషి కాని వారు కావ్యము రచింప జాలడను నార్యోక్తి ననుసరించిం ఋషి యగుటచే) కావ్యనిర్మాణ సమర్థుడగు వాల్మీకి, రాముడు రాజ్యపాలన చేయుచున్న కాలమున నాతని చరిత్రమును చిత్రమైన పదములతో కావ్యముగా లోకోపకారమునకై వెలయించెను. ఆ రామాయణ మహాకావ్యము ఇరువది నాల్గువేల శ్లోకములతోడను, ఐదువందల సర్గలతోడను, యుద్ధకాండము వఱకాఱు కాండములతోడను, పవిత్రమైన రాముని భావిచరిత్ర గల యుత్తర కాండములతోడను నొప్పుచుండును. రసవత్తరమైన ఈ రామాయణమును కంఠస్థ మొనరించి గానము చేయగలవారై దీనిని ప్రచారములోనికి దెచ్చు సమర్థులెవ్వరైన లభింతురా? యని మిక్కిలి జ్ఞాన సంపన్నుడగు వాల్మీకి యాలోచించు చుండెను.

## కుశలవులు రామాయణ కథాగానము నభ్యసించుట

అట్లాలోచనా నిమగ్నుడైయున్న వాల్మీకి మునికడకు మునివేషధారులు కుశలవులు వెళ్ళి పాదాభి వందనమొనర్చి తామాకావ్యమును గానముచేసెదమని పల్కిరి. గురుశుశ్రూషయను ధర్మము నెఱంగి యధ్యయనము పూర్తియగు వఱకు స్థిరప్రయత్నము గల రాజకుమారులును, సమస్త విద్యలు నేర్చి కీర్తి నందినవారును, తన యాశ్రమముననే నివసించి ప్రీతిపాత్రులయిన వారును, అగు నా సీతాతనయులను జూచి వీరు తన యొద్ద రామాయణము నపదేశమందుటకు తగినవారని వాల్మీకి తలంచెను. సాంగముగా చతుర్వేదముల

నధ్యయనము చేసిన వారనియు, వేదార్థమును విపులముగా తెలియ జేయుటయను గొప్ప ఫలమునందింప యోగ్యులనియు, తలంచి వారిని స్వీకరించెను.

మహాగుణవంతుడగు రాముని గూర్చి చెప్పుటచే రామాయణమనియు, మహాసాధ్వియగు సీత చరిత్రయే ప్రధానముగా గలదగుటచే సీతాచరిత్రమనియు, రావణవధ ఫలముగా గల దగుటచే రావణవధ మనియు, బేర్కొనదగిన యుత్తమోత్తమ మహాకావ్యమును వాల్మీకి మౌని వారలకు బూర్తిగా నుపదేశించెను. చదివినను, పాడినను శ్రావ్యమైనది. గానానుకూలమైన ద్రుతము, మధ్యమము, విలంబితము నను మూడుప్రమాణములు గలది. నిషాదము, ఋషభము, గాంధారము, షడ్జము, మధ్యమము, ధైవతము, పంచమము నను నేడు స్వరములు–జాతులు గలది. వీణావాదన యోగ్యమైనది. శృంగారము, కరుణము, హాస్యము, వీరము, భయానకము, రౌద్రము, భీభత్సము, అద్భుతము, శాంతము అను నవరసములతో గూడినదియగు నీ కావ్యమును కుశలవులు మౌనివలన నేర్చిరి.

**రాముని చరిత్ర విఖ్యాతి నందుట**

గాన కళాప్రవీణులై, వీణావాదనమున సర్వసాధనము బాగుగా దెలిసి మనుష్య వేషముననున్న గంధర్వుల వలె నొప్పువారై , రామశరీరమను బింబమునుండి యేర్పడిన ప్రతిబింబములా యనునట్లున్న యా కుశలవులు సావధానులై బుద్ధిమంతులై రాముని పూర్వ వృత్తాంతమును దెలుపు రామాయణమను నుత్తమకావ్యమునంతయు జదివి, ఋషులు, బ్రాహ్మణులు, సాధువులు నున్న సభలలో గాన మొనర్చిరి.

అంత నా కుశలవులు రాముడశ్వమేధము చేసిన సందర్భమున నయోధ్యకేగి, నిశ్చలబుద్ధి గలవారును, అశ్వమేధయాగమును బూర్తిచేయించి సుఖాసీనులై యున్న వారును నగు ఋషుల సమీపమున నీ కావ్యమును గానము చేసిరి.

వినిన మునులెల్లరు మిక్కిలి యాశ్చర్యముతో కన్నుల నానంద బాష్పములు గార బాగుబాగని ప్రశంసించిరి. ధర్మమందు ప్రీతి, నిర్మలత్వము గల యామునులు ప్రీతి నందిన వారై మెచ్చదగిన కావ్యమును గాన మొనరించిన వారిని ప్రశంసించిరి. ఆహా ! ఎంత మధుర గానము ! శ్లోకమాధుర్య మంతకన్న మిన్నగా నున్నదే! ఎప్పుడో జరిగిన కథ కన్నులకు గట్టునట్లు చూపబడినదే! అను వారి ప్రశంసలు మరింత యుత్సాహమును గల్గింపనింకను తియ్యగా పాడుచుండిరి.

వినువారలలో నొక ఋషి మిగుల ప్రీతినంది వారికొక కలశమును, మఱియొక ఋషి నారవస్త్రములను, మఱికొందఱు జందెములను, దండములను, తావళములను, గమండలమును బహుమానములుగ నిచ్చిరి.

**కుశలవులను శ్రీరాముడు పిలుపించుట**

ఇట్లు యజ్ఞవాటమున, రథమార్గమున రాజమార్గమున, వాడవాడల, పున్నమ జాబిల్లిని బోలు మోములతో, ఆనపకాయబుఱ్ఱలు గల వీణియలు దాల్చిన భుజములతో, వీణతంత్రులు మీటు లేతవ్రేళ్ళతో, చూడముచ్చట గొల్పుచు, మధురగానము వెలయించుచున్న ఆ బాలకులను భరతుడు చూచి, చెప్పగా రాముడు వారిని తన భవనమునకు బిలిపించుకొనెను.

దశరథునిచే స్వర్గమునుండి గొనిరాబడిన బంగారు సింహాసనముపై తన పరమపురుషత్వమునకు దగినట్లుగా నాసీనుడై మంత్రులచే సోదరులచే పరివేష్టితుడై యున్న యశ్వమేధ దీక్షితుడగు ఆ రాముడు సుందర రూపులగు నాకుశలవులను జూచి, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులతో నిట్లనెను. దివ్యతేజో విరాజితులగు నీబాలురు పాడుచున్న విచిత్రార్థయుక్తములగు పదములతో గూడిన మనోహరగానము నాలించితిరా? యెంత మధురముగా నున్నదని మెచ్చుచు రాముడు వారిని గాన మొనర్పుడని కోరెను. మధురస్వరముతో తాళలయాన్వితముగా వీణానాదముతో మేళవించి, స్పష్టముగా, అర్థవంతముగా

వారా రామాయణము గానముచేసిరి. ఆ పాట సర్వావయములను మనస్సును సుఖపెట్టునదై శ్రవణపుట పేయమై యా సభవారి నెల్లర నాహ్లాదపరిచెను. అంతరాముడు సదులనుజూచి "ఈ కుశలవులు మునివేషములు ధరించి యున్నను రాజ లక్షణములు గలవారును, గాయకులయ్యును దపస్వులై యున్నారు. నాకును, లోకమునకును శుభప్రదమైన సీతాచరితమును బాడుచున్నారు వినుడు". ఇట్లు శ్రోతలను ప్రోత్సహించిన రాముని వాక్కుచే ప్రేరితులై యాబాలురివురు – మార్గదేశి గాన పద్ధతులలో కావ్యగాన మొనరించిరి. రాముడును ఉన్నతాసమున గూర్చుండుటచే తను ఒంటరి వానిగా భావించి మెల్లగా సింహాసనము నుండి దిగి సభను జేరి వీనుల విందుగా వారి గానమును ఆసక్తితో వినుచు ఆహా ! యని మెచ్చుకొనుచు నా రామకథా సర్వస్వమును వినసాగెను.



# ఐదవ సర్గము

## శ్రీ రామాయణ కథా ప్రారంభము

పూర్వ మీ భూవలయము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మనువు మొదలగు రాజశ్రేష్ఠు లెందు జన్మించిరో, అరువదివేల మంది పుత్రులచే సాగరము ద్రవ్వించిన సగర చక్రవర్తి యే వంశమున ప్రఖ్యాతి వహించెనో, అట్టి యిక్ష్వాకు వంశమున బుట్టిన రామునిచరిత్రను వాల్మీకి మహర్షి రామాయణమను పేర రచించెను. అది పాపములు హరించునది. బ్రహ్మచే ప్రభోధింపబడినది. నారదమునిచే వినిపించ బడినది. ధర్మకామార్థప్రదమైన దీనిని మొదటినుండి యసూయలేక శ్రద్ధతో వినదగునని వాల్మీకి చెప్ప నారంభించిన దానిని కుశలవులు గానము చేయనారంభించిరి.

## అయోధ్యాపుర వర్ణనము

సంతుష్ఠులగు ప్రజలతోను, ధనధాన్య సంపదలతోను నిండి యుండి కోసలమని ప్రసిద్ధిగాంచిన విశాలమగు దేశము సరయూనదీ తీరమున కిరుప్రక్కల వ్యాపించియున్నది. ఆ కోసల దేశమున మనుజుల కధిపతియైన మనువుచే నిర్మితమై లోక ప్రసిద్ధిమైన యయోధ్యయను పట్టణము కలదు ఆపట్టణము పంద్రెండు యోజనముల పొడవు, మూడు యోజనముల వెడల్పు గలిగి నగరరాజమున దగియుండును. ఇరువంకల మంచి పుష్పములను వెదజల్లు తరువులు గల్గి తీర్చిదిద్దబడిన రాజమార్గములతో నొప్పుచుండెను. గొప్ప తలుపులుగల ద్వారములు సుగంధయుక్తములగు తోరణములు గలదై లోపల చక్కగా నేర్పరుప బడిన అంగడి వీధులతో, సర్వ విధములగు యంత్రాయుధములతో ఆ పురమలరుచుండెను. సకల కళాకోవిదులతో వందిమాగధులతో శ్రీమంతులతో, ధీమంతులతో, నర్తకిగణముతో కళకళ లాడుచుండెను.

మిక్కిలి ఎత్తైన రాజభవనములను వానిపై నెగురుచున్న జెండాలును, వందల కొలది మందిని నొకేమారు చంపగల పెద్ద ఫిరంగులును గలిగి యుండెను. పెద్దపెద్ద నర్తనశాలతో, పూదోటలతో, తీయమామిడి తోపులతో నొప్పుచు, చుట్టునున్న ప్రాకారమే అందమైన మొలనూలుగా గలిగి, విశాలమైన లోతైన యగడ్త గలిగి శత్రువులకు ప్రవేశింపరానిదై ఆ నగరము ప్రకాశించుచుండెను. ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, ఆవులు అత్యధికముగా గలిగియుండెను. వివిధ దేశాగతులగు సామంతులతో వ్యాపారులతో క్రిక్కిరిసియుండెను. అందలి రాజభవనములు మిగుల శ్రద్ధతో పొదగబడిన వివిధ రత్నములు గలవి. లీలోద్యానములు క్రీడాపర్వతములతో నొప్పుచుండెను. ఇట్లు సంపూర్ణముగా దేవేంద్రుని యమరావతిని బోలియున్న ఆ నగరమున నలుదిక్కుల రాజవీధులు గలిగి సుందరయువతి జనులచే కళకళలాడుచు నవరత్నఖచితములైన విమానములనెడు రాజభవనములు వెలుగొందుచుండ నదియొక జూదపు పలకవలె నొప్పును. ఆపురమందలి జలము చెఱకుపాలవలె తియ్యనిది. పవిత్రమైనది–ముత్యములవలె స్వచ్ఛమైనది. తేలికయయినది. భేరులు, మద్దెలలు, వీణలు, వేణువులు మొదలగు వాద్యముల ధ్వనులు సుందరీమణుల కాలియందెల సవ్వడులు కలిగి అందలి భవనములు తపసిద్ధులు సంపాదించుకొన్న విమానవరములో యను నట్లుండెను.

## అయోధ్యాపుర వైశిష్ట్యము

తల్లిదండ్రులు, భార్యాపుత్రులు, మనుమలు, బందుగులు ఇంటినిండుగ లేని యిల్లొక్కటైన మచ్చుకైనను గానరాదు. చదువురాని వారు కాని, దుష్టుడుకాని, దొంగకాని, నాస్థికుడు గాని, ఆపురమున వెదకినను కానరాడు. అందలి బ్రాహ్మణులు వేదవేదాంగముల నెఱిగినవారు. శమదమాదులు గలవారు. క్షత్రియులు సత్యపరాక్రములు. వణిజులు ధార్మికులు ధనసంపన్నులు. నాల్గవజాతివారు శ్రద్ధాసమేతులు. ఇట్టి యామహానగరమును అజపుత్రుడగు దశరథ మహారాజు పరిపాలించుచుండెను.

# ఆరవ, ఏడవ సర్గములు

అయోధ్యాపురాధిపతి యగు నా దశరథమహారాజు వేదవేదాంతముల యర్థ మెఱిగినవాడు. మహాపరాక్రమశాలి. పౌరులను ప్రీతిగలిగించువారు. అనేక యజ్ఞములొనరించిన వాడు. ప్రజోపయోగకరములగు తోటలు, బావులు, చెఱువులు నిర్మింపజేసినవాడు. కీర్తిచేతరాజు (చంద్రుడు) ధైర్యము చేత పర్వతరాజు అతనికి సాటి రాగలరాజు రాజలోకమున లేదు.

## మంత్రిజన వివరములు

ఆ మహారాజునొద్దనున్న మంత్రిజనులు మతిమంతులును, ఇంగితజ్ఞులను, ధర్మగుణము గలవారును, మంత్రాలోచనమున సాటిలేనివారును, శౌర్య వంతులను, గొప్ప రాజభక్తి గలవారును, అర్థసాధనమున, శత్రు విజయమున నేర్పుగలవారును, నెల్లప్పుడు తమ రాజు హితమునే కోరువారును నై రాజకార్యములలో మిగుల సహకారులై యుండిరి. రాజులకు ఏడుగురో ఎనమండ్రో మంత్రులుండవలెనను మనువచనము ననుసరించి ఆదశరథుని యొద్ద ఎనమండ్రు మంత్రులుండిరి. వారు దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడు చివఱివాడు. స్వరాష్ట్రమున గాని పరరాష్ట్రమున గాని ఎప్పుడేమి జరుగుచున్నదో చారులవలన గ్రహించి, తప్పుగలిగిన తమబిడ్డలనైన దండించువారై, నిరపరాధులైన పగవారినైన క్రోధమున శిక్షింపక సమబుద్ధి గలిగివారు వర్తించెడివారు. అన్వీక్షకి మొదలగు రాజవిద్యల నారితేరి మాత్సర్యములేక ఎల్లరతో చిఱునగవుతో మాటలాడు వారై యుండిరి. ఎట్టి పరిస్థితులయందును

నసత్యమాడరు. ధనార్జనము చేసి ధనాగారము నింపుటయందు ధనము వెచ్చించి చతురంగ బలమును సమకూర్చుటయందును నిమగ్నులైయుందురు. త్రికరణ శుద్ధిగలిగి ఎల్లరు నొక్కటై రాజ్యవ్యవహారములను జూచుచుండిరి.

## పురోహిత గౌరవము

మఱియు వశిష్టుడు, వామదేవుడు నను మహర్షులు చాలాకాలము నుండి రవివంశపురోహితులై ఆ దశరథునికి హితులై ప్రాధాన్యము వహించి యుండిరి. ఇంకను జాబాలి మున్నగు ఋషులును ప్రధానులైయుండిరి. రాజ్యవ్యవహారము లందు వీరికిని ముందు బేర్కొన్న మంత్రులతో బాటు ప్రాముఖ్యముండెడిది. అందువలననే అయోధ్యానగరమునగాని కోసలదేశమునందుగాని ఎచ్చటను అసత్యము పలుకుటగాని, మోసముగాని, స్త్రీ వ్యామోహముగాని, అధర్మముగాని, అన్యాయముగాని మచ్చుకకైన కనిదపించెడిదిగాదు. నగరమునందు, దేశము నందు నివసించువారు మంచి వస్త్రములు ధరించి, చక్కని యలంకారములు దాల్చి మంచి నడవడికగలవారై తమరాజగు దశరథుని మేలుకొఱకై సదా నీతియందేమరక ప్రవర్తించుచుండిరి.

తనయందు ప్రీతిగలవారును, బుద్ధికౌశలము గలవారును, రాజ్యకార్యాచరణ దక్షులును నగు మంత్రులచే పరివేష్టితుడై ప్రకాశవంతములగు కిరణములతో నొప్పు బాలభానునివలె ప్రకాశించుచు స్వర్గమును దేవేంద్రుడువలె నీ భూమండలము నంతను దశరథ మహారాజు పాలించుచుండెను.



# ఎనిమిదవ సర్గము

## దశరథుడు దన పుత్రహీనతకు విషాదపడుట

ఆ దశరథునకు ధర్మార్ధకామములవలనదగు ముప్వురు భార్యలు గలరు. వారు చాల సౌందర్యవతులు, గుణవతులు, పరమసాధ్వులునై యుండిరి. అందు ధర్మమే ఇచ్ఛగా గల కౌసల్యయను నామె పట్టమహిషియు, సర్వులను ప్రేమించుటే ఆకాంక్షగాగల సుమిత్రయను నామె ద్వితీయ భార్యయు, స్త్రీలను గూడ మెప్పింప గల సౌందర్యము గల కైకేయియను నామె మూడవభార్యయు నై యుండిరి.

ఏనుగులు, గుఱ్ఱములు ఇంకను అనేక సంపదలు గలవు గాని అదేమి దైవకృతమో ఆ రాజునకు వంశకరుడగు పుత్రుడు లేడయ్యెను. అంతఃపురములు, సుగంధి పుష్పవాటికలు, దంతపు బంగారపు పనితనము గలిగి రత్నఖచితములైన భవనములు, సుకుమారులైన కాంతలు గలరు. గాని సంతానము లేకపోవుట ఆతని హృదయమును నిరంతరము తపింప జేయుచుండెను. “నాకు సౌఖ్య సంతానములు చాల గలవుగాని సంతాన సౌఖ్యము లేదు. భోగ సంతతి కలదుగాని సంతతి భోగము కలుగయ్యెదయ్యె” నని మిక్కిలి చింతింపసాగెను. ఒకనాడు పేరోలగమున నుండి మంత్రులతో గలసి పుత్రసంతానమునకై నేనేల యశ్వమేధము నింతవఱకు జేయనైతిని. ఇంకనైన జేసెద నిశ్చయించుకొని ముఖ్యమంత్రియగు సుమంత్రునితో నిట్లనెను. ‘సుమంత్రా ! ప్రసిద్ధులగు మా గురువులగు వసిశిష్ఠులవారిని, పురోహితులనందఱను ఇచ్చటనొక గొప్పపని గలిగినదని నీవే పోయి తోడ్కొని రమ్ము’ అని చెప్పగానే ఆ సుమంత్రుడును చాల వేగముగా వెడలి వేదవిదులైన, సుయజ్ఞుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు అను దశరథుని గురువులను గురు శ్రేష్ఠుడును పురోహితుడు నగు

వసిష్ఠుని, ఇంకను దక్కిన బ్రాహ్మణుల నందఱను వెంట బెట్టుకొని వచ్చెను.

రఘువంశ శ్రేష్ఠుడగు నాదశరథుడు మొదట వారందఱను పూజించి ధర్మసమ్మతములగు మాటలతో నిట్లనెను. "ఓ తపోధనులారా ! మీ వంటి మహానుభావుల ప్రాపునాకున్నను నా చెడు గ్రహబలమెంతటదోగాని నన్ను సంతానహీనుని జేసినది. సూర్యుడు మొదలుగా నిరంతరాయముగా సాగివచ్చుచున్న నా వంశము నిలుపు వ్రేలెడు మొలక లేకపోయెగదా యని మిగుల చింతించుచుండును. ఇక మీరే నా సంతాపమును తొలగింపవలెను. సంతానము కొఱకై అశ్వమేధయాగము చేయవలెనని తలచుచున్నాను. నేను పుత్రులకొరకై శాస్త్రముల యందు చెప్పబడిన విధముగా నిర్విఘ్నముగా నెట్లు చేయగలనో ఉపాయము నాలోచింపుము."

రాజు నోటి వెంట వచ్చిన ఆ మాటలు విని వసిష్ఠుడు మున్నగువారందరు బాగు బాగు అని అభినందించిరి. వారందరు మిగుల సంతసించిన వారై "ఓ రాజా! ప్రసిద్ధమగు నాయాగమునకై వలసిన సామాగ్రిని సమకూర్పుము. యజ్ఞాశ్వమును విడువుము. నీ కిట్టి ధర్మసమ్మతమైన కోర్కె కలుగుటచే తప్పక యుత్తములైన పుత్రులు గలిగెదరు. పవిత్రుల సంకల్పము లెన్నటికిని వ్యర్థములు గావు". అని పల్కగా వారి మాటలాలించి రాజు ఆనందబాష్పములు కన్నులనిండ అప్పుడే తాను సంతానవంతుడయినట్లు సంతోషించుచు మంత్రులతో నిట్లనెను. "మంత్రులారా! మా గురువులు చెప్పినట్లు యజ్ఞమునకు కావలసిన సర్వవస్తువులు సమకూర్పుడు. రక్షించుటలో సమర్థులైన కవచధారులగు భటులను, పురోహితుడను తోడుగా నడవగా యజ్ఞాశ్వమును విడువుడు. సరయూతీరము నందు యజ్ఞశాల నిర్మింపుడు. శాస్త్రోక్తముగా విఘ్నములను నివారించు శాంతి కార్యములు చేయబడుగాక. ఈ అశ్వమేధమును చేయుటలో లోపము కలిగినచో మిగుల కష్టములకు కారణమగును. అపచారము కలిగినను కష్టములు గలుగుననిచో నీ యాగమును ప్రతి రాజు చేయవీలయ్యెడిది. కాని యీ యాగము శాస్త్రోక్తముగా జాగ్రత్తగా జేయవలసినది గావుననే దీనిని చాలామంది చేయ

సాహసింపరు. దానము పటగూడని వస్తువులను గ్రహించుట, తగనివారలచే యాగాదులను జేయించుట, తమకడనున్న విద్యను శిష్యుల కీయకుండుట మున్నగు దోషములు చేయువారు ప్రాయశ్చిత్తము చేసికొనకున్న బ్రహ్మరాక్షసు లదెయ్యదరు. యాగవిధానము లెరిగి యున్న వీరు యజ్ఞములలో నెచ్చటనైన లోపములు కలవాయని వెదకుచు యజ్ఞవిఘ్నమొనర్ప యత్నించుచుందురు. యజ్ఞ విఘ్నమైనచో కర్త వెంటనే నశించును. కావున సమర్థులగు మీరు ఏవిధముగా నిర్వహించిన నీ యాగము నిర్విఘ్నముగా పూర్తియగునో యట్టి యేర్పాటులు శ్రద్ధతో చేయింపుడు.”

ఆ మంత్రులందఱు రాజు మాటలు విని ఓ రాజా! నీ యాజ్ఞచొప్పున అట్లే చేసెదమనిరి. మీ వంటి సజ్జనులు పూనిన పనులు నెరవేరకుండునాయనిరి. ధర్మజ్ఞులగు ఋత్విజులు శుభాశీస్సులతో రాజును వర్ధిల్ల దీవించి రాబోవు చైత్రపూర్ణిమ నాడు యజ్ఞమున కుపక్రమించుదుమని రాజుననుమతిని బొంది వెడలిరి. ఆగురువుల సాగనంపి మంత్రులను యజ్ఞమునకు గావలసిన వస్తువుల నెల్ల సమకూర్ప నియమించి, వారికి సెలవొసంగి ఆనందముతో దశరథుడు తన భవనమును ప్రవేశించెను. అంతఃపురమనకేగి తన మనస్సునకు బ్రియమొనరించువారును యజ్ఞమున దనతో గూర్చుండ దగినవారును అగు కౌసల్య మొదలగు పత్నులతో “మీరు ఇంక యజ్ఞదీక్షలో” నుండుడు. సంతానర్థమై యజ్ఞము చేయబూనితిని అనెను. ఆరాణుల ముఖపద్మములు మంచువిడచిన కమలమువలె ప్రకాశించెను.



# తొమ్మిదవ సర్గము

## దశరథునకు సుమంత్రుడు సనత్కుమార వచనములు దెల్పుట

దశరథునికి సారథియు మంత్రియు నగు సుమంత్రుడు ఏకాంతమునందు రాజుతో నిట్లనెను. ప్రభూ ! నీకు సంతానమును గూర్చి చింతవలదు. పూర్వము ఋషులెల్లరు వినుచుండగ ఆనందదాయకముగ అపాయము లేని యుపాయమును సనత్కుమారుడు వివరించుచుండగా నేను వినియుంటిని. ఆతడు ఋషీశ్వరుల కిట్లు చెప్పెను. నేను సొంతముగా విన్నదానిని నీకు జెప్పెదను వినుము. పూర్వము కాశ్యపుడను సంయమీశ్వరునకు విభాండకుడను కుమారుడు గలడు. అతనికి ఋశ్యశృంగుడను పుత్రుడు గలుగును. అతడు గొప్పతపస్వి. పుణ్యాత్ముడు నగును. ఆఋష్యశృంగుడను మునిశ్రేష్టుడు పుట్టినది మొదలు వనమునందే పెరుగుచు సదా తండ్రినే వెన్నంటి యడవిలో దిరుగాడుచు, తనతండ్రికి నమస్కరింపవచ్చు యోగులను తపస్వులను తప్ప నితర లోకము నెఱుగక యుండును. లోకమున బ్రహ్మచర్యము రెండు విధములని వేదార్థము నెఱిగిన వారు చెప్పుదురు. అందొకటి వివాహమునకు బూర్వము మౌంజి అజినము దండము మున్నగునవి ధరించి యుండునది. రెండవది వివాహానంతరము నిషిద్ధ దినములయందు సతుల గూడ కుండుటచే గలుగునది. ఇట్టి రెండు విధముల బ్రహ్మచర్యమాతనికి గలుగ గలదు.

అడవియందు తండ్రిని, అగ్నిహోత్రుని సేవించుచు మొదటి బ్రహ్మచర్యమును మహాత్ముడగు ఋష్యశృంగుడనుష్ఠించుచుండగా మిక్కిలి ప్రతాపము బలము గల రోమపాదుడను వాడు ఆ సమయమున అంగదేశమునకు రాజైయుండును. ఆ రాజు దోషముల కారణమున నతని

రాజ్యము అనావృష్టిచే దారుణమగు కఱవుతో బాధనొందును. ఆ రాజందుకు మిక్కిలి చింతించి అట్టి కష్టము వచ్చుటకు కారణమును దానికి జేయ వలసిన ప్రతిక్రియను దెల్పుడని బహుశాస్త్రముల నెఱిగిన పలువురు బ్రాహ్మణులను ప్రశ్నించును. అంత ధర్మమును లోకాచారము నెఱిగిన వారు గాన అనావృష్టికి హేతువయిన పాపమునకు ప్రాయశ్చితమును దెల్పుదురు.

రాజా! విభాండకమహాముని కుమారుడైన ఋష్యశృంగునినే యుపాయము చేతనైన నిచ్చటికి రప్పించిన నీ యుపద్రవము తీరును. అతనికి సుగుణవతి యగు నీ కుమారైను శాంతను శాస్త్రోక్తముగా నిచ్చి వివాహ మొనర్పుము. అను వారి మాటల నాలించి రాజు మంత్రులతో నాలోచించి ఋశ్యశృంగుని గొనిరండని పురోహితులను అమాత్యులను ఆజ్ఞాపించును. వారు భయముతో తలలువంచి రాజా! మేమావిభాండక మహర్షికి భయపడుదుము. మేము పోజాలము కాని ఒక్క యుపాయమును జెప్పెదము. వార వనితలను బంపి ఆ ఋశ్యశృంగుని నుపాయముతో రప్పించవచ్చును. దీనిచే నెట్టి భయముండదని పల్కుదురు. రాజు అట్లే వేశ్యలను బంపి ఋష్యశృంగుని తన దేశమునకు రావించి, తన దేశమున వర్ష సమృద్ధి నందగలడు. రోమపాదుడంతట శాంతనాతని కొసగి వివాహ మొనర్చెను. ఆవిధముగా అల్లుడయిన (దశరధుని యౌరస పుత్రిక శాంత రోమపాదుడామెను బెంచుకొనెను. అందుచే ఋష్యశృంగుడు దశరధునకు నల్లుడే) ఆతని ఆర్త్విజ్యమున నీవు క్రతువు జేయు సత్కీర్తియుతులగు తనయులు నీకు గలుగగలరని సనత్కుమారుడు తెలిపినదెల్ల నేను నీకు దెలియజెప్పితిని. అని సుమంత్రుడు దెల్పగా ఆ మాట లాలించి సంతసముతో దశరధుడు సుమంత్రా! రోమపాదుడు ఋష్యశృంగు నెట్లు రప్పించెనో ఆ విషయమంతయు విపులముగా దెల్పుమని యడిగెను.



# పదియవ సర్గము

## సుమంత్రుడు రాజునకు ఋష్యశృంగుని చరిత్రను దెల్పుట

సుమంత్రుడట్లు రాజుచే ప్రేరితుడై ఇట్లు చెప్పదొడగెను. "రాజా నేను చెప్పుచున్న ఋశ్యశృంగ చరిత్రము నీవు మంత్రులతో గూడ వినుము.

అంత రోమపాదుని పురోహితుడు మంత్రులతో గలిసి రాజుతో నిట్లనెను. రాజా! మేమాలోచించిన ఉపాయమపాయము లేనిది. ఋశ్యశృంగుడు వనవాసి సతతము, తపస్సు చేతను, వేదాధ్యయనము చేతను ప్రొద్దుపుచ్చువాడు. స్త్రీలననెవ్వరో అతడెఱుగడు. శబ్దాదివిషయములచే గలుగు సుఖముల నెఱుగని వాడు రూపవంతులైన వారాంగనలు వివిధాలంకార భూషితలై యచటకేగి తమ చతుర విలాసములతో నాతని నాకర్షించి యిటకు గొని రాగలరు. ఆజ్ఞాపింపుమనగా రాజామాటల కంగీకరించెను. అనంతరము రాజాజ్ఞగొని వేశ్యమణులు కొందఱు విభాండకముని కుమారుడుండెడు వనమున బ్రవేశించిరి. ఆ ఋషి కుమారుడు స్థిరమైన మనస్సు గలవాడు. ఎల్లప్పుడాశ్రమమునే నివసించుచు తపస్సునందుండు వాడు. సదా సంతోషియగు నాతడు తండ్రి యాశ్రమమును దాటి యెఱుగడు. అతడు పుట్టినది మొదలంతవఱకు పురములందును, పల్లెలందును గల యే వస్తువును జూచి యెఱుగడు. స్త్రీలను గూర్చి విననైన లేదు. అతనికై ఈ వారకాంతలు వేచియుండగా ఒకనాడు దైవ వశమున నా ఋశ్యశృంగుడు వారున్న ప్రదేశమునకు వచ్చి యా కాంతలను జూచెను. వచ్చుచున్న ఆ ఋషిపుత్రుని గని వేశ్యలు మధురముగా గానము చేయుచు నతనిని సమీపించి యిట్లనిరి. ఓ బ్రాహ్మణుడా! నీవెవ్వడవు? ఒంటరిగా నీ భయంకరారణ్యమున

దిరుగుచున్నావేమి? తెల్పుము. వినగోరెదము. అనగానే మున్నెన్నడు అట్టి మనోహరాకారము గల కాంతలను జూడనివాడగుటచే స్నేహభావముతో తన తండ్రిని గూర్చి వారల కెరిగించు నా ఆలోచన కలిగెను. మా తండ్రి విభాండకుడు. నేనాయన కౌరసపుత్రుడను. నా పేరు ఋష్యశృంగుడు. మేమిచట తపస్సు చేయుచుందుము. ఓ సుందర రూపులారా! మాయాశ్రమము సమీపమందే యున్నది. మీకందఱకు నచ్చట శాస్త్రోక్త విధిగా ఆతిథ్యమొసగెదను రండని వేడగా వారునంగీకరించి యతని యాశ్రమున కేగిరి. అట్లు వచ్చిన ఆ వేశ్యలకు ఋశ్యశృంగుడు ఇదే మా అర్ఘ్యము, ఇదే పాద్యము, ఇవిగో కందమూలములు ఇవే ఫలములనుచు నతిథి పూజ యొనర్చెను. అతనితో సల్లాపములు జరుప నభిలాషగల యా వార కాంత లతడొనర్చిన పూజలు స్వీకరించి అతని తండ్రి వచ్చునేమో యను భయముతో వెంటనే అచటి నుండి వెడలిపోవదలంచిరి. ఓ బ్రాహ్మణుడా! మిగుల నుత్తమములైన మాపండ్లను తీసికొనుము. వీనివలన నీ తేజ మతిశయించును వేగముగా తినుము. ఆలసించకు మనుచు అతనిని గౌగిలించుకొని తాము గొనివచ్చిన మధురములగు మోదకములను ఖాద్యములను అనేకముగా నొసగిరి. ఆ మునిపుత్రుడును ఆకాంత లొసగిన భక్ష్యములనారగించి ఎల్లప్పుడు నడవులనుండు వాడు కావున నవియును పండ్లనియే తలంచెను. అంత నా వేశ్యలు మేమొక వ్రతము చేయవలెను. వెంటనే వెడలవలెను. అనువంకతో అతని తండ్రి వచ్చిన శపించునను భయముతో నాతని విడచి పోవసాగిరి. వారట్లు వెడలినప్పటినుండి యా బ్రాహ్మణుడు తనకన్నులకు చెవులకు రసనేంద్రియమునకు గలిగిన సుఖము దూరమగుటచే చెదరిన మనస్సుతో చింతించుచు నటునటు తిరుగు సాగెను. నిత్యము బ్రహ్మనిష్ఠుడై యుండు నాతడు మరునాడు తాను మున్ను వారిని గాంచిన చోటున కేగి చక్కగా నలంకరించుకుని మనోహరముగా నున్న యా వారకాంతలను జూచెను. అట్లు తమ కడకు వచ్చుచున్న ఆ ఋషి కుమారుని

గాంచి తాము తలంచిన పని సమకూరెనని మనస్సులలో సంతోషించి యాతని చెంతకేగి యిట్లనిరి. ఓ బ్రాహ్మణుడా! మా యాశ్రమమునకు దయచేయుము. నీకచ్చట నిన్నటి యాతిథ్యము కన్న విశేషించిన సమృద్ధి యగు సత్కారము జరుగ గలదని వారు చెప్పగానే మనోహరమగు వారి మాటలను విని ముని కుమారుడటకేగ దలంచెను. ఆ వారకాంత లప్పుడే యాతనిని దమవెంట తోడ్కొని పోయిరి.

## వేశ్యలు ఋశ్యశృంగుని తమతో గొనిపోవుట

మహాత్ముడగు నావిప్రుడంగదేశమున బ్రవేశింపగానే వరుణుడు లోకముల నెల్ల నానందింప జేయుచు గొప్పవర్షము గురిపించెను. వర్షము గురియుంచుచు తమ దేశమునుకు విచ్చేసిన యా బ్రాహ్మణ శ్రేష్ఠునకు రోమపాదుడెదురేగి ఆతని కడ వినమ్రుడై సాష్టాంగ ప్రణామము జేసెను. శాస్త్రోక్తముగా నామునికి రాజు అర్ఘ్యము నొసంగి మునీంద్రా! నిన్నటకు రప్పించితిమని మీ తండ్రి విభాండకుడు మాపై కోపింపకుండు నటుల నీవు మాయెడల ప్రసన్నుడ వగు మని ప్రార్థించెను. రోమపాదుడంతట మౌనితో అంతఃపురమున బ్రవేశించి తన కుమార్తెయగు శాంత నిచ్చి శాస్త్రవిధిగా వివాహమొనరించి ప్రశాంతినొందిన మనస్సు గలవాడై ఆనందించెను.

అట్లాఋశ్యశృంగుడు శాంతస్వభావయగు శాంతాదేవితో గలసి మామగారింట అభీష్టములు దీరు నటుల గృహస్థాశ్రమము స్వీకరించి అచ్చటనే యుండెను.



# పదకొండవ సర్గము

## సుమంత్రుని వచనమును దశరథుడామోదించుట

"మహారాజా! ఆ శ్రేష్ఠుడైన సనత్కుమారుడు పూర్వోక్త వృత్తాంతమును మునీశ్వరులకు దెల్పి మఱియు నిట్లు తెల్పెను. మిగుల ధార్మికుడు సత్యప్రతిజ్ఞగలవాడు ఐశ్వర్య వంతుడునగు దశరథుండను పేరుగల రాజు ఇక్ష్వాకు వంశమున పుట్టగలడు. దశరథమహారాజా రోమపాదుని కడకేగి ఆతనితో "ఓ ధర్మాత్ముడా! నేను పుత్రులు లేని వాడను. మా వంశము నిలబెట్టుటకై శాంత భర్తయగు ఋశ్యశృంగుడు నీ యానతితో నే జేయబోవు యజ్ఞమును నిర్వహించును గాక" యని కోరును. అతని మాట లాలించి రోమపాదు డించుక యాలోచించి పుత్రకామేష్టి నిర్వహించుట ద్వారా పుత్రుల నీయగల సమర్థుడగు ఋశ్యశృంగుని శాంతాసమేతముగా బంపగలడు. దశరథుడును చింతతొలగిన వాడై ఆ బ్రాహ్మణుని వెంటగొనిపోయి యజ్ఞమును బూర్తి చేయును. దశరథుడు ఋశ్యశృంగుని ఋత్విక్కుగా ప్రార్థించి పుత్రకామేష్ఠి చేసి వంశము నిలుపువారును మిక్కిలి పరాక్రమము గలవారును లోకమునందు ప్రసిద్ధి నందగలవారును నగు నలుగు పుత్రులను పొందగలడు. అని యిట్లు త్రికాలజ్ఞాన సంపన్నుడగు సనత్కుమారు డీ కథను కృతయుగమున జెప్పినాడు. ఓ మహారాజా! సనత్కుమారుడు చెప్పినట్లు తప్పక సంతతి నందు యోగ్యత గల నీవు స్వయముగా సపరివారముగా పోయి ఋశ్యశృంగుని సత్కరించి యిచ్చటికి దీసుకొని రమ్ము" అని సుమంత్రుడు చెప్పిన మాటలను విని యా విషయమును కులగురువగు వశిష్ఠునకు దెల్పి ఆతని యనుజ్ఞను పొంది, శాంతాఋశ్యశృంగులను దెచ్చుటకై

అంతఃపురకాంతాజనము, మంత్రులు వెంటరాగా అంగదేశమున కేగెను. అట్లు బయలుదేరి మెలమెల్లగా అడవులు నదులు దాటి చివఱకాముని శ్రేష్ఠుడు నివసించు చున్న రోమపాదుని పట్టణమునకేగెను.

## దశరథుడు ఋష్యశృంగుని తెచ్చుటకు వెడలుట

అట్లు వెళ్ళి దశరథుడు ప్రజ్వలించు అగ్నివలె మహాతేజశ్శాలియై యున్న విభాండక పుత్రుడగు బ్రాహ్మణోత్తముని రోమపాదుని సమీపమున నుండగా జూచెను. పిమ్మట నా రోమపాదుడు దశరథుడు తన ప్రియమిత్రుడగుట చేతను, తన కన్నకూతురును తనకు బెంచికొన నిచ్చిన వాడను ప్రేమచేతను మిగుల సంతుష్ఠినందిన మనస్సుతో గొప్పగా నతిథిసత్కారము గావించెను. బుద్ధిశాలి యగు నా ఋశ్యశృంగునకు రోమపాదుడు తనకును దశరథునకును గల మైత్రిని, అతని కుమార్తెను తనకు పెంపనిచ్చుటయను తమ సంబంధమును జెప్పి, నీకీయనయు మామయౌటచే నావలననే మాన్యుడని వచింపగా, ఆమునియు దశరథుని తగువిధమున బూజించెను.

అట్లు సత్కరింపబడిన వాడై దశరథుడు మిత్రునితో నేడెనిమిది దినములు సుఖముగా గడిపి తరువాత యిట్లు చెప్పెను. ఓ మనుజేశ్వరా! నీ పుత్రికయగు శాంత భర్తతో గలిసి నా నగరమునకు వచ్చుగాక వారితో నా కొక యవసరము వచ్చినది. అనగా రోమపాదుడట్లే యగుగాక తప్పక పంపెదను. సందేహము వలదని పల్కి ఋశ్యశృంగుని జూచి మునీంద్రా! నీవు దశరథమహారాజు కోర్కె మన్నించి నీయిల్లాలిని దోడ్కొని యాతని నగరమున కేగుమని పలికెను. ఆమునీశ్వరుడు నట్లేయని రోమపాదుననుమతి పొంది సతీసమేతుడై ప్రయాణ మయ్యెను. దశరథుడును రోమపాదుడును ఒకరికొకరు నమస్కరించి, ఒకరికొకరు గాఢముగా కౌగిలించుకొని మిగులనానందించిరి. అంతట దశరథుడు మిత్రుని కడ సెలవు గైకొని బయలుదేరినవాడై ముందుగా వేగముగా వెళ్ళగలిగిన దూతలతో తమరాకను పౌరుల కెఱిగించుటకై వార్తను బంపెను.

## ఋష్యశృంగునితో దశరథుడయోధ్య ప్రవేశించుట

ఆ వార్త దెలిపిన పౌరులును వేగముగా అయోధ్యానగరమునంతను చక్కగా నలంకరించి ధూపములు వేసి పరమానందముతో రాజు రాకకై యెదురు చూచుచుండిరి. అంత దశరథమహారాజు బ్రాహ్మణ శ్రేష్ఠుడగు ఋశ్యశృంగుని ముందు ఉంచుకొని శంఖములు భేరులు పెద్దగా ధ్వనించుచుండగా చక్కగా నలంకరింపబడిన యయోధ్యానగరమును బ్రవేశించెను. అప్పుడింద్రునివంటి పరాక్రమము గల తమ రాజుచే సత్కారపూర్వకముగా తీసుకొని రాబడుచున్న యామునిని పౌరులెల్లరు చూచి మిగుల నానందించిరి. దశరథుడామునీశ్వరుని దన యంత:పురమునకు తీసుకొనిపోయి శాస్త్రోక్తముగా బూజించి తన్ను తాను కృతార్థునిగా భావించెను. అంత:పురకాంత లందఱను నట్లు భర్తతో గలిసి వచ్చిన యాశాంతను గాంచి కన్నులకరవుదీర యానందించిరి. అంత:పురస్త్రీలును, దశరథుడును మిక్కిలిగా గౌరవించుచుండ నా శాంతయు ఋత్విగ్వరుడగు ఋశ్యశృంగుడును నచ్చట సుఖముగా నుండిరి.



# పంౡ్రెండవ సర్గము

## దశరథుడశ్వమేధ యాగము చేయబూనుట

ఇట్లు కొంతకాలము గడవగా వివిధ పుష్పముల చేత మనోహరమైనదనియు, పుష్పసుగంధులను దిశలెల్ల వెదజల్లునదియు, తుమ్మెదల మధుర ఝంకారము గలదియు, చివుళ్ళతో మొగ్గలతో, పువ్వులతో కళకళలాడుచున్న తరువులు గలదియు నగు వసంతఋతువేతెంచెను. అంత రాజునకు యాగము చేయవలెనను గుతూహలము గలిగెను. దశరథుడు మహతేజశాలియగు నా ఋష్యశృంగునకు సాష్టాంగముగ నమస్కరించి యాతనిని ప్రసన్నుని జేసికొని వంశకరులైన పుత్రులు ప్రాప్తించుటకై యజ్ఞము చేయుటకు ఋత్విక్కునిగానుండ ప్రార్థించెను. అట్లు ప్రార్థింపబడినవాడై ఋశ్యశృంగు డట్లే కానిమ్ము రాజా! ఇంక యాగమునకు గావలసిన యుపకరణములును సమకూర్పుము. యజ్ఞాశ్వమును విడువుమని పల్కెను. అంత దశరధుడు ను మంత్రిముఖ్యుడగు సుమంత్రునితో నిట్లనెను. ఓసుమంత్రా! వేగముగా వేద పారంగులగు ఋత్విజులను రావింపుము. సుయజ్ఞుని వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, పురోహితుడగు వసిష్ఠుని తక్కిన బ్రాహ్మణశ్రేష్ఠులను ఆహ్వానింపుము అనగానే సుమంత్రుడు వేగముగా వెళ్ళి వారినందరును తీసికొనివచ్చెను. ధర్మాత్ముడు అగు దశరధుడు తొలుత వారినెల్లర నుచితరీతిని బూజించి మధుర వాక్కులతో నిట్లనెను. మహాత్ములారా! బిడ్డల కొఱకై పరితపించుచున్న నాకు సుఖమన్నది లేదు. కాన సంతానము కొఱకై యశ్వమేధ యాగము చేయవలెనని నాకు కోర్కె గలిగినది. విభాండకముని పుత్రుడైన ఈ ఋశ్యశృంగుని ప్రభావముచే నా కోరిక నెరవేరును ఆశకలదు. అని యిట్లు రాజునోటి నుండి వెడలిన వాక్కులను వసిష్ఠుడు మొదలగు వారెల్లరు విని బాగుబాగని ప్రశంసించిరి. ఋష్యశృంగుడు మొదలగు ఋషులు రాజుతో నిట్లనిరి.

“రాజా! యజ్ఞోపకరణములను సమకూర్పుము. యాగాశ్వమును విడువుము.

నీకు పు|త్రార్థమై యిట్లు ధర్మసమ్మతమైన యాగముచేయు నాలోచన కలిగినది కాన మిగులు పరా|క్రమవంతులైన నలువురు కుమారులు కలిగెదరు. పవి|త్రుల సంకల్ప మేల వ్యర్ధమగును". అను వారిమాటలకు రాజు మిగుల సంతుష్టు డయ్యెను. అంత ఆనందముతో నుప్పొంగుచు దశరధుడు తన మం|త్రులతో నిట్లనెను. "మా గురువులు నిర్దేశించిన |ప్రకారము యజ్ఞమునకు గావలసిన వస్తువులను సమకూర్పుడు. రక్షణలో దక్షులయిన కవచధారులచే గాపాడబడచు అధ్వర్యుడు మున్నగు |ప్రధాన ఋత్విజులు వెంట నడవగా నీ యజ్ఞాశ్వమును విడిచిపెట్టుడు. సరయూనది యుత్తరతీరమున యాగశాల నిర్మింపుడు. స|క్రమముగా శా|స్త్రోక్తముగా విఘ్నముల నివారించు శాంతి కార్యముల నాచరింపుడు. ఈ అశ్వమేధ |క్రతు నిర్వహణలో లోపములు వచ్చిన మిగుల కష్టములు కలుగును. అట్లు కలుగకున్నచో |ప్రతి రాజు నీ యజ్ఞమును చేయబూని యుండును. జాగరుకతతో చేయదగినది కనుకనే పెక్కం|డ్రు దీనిని జేయ సిద్ధపడరు. దానము పట్టగూడని వస్తువులను |గహించియు తగు |ప్రాయశ్చితము చేసికొనకుండుట, తగని వారలచే యాగాదులను జేయించుట, తమవిద్యను శిష్యుల కీయకుండుట మొదలగు దోషములచే |బహ్మరాక్షసులైన వి|ప్రులు యాగవిధానము లెరిగియున్నవారగుటచే యజ్ఞములలో నెక్కడైన లోపము లున్నవాయని వెదుకుచు యజ్ఞవిఘ్నమొనర్ప యత్నించు చుందురు. యాగము చెడుటచే గర్తయు నశించును. కావున ఎట్లు నిర్వహించిన నీ యాగము నిర్విఘ్నముగా శా|స్త్రోక్తముగా బూర్తియగునో అట్టి యేర్పాటులు |శద్ధతో చేయింపుడు. మీరట్టి కార్యములు నిర్వహింప సమర్థులు".

దశరధుని యీ వాక్యములను విని మం|త్రులంఱును ఆతని యాజ్ఞను దలదాల్చి యతడాజ్ఞాపించి నట్టు లొనరించిరి. పిమ్మట నా |బాహ్మణులందఱు ధర్మజ్ఞుడగు నారాజును గీర్తించి అతని యనుజ్ఞనంది యచటనుండి గదలిపోయిరి. వారందరట్లు వెడలగనే ఆనందముతో నాదశరధుడును దన |ప్రాసాదమున |బవేశించెను.

# పదమూడవ సర్గము

## వశిష్ఠుడు యజ్ఞ సంభారములను సిద్ధము జేయించుట

మఱల వసంతము వచ్చినది. సంవత్సరము పూర్తియైనది. అంతవఱకు యజ్ఞమునకు ముందు నిర్వహింపవలసిన విధులను నిర్వర్తించన దశరధుడు సంతానార్థియైన అశ్వమేధ యాగము చేయుటకై యాగశాల ప్రవేశించెను. అచ్చట పురోహితుడగు వసిష్ఠునకు బ్రణమిల్లి శాస్త్రవిధిగా నాతని బూజించి వినయముతో నా విప్రునకిట్లనెను. “ఓ మునిశ్రేష్ఠా! పుత్రులకొఱకై ప్రారంభించిన నా యజ్ఞమును శాస్త్రోక్తముగా జరిగింపుము. నీవు నాపై నెడతెగని స్నేహము గల మిత్రుడవు మాక్షేమమునెల్లప్పుడు గోరువాడవు, మాకులగురుడవు కాన మీరే యీ యజ్ఞభారమంతయు భరింపవలయును” అనినంత ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు మహారాజుతో “ఓ రాజా! నీవు కోరినట్లే నీ యజ్ఞవిధినంతను నిర్వహించెదను” అని చెప్పి యజ్ఞముచేయుట యందు నిష్ఠ గలవారును, ధర్మజ్ఞులును పెద్దలునునగు పూర్వనియుక్త బ్రాహ్మణోత్తములను వారివారి కర్తవ్యముల నాచరింపవలసినదనియు, స్రుక్కులు, స్రువములు మొదలైన యజ్ఞోపకరణములను జేయు వడ్రంగులను బావులను, యజ్ఞకుండములను త్రవ్వు ఖనకులను శిల్పులను, కర్మకారులను, నటులను బిలిపించి ఆయా పనులను జేయుడనియు నియోగించెను. వారితో వశిష్ఠుడు మీరందరూ రాజాజ్ఞను దలదాల్చి యజ్ఞకార్యములందు బ్రవర్తింపుడు. వేలకొలది ఇటుకలను దెప్పింపుడు. రాజభవనములు, బ్రాహ్మణ నివాసములు ఎత్తుగాను విశాలము గాను అనేకోపకరణములతోను ఉండునట్లు తయారుచేయింపుడు. బహువిధ, భక్ష్యభోజ్యములు, అన్నపానములు గలిగి గాలిచేగాని, వానచేగాని కూల్పబడక గట్టిగానుండు భవనములను సిద్ధము చేయుడు. అట్లే ఇతరపౌరులు నివసించుటకు దృఢములగు నిర్మాణములు చేయింపుడు. అవి సకల

పదార్థాములతో సమృద్ధములయి యుండవలెను. ఇతర గ్రామములనుండి వచ్చు జనులకు శ్రేష్ఠమైన భోజనము శాస్త్రపద్ధతిగా సత్కారపూర్వకముగా పెట్టవలెను గాని అనాదరముతో బెట్టరాదు. అన్ని వర్ణములవారిని తగురీతిని సత్కరించి వారిని సంతోషపెట్టవలెను. కామముచేగాని, క్రోధముచేగాని వారల నెంత మాత్రము అవమానింపరాదు. యజ్ఞకార్యములందు నియమింపబడిన చిత్రకారులు మొదలగు వారికి తగిన విధముగా సత్కారములను చేయవలెను. పైన జెప్పిన కర్మకారులందఱను ధనముచేతను భోజనాదులు చేతను తృప్తి నందింపవలెను. మీరు స్నేహముతోను ప్రీతితోను ఎట్లుచేసిన యజ్ఞ పరికరములకు లోటుకలుగుదో అట్లు చేయుడు. అని వశిష్ఠుడు చెప్పగనే వారందఱు నట్లొనర్చి వచ్చి వసిష్ఠునితో నిట్లనిరి. అయ్యా మీరు చెప్పిన విధముగా గృహనిర్మాణాదుల నెంత మాత్రము లోటురానీయక నిర్వహించితిమి. ఇటుపై మిగిలిన పనులన్నియ మీరు ఆజ్ఞాపించిన రీతిలోనే నిర్వహింతుము. ఇందేమియు లోటు కలుగనీయము.

**వశిష్టుడు రాజుల బిల్వ సుమంత్రుని నియమించుట**

అంత వసిష్ఠుడు సుమంత్రుని రప్పించి “ఓ సుమంత్రా ! ఈభూమండలమున ధర్మాత్ములగు బ్రహ్మణులను క్షత్రియులను వైశ్యులను శూద్రులను ఈ యజ్ఞమునకు ఆహ్వానింపుము. సత్కారములతో రప్పింపుము. మిథిలా నగరరాజు – పరాక్రమశాలి – సర్వశాస్త్రము లెఱిగిన వాడు వేదవిదుడునగు జనకుని నీవే స్వయముగా వెళ్ళి యాహ్వానించి సత్కరించి తోడ్కొనిరమ్ము. ఆయన మనతో పూర్వమునుండియు సంబంధము గలవాడు కాన నీకు ముందుగా తెలియజేయు చున్నాను. అట్లే కాశిరాజు మన మహారాజు నందు బ్రీతి కలవాడు ఎప్పుడును ప్రియమునే బలుకువాడు కాన నీవే స్వయముగా ఆ రాజునిటకు పిలుచుకొని రమ్ము. ముసలివాడు – మహాధార్మికుడు – మహారాజునకు మామయగు కేకయరాజును, ఆయన కుమారుని స్వయముగా నీవే పిలుచుకొని రమ్ము. మహాకీర్తిశాలియగు అంగదేశాధిపతిని రాజునకు బ్రియమిత్రుడగు రోమపాదుని,

కోసలరాజగు భానుమంతుని, మగధరాజును నీవే స్వయముగా ఆహ్వానించి పిలుచుకొనిరమ్ము. తూర్పుదేశములవారిని, సింధుదేశీయులను, సౌవీర దేశీయులను, సౌరాష్ట్ర దేశీయులను, దక్షిణదేశములనుండు రాజులనెల్లరను దూతలనంపి రప్పింపుము. ఈ భూతలమున మనకు ప్రీతి పాత్రులగు రాజులందఱును వారివారి బందుగులతో, అనుచరులతో, కుటుంబములతో రప్పింపుము " అని పల్కగా ఆయన మాటలను విని సుమంత్రుడు తగువారిని రాజులను బిలువ బంపెను. వసిష్ఠుడు పేర్కొనిన రాజులను బిలుచుటకు తానే స్వయముగా వెడలెను. ఆయజ్ఞమునకు గావలసిన యుపకరణములను నిర్మింప నిమమింపబడిన వారెల్లరును బుద్ధిమంతుడగు వసిష్ఠునకు తాము చేసిన పనులన్నింటిని తెలియజేసిరి. అంత నా బ్రాహ్మణోత్తముడు వారితో నిట్లనెను. 'దానములు శ్రద్ధతో చేయుడు. పొరపాటుననైన అనాదరము గాని, పరిహాసము గాని, లేకుండు నటుల ప్రవర్తింపుడు. శ్రద్ధ లేకుండ అనాదరముతో చేయు దానము దాతను నశింపజేయును. ఇందేమియు సందేహము లేదు.

## యజ్ఞము జూడ నానాదేశ రాజులయోధ్యకు వచ్చుట

అటుపై గొన్ని దినములలో మహారాజగు దశరథుడునకు బహుకరించుటకై శ్రేష్టములగు వస్తువులతో రాజులెల్లరును వచ్చి చేరిరి. అప్పుడు వసిష్ఠుడు, ఋశ్యశృంగుడు మిగుల సంతోషించిన వారై దశరథునితో నిట్లనిరి. ఓ రాజేంద్రా! నీ యాజ్ఞమేరకు రాజులెల్లరు విచ్చేసినారు. నేనా రాజముఖ్యులందఱిని తగిన విధముగా సత్కరించితిని. మనచే యజ్ఞసామాగ్రిని సంపాదింప నిమమింపబడిన వారలు కార్యదీక్ష గలవారై సర్వసామాగ్రిని సిద్ధపరచిరి. కాన నీవిక యజ్ఞశాలను బ్రవేశింపుము. అని వసిష్ఠుడు ఋష్యశృంగుడు చెప్పగా వారి యాజ్ఞననుసరించి మంగళ ప్రదమగు వారము, తిథి నక్షత్రము కల దినమున శుభలగ్నమున మహారాజు గృహము నుండి యాగభూమికి వెడలగా , వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణోత్తములెల్లరును ఋశ్వశృంగుని ముందిడుకొని యజ్ఞశాల కేగి యటనప్పుడే యధావిధిగా నా యాగ కార్యము నారంభించిరి.

# పదునాల్గవ సర్గము

## అశ్వమేధ యాగ ప్రారంభము

ఆ విధముగా యాగాశ్వమును విడచి సంవత్సరము పూర్తియైనది. ఆ యశ్వము మఱలిరాగనే సరయూనది యుత్తరపుటొడ్డున దశరధుడు చేయుచున్న యాగము పారంభమయ్యెను. మహాత్ముడైన ఆ దశరధమహారాజు యొక్క అశ్వమేధ మహాయజ్ఞమున బ్రాహ్మణ శ్రేష్ఠులు ఋష్యశృంగుని ముందిడి కొని యజ్ఞకార్యములను నిర్వహించుచుండిరి. వేదార్ధమెఱిగిన ఋత్విజులు శాస్త్రోక్తముగ ప్రతిపత్తిథి మొదలు కొని సప్తవాసరములు మూడు వైశ్వ దేవంబులు సలిపి ప్రవర్యము నుపసదమునను అంగయజ్ఞములనొనర్చి ప్రాతస్సవన, మాధ్యందిన సవన తృతీయ సవన కర్మలను శ్రాస్త్రోక్తముగా జరిపించిరి. తరువాత ఇంద్రునకీయవలసిన హవిర్భాగ మింద్రునకీయబడెను. సోమవల్లి స్తుతింపబడెను. ఆ యజ్ఞయి నందు స్ఖాలిత్యము గాని, హెూమ లోపము గాని ఎంతమాత్రము జరుగలేదు. సర్వము మంత్రపూర్వకముగ నిర్విఘ్నముగా నెరవేర్పబడెను. ఆయజ్ఞము జరిగిన దినములలో దాహముతో నున్నవాడు గాని, ఆకలి గొన్నవారు గాని, పండితుడు కానివాడు గాని, నూర్గురు శిష్యులు లేనివాడు గాని ఒక్క బ్రాహ్మణుడైన గానరాడయ్యెను. ఆ యజ్ఞమున బ్రాహ్మణులును, శూద్రులను, బాలురును, వృద్ధులు, వ్యాధిచే గృశించిన వారును, తాపసులును, స్త్రీలును నిత్యము నటభుజించుచున్నను యజమానుడగు దశరధుడు తృప్తినందకుండెను. మరికొందరు వచ్చిన బాగుండునని తలచుచుండెను. భోజన పదార్థములు ఎవరుఎట్లు సిద్ధముచేసిరో కాని మిక్కిలి రుచికరములై యుండుటచే భోక్తలు కూడ కడుపునిండుగ భుజించియు విస్తరులు

వదలులేక వదులుచుండిరి. వడ్డించువారును ఇంకను భుజింపుడు అను వారికి తనివిదీర వడ్డించుచుండిరి. పాకశాస్త్రానుసారముగా వండబడిన ఖాద్యభక్ష లేహ్య చోష్య భేదములు గల అన్నరాసులు పర్వతములవలె ప్రతిదినము గన్పట్టుచుండెను. ఆ దశరథుని యజ్ఞమున నానాదేశాగతులగు స్త్రీపురుషులెల్లరు నన్నపానములతో తృప్తిగాంచిన వారైరి. "తృప్తా స్మ ప్రభో" నీకు శుభమగు గాక యని బ్రాహ్మణులు ప్రశంసించిరి. ఆ మాటలను దశరథుడు వినెను. చక్కని యుపచారములతో భోజనము పెట్టబడుచుండెను. చక్కగా నలంకరించు కొనిన స్త్రీలు పురుషులు బ్రాహ్మణులకాహారము వడ్డించిరి. అట్లు వడ్డించు వారలకు కుండలములు దాల్చిన వారు సహాయముగ సంచరించుచుండిరి. ఆయజ్ఞకార్యముల నడుమ బుద్ధిమంతులు, మాటలాడుటయందు నేర్పుగలవారు నగు ఋత్విజులొండొరులతో ననేకములగు హేతువాదముల జేయుచుండిరి. అచ్చట ప్రతిదినము పెద్దలచే బ్రేరేపింపబడిన సమర్థులగు ఋత్విజులు కార్యములను శాస్త్రోక్తముగ ననుష్ఠించిరి.

ఆ యజ్ఞమున శిక్షా–వ్యాకరణ–ఛందో–నిరుక్త–జ్యోతిష–కల్పములను నాఱువేదాంగములను దెలియని వారు గాని వ్రతములు సేయని వారు గాని, బహుశాస్త్రములు తెలియని వారు గాని లేరు. ఆరాజు సదస్యులెల్లరు దిట్టలైన పండితులే.

## యూపస్తంభ ప్రతిష్ఠ

యూపస్తంభములు నిల్పదగిన సమయమున వారు మారేడుతో చేసిన ఆఱుయూపములు, వానికి సమీపమున ఆఱుచంద్రతో నిర్మించిన యూపములు, ఆఱు మోదుగుతో చేసిన యూపములు, విరిగి చెట్టుకొమ్మతో నిర్మించిన యూపమొక్కటియు, దాని ప్రక్క దేవదారు యూపములు రెండు నిల్పిరి. అందు శోభార్థముగ కనక విభూషణములతో వానినలంకరించిరి. ఇట్లిరువది యొక్క మూరల వస్త్రములతో వాని నలంకరించిరి. వడ్రంగులచే హెచ్చు తగ్గులు లేక

చేయబడినవి. చిల్లులు మొదలైన లోపములు లేనివి, ఎనిమిదంచులు కలవి, నునుపైనవి, శాస్త్రోక్తముగా స్థాపించబడినవి నగు వస్త్రములచే అలంకరింప బడినవి. అయిన ఆయూపములు ఆకాశమున సప్తఋషుల వలె మిగుల బ్రకాశించినవి. శాస్త్రానుసారముగా కొలతలుగల ఇటుకలు చేయబడినవి. వానితో శాస్త్రమెఱిగిన విప్రులచే అగ్నివేదిక నిర్మింపబడినది. ఆ యగ్నివేదిక తోకచాచి క్రింద జూచు గరుడపక్షివలె నుండునట్లు బంగారు రెక్కలు గలదై మూడింతలై పదునెనిమిది ప్రస్తారములతో శాస్త్రోక్తమగు కొలతలు గల ఇటుకలతో నిర్మింపబడెను. శాస్త్రమున జెప్పినట్లు పశువులు, పాములు, పక్షులు ఆయా దేవతల నుద్దేశించిన యూపములకు గట్టిరి. గుఱ్ఱము, జలచరములగు తాబేలు–మఱియు గ్రామములనుండు ఇతర పశువులు మొత్తము మూడువందలను యూపములకు గట్టిరి. అప్పుడు దశరధునిచే విడువబడిన యజ్ఞాశ్వము గూడ యూపస్తంభమునకు గట్టబడెను. అంతట కౌసల్య యా హయమును సేవించి మూడుబంగారు సూదులతో మిగుల నానందముతో నా గుఱ్ఱమునకు కతివాట్లువేసి, ధర్మము నందు మనస్సుగలదై యొక్క రాత్రియంతయు దానియొద్ద శయనించెను. శాస్త్రముననుసరించి యాయా సమయమున బ్రహ్మమొదలైన వారికీయవలసిన దక్షిణగా తన పత్నులను దశరధుడొసగెను. బ్రహ్మకు పట్టమహిషిని, హోతకు వావాతను, ఉద్గాతకు పరివృత్తిని అధ్వర్యునకు పాలాకలిని దక్షిణగా నీయగా ఆ బ్రహ్మ మొదలగు వారును పట్టమహిషి మొదలగువారిని పతులవలె చేతితో ముట్టుకొనిరి. (తరువాత రాజు బ్రహ్మ మొదలగు వారికి ప్రత్యామ్నాయ ద్రవ్యమిచ్చి పట్టమహిష్యాదులను తిరిగి గ్రహించును) అంత ఋత్విజుడు ఆగుఱ్ఱము యొక్క వపను తీసి శాస్త్రోక్తముగ అగ్నిలో వేల్చెను. రాజు పాపశాంతి యగునట్లు శాస్త్రోక్తముగ సకాలమున నా వపాగంధమును ఆఘ్రాణించెను. మంత్రవేత్తలగు పదునార్గురు ఋత్విజులు ఆ గుఱ్ఱము యొక్క సర్వాంగములను శాస్త్రోక్తముగ

అగ్నియందు హోమము చేసిరి. ఇతర యజ్ఞములందు హవిస్సు జువ్వి కొమ్మలందు సంస్కరింపబడును. అశ్వమేధయాగమున హవిస్సు ప్రబలి కొమ్మలందు సంస్కరింపబడుట విధియైయున్నది. కావున ఋత్విజులట్లొనర్చిరి. కల్ప సూత్రమునకు మూలమైన సూత్రమును బ్రాహ్మణముల వాక్యముల ననుసరించి అశ్వమేధయాగము మూడుదినములలో నిర్వర్తింపబడవలెనని యున్నది. అందు మొదటిదినమున చతుష్టోమమనియు, ద్వితీయదినమున ఉక్థ్యమనియు, తృతీయదినమున అతిరాత్రియనియు పేర్కొనబడినది. ఆశ్వమేధమున శాస్త్రోక్తములగు క్రతువు లనేకములు గూడ రాజుచే చేయబడినవి. జ్యోతిష్టోమయాగమొక్కటి, ఆయురారోగ్య మొకటి, అతిరాత్రములు రెండు అభిజిత్తు విశ్వజిత్తు అప్తోర్యామక్రతువు చేయబడెను. ఇక్ష్వాకువంశ వర్ధనుడగు దశరథుడు అశ్వమేధయాగ సందర్భమున తూర్పుదిక్కుననున్న దేశమును హోతకు, పడమటిదిక్కుననున్న దేశము నధ్వర్యునకు దక్షిణదిశ నున్న దేశము బ్రహ్మకును, ఉత్తరదిశ నున్న దేశము నుద్గాతకును దాన మొసంగెను. ఇట్లు క్రతువు ముగించి శాస్త్రానుసారముగా దానములిచ్చి, క్రతుఫలమును వృద్ధినందించిన యా రాజును జూచి ఋత్విజులందఱు నానందించి రాజుతో నిట్లనిరి. “పాపరహితుడవగు నో రాజా! నీవే ఈ భూమండలమును రక్షింపదగిన వాడవు. మాకు భూమితో ఏమిపని? ప్రతిదినము వేదాధ్యయనపరులమగు మేమేడ? భూమిని పాలించుటటెక్కడ? కాన నాభూమికి మూల్యముగా ఏదోకొంత ధనమును నిప్పింపుము. ఈ భూమివలన ప్రయోజనము మాకుఏమియులేదు. అందుచే రాజా! నీకడ ఏది సిద్ధముగ నున్నదో–మణులుగాని బంగారముగాని, పాడియావులుగాని ఏవైనను కొద్దిగా నిమ్మనిరి.” ఇట్లు వేదవేత్తలగు బ్రాహ్మణులచే గోరబడిన వాడై ఆరాజు వారలకు పదిలక్షల గోవులనొసగెను. పదికోట్ల బంగారమును నలువదికోట్ల వెండిని రాజు వారలకు దానమిచ్చెను. (వెండి దానమీయరాదు గాని యిచ్చటి వెండి దానము కాదు. తాను ఇచ్చిన దానికి

బదులుగా ఇచ్చుటచే నిది దానము కాదు. దోషములేదు) పిమ్మట నా ఋత్విజులు న్యాయముగ పాలుపంచుటకై ఋశ్యశృంగమునికిని బుద్ధిశాలియగు వశిష్ఠునకు నిచ్చిరి. అంతట వారు తమతమ పాలు గైకొనిసంతుష్టినందిన మనస్సులతో మేము చాలసంతోషించితిమని వశిష్ట ఋష్యశృంగులతో దెల్పిరి. తరువాత దశరధుడు యజ్ఞము జూడవచ్చిన బ్రాహ్మణులకు జంబూనది యందు బుట్టిన బంగారమును కోటి నాణెముల నిచ్చెను. అజమహారాజు పుత్రుడైన యా దశరధుడు ఆ సమయమున దన్ను యాచించిన యొక బ్రాహ్మణునకు ఉత్తమమగు తన చేతికడియమునిచ్చి వేసెను. సంతుష్టులైన యా బ్రాహ్మణులకు ఆనందబాష్పములు కున్నుల గ్రమ్మగా దశరధుడు ప్రణామమొనర్చెను. గొప్పదాతయు మిక్కిలి శౌర్యవంతుడునగు ఆ దశరధుడు సాష్టాంగముగ దమకు ప్రణామ మొనర్పగా నా బ్రాహ్మణులు వేదోక్తముగా నాశీస్సులు బల్కిరి. ఆ రాజు మిగుల గొప్పదియు పాపముల బోగొట్టునదియు స్వర్గము నిచ్చునదియు శ్రేష్ఠులైన రాజులచే చేయ కష్టమైనదియు నగు నా యాగము నాచరించి మిగుల సంతుష్టినందెను.

అంతట దశరధుడు ఋశ్యశృంగునితో నిట్లనెను. “ఓ యుత్తమ వ్రతనిష్ఠుడా! మా కులముని వృద్ధి నందించు కార్యమును జేయింప నీవే సమర్ధుడవు” అని వేడగా ఆ బ్రాహ్మణుడిట్లనెను. “ఓ రాజా అన్నిటికంటె నుత్తమమైనది, వంశమునునిల్పునది, స్వర్గము నిచ్చునది యగు యజ్ఞము చేయుము. దానివలన వంశవర్ధనులు సూర్య సన్నిభులు నగు పుత్రులు నలుగురు కలిగెదరు” అని పల్కెను.



# పదునైదవ సర్గము

## దశరథుడు పుత్రకామేష్టి చేయుట

వేదవిదుడగు ఋష్యశృంగుడు కొంత తడవాలోచించి మేధావియగుటచే వెంటనే కర్తవ్యమును స్మరించిన వాడై రాజుతో నిట్లనెను. రాజా! నీకు పుత్రులు గలుగుట కొఱకై అధర్వశిరస్సు నందు జెప్పబడిన మంత్రములతో పుత్రప్రదమగు నొక్క యాగమును చేయించెదను అని చెప్పెను. తరువాత దశరథునకు పుత్రులు గల్గుట కొఱకై ఆ ఋశ్యశృంగుడు పుత్రకామేష్టి నారంభింపజేసి వేదోక్తవిధి ననుసరించి యగ్నిలో హెూమమొనర్చెను. అప్పుడు గంధర్వులు, దేవతలు, సిద్ధులు, పరమఋషులు బ్రహ్మతో గూడ నందఱు తమతమ హవిర్భాగములు సీకరించుటకు వచ్చుటచే ఒక్కచో గలసిరి. లోకకర్తయగు బ్రహ్మతో తక్కిన వారందరిట్లు విన్నవించిరి.

## దేవతలు రావణుడు పెట్టు సంకటములు బ్రహ్మతో విన్నవించుట

ఓ భగవంతుడా! నీచే వరములనంది గర్వితుడైన రాక్షసుడగు రావణుడు మమ్ము బీడించుచున్నాడు. అతనిని మేమెదిరింపలేకున్నాము. పూర్వము నీవాతనికిచ్చిన వరము నందలి గౌరవముచే మేమతని యాగడములను సహించు చున్నాము. అతడు వరగర్వమున మూడులోకముల వ్యాకులపరచుచున్నాడు. ఇంద్రాదిదిక్పాలురను తిరస్కరించుచున్నాడు. సూర్యుడు వేడి చూపడయ్యెను. గాలి యతని ప్రక్కవీవడు. అలలచే నిండి యుండు సముద్రుడు భయముచే నిశ్చలుడయ్యెను. దయయొకింతైన లేక మమ్మెల్లరను బాధించుచుండటిక

జెప్పనేల? ఓధాతా! అతని సంహరించునుపాయమేదైన నాలోచింపుమా అని దేవతలు ప్రార్థింప, బ్రహ్మయొకింత యాలోచించి యిట్లనియె ఇదిగో వానిని జంపుటకుపాయము తోచినది వినుడు. అతడు దేవతలు, గంధర్వులు, రాక్షసులు, విద్యాధరులు, వసువులు, యక్షులు మున్నగు ఖేచరుల వలన దనకు మృతి లేకుండా నా వలన వరము పొందినాడు. కాని మనుష్యులందు గల చిన్నచూపుచే నతడు వారి నుండి చావు లేకుండునట్లు కోరలేదు. కాననతని జంపదగిన వాడు మానవుడే. వేఱోకడులేడు. ప్రియము గలిగించు నా బ్రహ్మ వాక్యమును విని వారెల్లరు మిగుల సంతసించిరి. అంత వారామహావిష్ణువును బ్రహ్మతో గలసి ప్రార్థించిరి.

## శ్రీ విష్ణుమూర్తి దేవతలకు బ్రత్యక్షమగుట

అట్లు ప్రార్థింపగా దయామయుడగు విష్ణువు పీతాంబరధారియై శంఖచక్రగదా ధారియై వారి యెదుట సాక్షాత్కరించెను. అట్లు విచ్చేసిన హరిని సురలెల్ల వినతులతో ఆనందింపజేసి భక్తితో నీ విధముగ బలికిరి. "ఓ నీరజాక్షా! మేము నిన్ను వేడుకొనుచున్నాము. ఆపన్నులము ప్రసన్నులము నయిన మమ్మును ప్రపంచమును దయతో రక్షింపుము. ప్రసిద్ధుడు, కీర్తిమంతుడు, దాత, మునులతో సమానమగు తేజముగలవాడు కాకుత్థ వంశ వరుడగు దశరథుడు పుత్రులకై క్రతువు జేయుచున్నాడు. ఆతనికి హ్రీ శ్రీ కీర్తులనదగిన కౌసల్య, సుమిత్ర, కైక యను పేరుగల పత్నులు ముప్వురు గలరు. వారియందు నాల్గు రూపములతో నీవవతరించి లోకకంటకుల వధింపుము. వరగర్వముచే కన్నుగానిని ఆ రావణుని సంహరింపుము. మేమందఱమతనిచే హింసింప బడినవారమే. రావణవధ నర్థించిచయే నీ శరణు జొచ్చితిమి. నీవే కద మాకెల్లరకు నాధారభూతుడవు.కాన దేవశత్రువగు అతని దండించుటకు భూలోకమున నవతరింపుము.

## విష్ణుమూర్తి దేవతల కభయ మిచ్చుట

వేల్పులిట్లు విన్నవింపగా శరణాగత రక్షణుడగు నా విష్ణువు వారితో నిట్లనెను. ఓ దేవతలారా! మీరింక భయమువీడుడు. మీకిక క్షేమమగు గాక. మీకందఱకు హితముగోరిన వాడనై పుడమి నవతరించి క్రూరుడు, దుష్టుడుయై దేవతలకే భయముగలిగించు రావణుని పుత్ర పౌత్రులతో, మంత్రులతో, మిత్రులతో, చుట్టములతో గూడ సంహరించి ధర్మరక్షణకై పదునొకండువేల సంవత్సరము లీభూమిని బరిపాలించుచు మానవలోకమున వసింపగలను. ఇట్లు దేవతలకు వరమిచ్చి–తాను లోకమున పుట్టదగిన స్థానమును గూర్చి యాలోచించెను. అతడు గుణవంతుడైన దశరథమహారాజునే తన తండ్రిగా వరించెను. భగవంతుడట్లు నిశ్చయించుకొనగానే దేవతలు, ఋషులు, గంధర్వులు, రుద్రులు, అప్సరలు, బ్రహ్మ దివ్యపురుషుడగు విష్ణుని స్తోత్రములచే స్తుతించిరి. ఓ దయామయా! ముని జనబాధాకరుడను, సురసమూహ విరావణుడును, దుర్నివారుడును నగు రావణుని బలబంధుయుక్తముగ వధించి–చిరకాలము స్థిరముగ నుండునది, దోషరహితమైదియు నగు నీ వైకుంఠమునకు తిరిగి రమ్ము అని దేవతలు విష్ణువుని ప్రార్థించిరి.



# పదునారవ సర్గము

**అ**ట్లు దేవతలచే బ్రార్థింపబడిన వాడై విష్ణువు తనకు సమాధానము తెలిసియు వారినుండి వినదలచి వారితో నిట్లుబల్కెను. "ఏ యుపాయముచే రాక్షసులను సంహరింప దగును? చెప్పుడు" అనగా వారు నా దివ్యతేజస్సునకు నమస్కరించుచు "స్వామీ నరాకృతి ధరించి యా శత్రుని సంహరింపుము. ఆ రావణుడు బ్రహ్మను గూర్చి యనేక సంవత్సరములు తీవ్రమైన తపస్సు చేయగా ఆయన సంతుష్టుడై ప్రత్యక్షము కాగా లోక పీడగావింప దలచి అతడు మనుష్యులను లెక్కగొనక తక్కిన యన్ని భూతముల నుండి తనకు మృతి లేకుండా వరము కోరెను. బ్రహ్మదేవుడట్టి వరము నుగ్రహించుటచే ఆ రాక్షసుడు మదించి మూడులోకములను బాధించుచున్నాడు. స్త్రీల నవమానించుచున్నాడు. మానవునిచే దప్ప వాడు మరణింపడు" అని చెప్పిరి. వారి మాటలు విని యావిష్ణు నట్లే చేయుదనని పల్కి యంతర్హితుడయ్యెను.

దశరధుడు పుత్రకామేష్టి చేయుచుండగా హోమాగ్నినుండి సాటిలేని కాంతితో, గొప్పబల పరాక్రమము గలిగి, నల్లని రూపముతో ఎఱ్ఱని వస్త్రముతో, ఎఱ్ఱని ముఖముతో భేరీధ్వని బోలు ధ్వనితో, సింహపు వెండ్రుకల బోలు జుట్టు మీసములు వెలయుచుండ, శుభలక్షణములతో శుభాలంకారములతో శైల శిఖరమువలె నున్నతి గలిగి సూర్య సమతేజముతో ప్రజ్వరిల్లు అగ్నివలె ప్రకాశించుచున్న యొక యద్భుత భూతము ప్రత్యక్షమై దివ్యపాయసముతో గూడినదియు పత్నివలె ప్రియమైనదియు నగు బంగారుపాత్రమును

బాహువులతో బట్టుకొని దశరథుని జూచి "ఓ రాజశ్రేష్ఠా నేను ప్రాజాపత్యమూర్తిని నిన్ను జూడవచ్చితి" ననెను. రాజు ప్రణామములొనర్చి చేతులు జోడించి దేవా! నేను ఇప్పుడేమి చేయవలయునో తెలుపుమని ప్రార్థింపగా నా ప్రాజాపత్య పురుషుడు ఇట్లనెను. రాజా! సంతానము గోరి నీవిట్లొనర్చిన యజ్ఞకృత్యముచే సంతసించిన దేవతలందఱు పంపగా దేవనిర్మిత మైనదియు, ఇతరులెవ్వరికి పొంద శక్యము గానిదియు, సంతాన ప్రదమైనదియు, సాటిలేనిదియు, ఆరోగ్యప్రదమును, శుభకరము ధన్యమునైన పాయసమును నీకందీయ వచ్చితిని. ఓపవిత్రచరిత్రుడా దీనిని తీసికొమ్ము. దీనిని నీకు సవర్ణలగు భార్యల కొసంగుము. వారి యందు నీవు కోరిన విధముగా పుత్రులు జనింతురు." ఆ మాటలకు మిక్కిలి సంతసించి దశరథుడు దైవదత్తమైన పాయసపూర్ణమైన యా సువర్ణ పాత్రమును తలవంచి స్వీకరించి యాభూతమునకు భక్తితో ప్రదక్షిణ నమస్కారము లొనరించెను. అట్లా దశరథుడు దేవతలచే సృజింపబడిన పాయసమును పొంది, పెన్నిధి పొందిన పేదవలె మిగుల నానందించెను. అంత నాదివ్యభూత మంతర్థానమయ్యెను. అప్పుడు దశరథుని పత్నులు కోర్కెలూరు హృదయములతో ఆనందముచే ప్రకాశించు ముఖచంద్రులతో నొప్పగా ఆ మహారాజు అంతఃపురము శరత్కాలపుచంద్ర కాంతి గల యాకాశము వలె మిక్కిలి ప్రకాశించెను. వెంటనే ఆ రాజచంద్రుడు అంతఃపురమున బ్రవేశించి సంతోషముతో పొంగిపోవుచున్న హృదయముతో కౌసల్యను సమీపించి యిట్లనెను.

**దశరథుడు భార్యలకు పాయసము పంచి యిచ్చుట**

"దేవీ పుత్ర ప్రదమై పావనమై యమృత సమానమైన పాయసమిది. దీనిని గైకొని పుత్రవతివై శోభిల్లుము" అని పల్కుచు సయజ్ఞుడగు దశరథుడు

పాయసమున సగము కౌసల్య కొసగెను. తక్కిన సగమునందర్ధ భాగము సుమిత్ర కొసగెను. మిగిలిన అర్ధభాగము నందు సగము కైకేయి కొసగి, మిగిలిన పాయసమును మఱల సుమిత్రకిచ్చెను. రాజట్లు తనభార్యలు ముువ్వురకును సంతానార్థియై ఆ పాయసమును పంచి యీయగా ఆ రాజపత్నులును మిక్కిలి సంతోషముతో నిండిన మనస్సు గలవారై దానిని స్వీకరించిరి. ఆ రాణులు ముువ్వురును రాజొసంగిన పాయసము భుజించి అగ్ని సూర్యసమతేజములును దేవతల కానంద ప్రదములును దేవాంగనల దుఃఖములను దొలగింప సమర్థమైనవి యునగు గర్భముల దాల్చిరి. అంత నాదశరథుడు గర్భవతులగు తనపత్నులను గాంచి యూరట చెందిన మనస్సు గలవాడై సిద్ధులచే, దేవతల సమూహముచే బూజింప బడు దేవేంద్రుని వలె మిక్కిలి సంతోషము నందిన వాడయ్యెను.



# పదునేడవ సర్గము

## బ్రహ్మ దేవతలను వానరుల సృజింప నియమించుట

యజ్ఞమున హవిర్భాగముల గొని యేగుచున్న దేవతలతో బ్రహ్మ "దేవతలారా! మీనిమిత్తము విష్ణుమూర్తి భూమిపై నవతరింప దలచెను గదా! మీరును హరికి బాసటగా నుండుటకు బలిష్ఠులు కామరూపధరులు మహా పరాక్రమశాలురు నగు వీరులను సృజింపుడు. పండితులు, నీతిమంతులు, శూరులు, వాయువేగము గలవారు, విష్ణువుతో సమమగు పరాక్రమము గలవారు యుద్ధమున నెవ్వరికి గెలువరాని వారు బహువిధముల మాయలెరిగిన వారు సాయము మొదలైన యుపాయముల నెఱగిన వారు అస్త్ర శస్త్ర ప్రయోగ నిపుణులు, ధీరులు, భల్లూక వానరాకారములు గలవారు, మీ వంటి పరాక్రమము గలవారు నగు సుతులను కిన్నర స్త్రీలయందు, కపి కాంతల యందు కింపురుషాంగనల యందు యక్ష-సుర-సర్ప-భల్లూక భామలయందు సృజింపుడు. పూర్వమే యెలుగుబంట్లలో శ్రేష్ఠగడు జాంబవంతుడు నా యావులింత సమయమున నోటి నుండి జనించియున్నాడు. అతడు యముని యంతటి పరాక్రమశాలి మహాకీర్తిగలవాడు, అనిబ్రహ్మదేవుడు వచింపగా ఔనని యందఱును కోతుల రూపములు గల కూమారులను బుట్టించిరి. సిద్ధులు, సాధ్యులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, చారణులు, అరణ్య సంచారులును, పరాక్రమవంతులు నగు కుమారులను సృష్టింపగా వారుద్ధతులై వనములందు, పర్వతాగ్రములందు, నదీతీరములందు సంచరించుచుండిరి.

## వానరోత్పత్తి వివరణము

దేవేంద్రునకు వాలియు, సూర్యునకు సుగ్రీవుడును, బృహస్పతికి మహామతిమంతుడగు తారుడును, కుబేరునకు గంధమాదనుడును విశ్వకర్మకు నలుడును, అగ్నిదేవునకు నీలుడును, అశ్వనీదేవతలకు మైందుడును, ద్వివిదుడును నను మహాబలవంతులును, వరుణునకు సుషేణుడును, పర్జన్యునకు శరభుడును, వాయుదేవునకు అమేయ బలపరాక్రమవంతుడు

గరుడునితో సమానమగు వేగము గలవాడు, వజ్రకఠోరమైన దేహముగలవాడు నగు ఆంజనేయుడును జన్మించిరి. ఇట్లు అనేకవేల మంది ఇంతయని కొలువరాని బలము గలవారు – వీరులు, కామరూపులు దృఢశరీరములు గలవారు, ఎలుగుబంట్లు, కోతులు, కొండముచ్చులను పుట్టింపబడిరి. ఏ దేవతల నుండి జన్మించిన వారాదేవతల రూపము, వేషము, పరాక్రమముగలవారై యుండిరి. కొందఱు కొండముచ్చులకు, గొందఱు ఎలుగుబంట్లకు, కొందఱు కిన్నరస్త్రీలయందును జన్మించిరి. దేవ ఋషి గంధర్వ సర్పగరుడ కింపురుషసిద్ధాప్సరః కాంతలయందు గొందఱును జన్మించిరి. ఇట్లు జన్మించివారు రాళ్ళు, చెట్లు, గోళ్ళు, కోఱలు ఆయుధములుగా ధరించి వివిధ శస్త్రాస్త్రముల నుపయోగింప గలిగియుండిరి. వారు పెద్ద కొండలను పిండి గొట్ట గలరు. స్థిరమైన చెట్లను విరువగలరు. సూర్యునైన మ్రింగగలరు. ఆకాశమున కెగిరి మేఘములను బట్టగలరు. సముద్రమునే కలచివేయగలరు. పాదతాడనములచే భూమిని గ్రుంగ చేయగలరు. అడవులలోని మదగజములనైనను గొట్టగలరు. ఆకసమున నెగురు పక్షులనైన నేల గూల్ప గలరు. ఇట్లు భూమియందు జన్మించిన కోటిమంది కామరూపధరులు, మహాతేజశ్శాలురు, ధీమంతులు, కీర్తిమంతులు, ధీరులు మహావేగవంతులునగు వానర శ్రేష్ఠులు ప్రకాశించుచుండిరి. వారిలో మిక్కిలిమేటి వీరులై వాలిసుగ్రీవాదులు విరాజిల్లిరి. ఆ వానరులెల్లరును కొందఱు ఋష్యమూకమున మఱికొందఱు ఇతర పర్వతములయందు, కొందఱనేక వనములందు వసింపదొడగిరి. ఈ వానర సమూహమునకు ఇంద్ర పుత్రుడగు వాలి సార్వభౌముడుగా, సూర్యసుతుడగు సుగ్రీవుడు యువరాజుగా, హనుమానుడు, నలుడు, నీలుడు మంత్రులుగా నుండిరి. వారందరు గరుడునితో సమానమైన బలము గలవారై యుద్ధములయందు నేర్పుగలవారై వివిధ దేహములు గలవారై – పెద్దపులులకు, సింహములకు, సర్పములకు భయంకరులై కానలలో, కోనలలో నిండి సంచరించుచుండిరి. మేఘ సమూహముల వలెను పర్వతములవలెను భయంకరములైన శరీరము గలవారైన వానర ప్రముఖులిట్లు రామసహాయమునకై సృష్టింపబడి భూమండలమున బ్రకాశించిరి.

# పదునెనిమిదవ సర్గము

## శ్రీ కౌసల్యాదేవి గర్భము ధరించుట

ఈ ప్రకారముగా దశరథుడు తాను చేసిన యజ్ఞంబు పూర్తియగుటచే దేవతలు వారి యొక్క హవిర్భాగంబులను తీసికొని వెడలగానే దీక్షను వీడిన వాడై పట్టణమునకు బంధువులతోను, భార్యలతోను వచ్చెను. ఆప్తతతో వచ్చిన రాజులందరిని వారివారి పరివారములతో గూడ వింతలైన వస్త్రములచేతను, బంగారముతోను, మణులతోను, సత్కరింపగా వారలు సంతుష్టులై వసిష్టమౌని సెలవంది తమ నివాసంబులకు వెడలగా– ఋశ్యశృంగమౌనియు తన భార్యయైన శాంతతోను, తన మామయైన రోమపాదునితోను, దశరథాదులు సాగనంపగా అంగదేశమునకు వెళ్ళెను. అటులందరను సాగనంపి యెప్పుడు చిన్నిబిడ్డలను కన్నులార గాంచుదునోయను కోరికతో ఎదురు చూచుచున్న సమయంబున కోసల రాజపుత్రియైన కౌసల్య మఱ్ఱియాకువలె పలుచనయిన యుదరము క్రమముగా పెరిగియు వటపత్రశాయి యుండుటచే వటపత్రసమమే యయ్యెను. పాలసముద్రమున పరుండి లోకముల బాలించు బాలకునకు పాలొసంగుటకై కౌసల్య యొక్క పాలిండ్లు పెద్దవియైనవట. ఎక్కడ బంధింపబడుట యెఱుగని శ్రీహరి మంచివారి బాధలు మాన్పుటకై కౌసల్యా గర్భమున బంధితుడై యుండెను. (తాను భక్తులకు బంధువు గనుక.)

## శ్రీ భగవదవతార ఘట్టము

ఈ విధముగా యజ్ఞము పూర్తియయిన పన్నెండు నెలలు నిండగా చైత్రశుద్ధ నవమిని అదితి దేవతాకమైన పునర్వసు నక్షత్రమున సూర్యుడాకాశమధ్యమున నుండగా సూర్యాది గ్రహపంచకము ఉచ్చులోనుండగా బృహస్పతి చంద్రునితో

గూడి యుదయింపగా కర్కాటక లగ్నమున, జగముల కధిపతియగు శ్రీమన్నారాయణుని యర్ధాంశమైన వాడును, శుభలక్షణములు గలవాడును, రఘుకులము వృద్ధి పొందించువాడును, సర్వలోక వందితుడును నగు రాముని కౌసల్యదేవి ప్రసవించెను. మహాతేజస్సుతో నున్న యా కుమారుని గని కౌసల్య ఇంద్రుని గన్న యదితి వలె ప్రకాశించెను. సాక్షాత్తు విష్ణువు యొక్క నాల్గవ యంశయై కైకేయికి కన్నులపండువుగా గొప్ప భుజబలముగలవాడును, సకల సద్గుణ భరితుడును నగు భరతుడు జన్మించెను. విష్ణువు యొక్క అర్ధాంశతో సుమిత్రాదేవికి దక్షులగు లక్ష్మణ, శత్రుఘ్నులు పుట్టిరి.

పుష్యమీ నక్షత్రమున మీనలగ్నమున భరతుడు ఆశ్లేషా నక్షత్రమున కర్కాటక లగ్నమున మధ్యాహ్నకాలమున సుమిత్రా తనయులగు లక్ష్మణ శత్రుఘ్నులును జన్మించిరి. కాంతిచే పూర్వోత్తరభాద్రా నక్షత్రముల బోలువారును తనకు తగిన గుణగుణములు గలవారును, మహామహులునైన నల్వురు తనయులిట్లు దశరధునకుదయించిరి. వారు జన్మించిన సమయమున గంధర్వులు పాడిరి. అప్సరసలాడిరి. ఆకసమున దేవతలెల్ల గుంపులుగా కూడి సంతోషముతో నుండిరి. దేవతాస్త్రీలందఱు భయమును వీడి సంతసించిరి. అప్పుడు పువ్వుల వానలు కురిసెను. దేవ దుందుభులు మ్రోగినవి. అయోధ్యాపురమున నుత్సవములు కావింపబడెను. భూజనులందఱియందు సంతోషము వ్యాపించెను.

ఆ పట్టణమున నప్పుడు జరిగిన మహోత్సవమున జన సమ్మర్దమధికమై యుండెను. మహారాజు గోవులను, భూములను, ధనమును, వస్త్రములను దానములు చేయుచుండగా గ్రహించుటకు వచ్చుచున్న వేదవిదులగు బ్రాహ్మణులు నేల యీనిన తెఱగున గనిపించిరి. నటులు, నర్తకులు, గాయకులు, వందిమాగధులు పాడుచున్న పాటలతో స్తోత్రములతో ఆ పట్టణము మహానంద భరితమైయుండెను.

పదిరెండవ దినమున దశరథ మహారాజు పురుడు వెళ్ళగానే తన కుమారులకు నామకరణమహోత్సవమును మహానందముతో జరిపించెను.

ఆ కుమారుల పురోభివృద్ధి నెఱింగిన వసిష్ఠుడు జ్యేష్ఠునకు శ్రీరాముడనియు, కైకేయి యొక్క కుమారునకు భరతుడనియు, సుమిత్రయొక్క పుత్రులకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడనియు నామకరణముల జేయించెను. మహారాజు బ్రాహ్మణులకు, పౌరులకు ఇతర గ్రామములనుండి వచ్చిన జనులకును కోకొల్లలుగా భోజనములు పెట్టించి బ్రాహ్మణుల కనేక మణులు కానుకలుగా నొసగెను.

## శ్రీరాముని శైశవ వర్ణనము

కావుమని (రక్షింపుమని) జగత్తంతయు వేడికొనగా –తానే రక్షింప సమర్థుడు గనుకను వరువెత్తియైనను రక్షింపబోవువాడైన దేవుడు రాజకుమారుడైన రాముడుగా జన్మించి కావుకావని యేడ్చెను. సుందరీమణులు దశరథమహారాజు పుత్రులనూయెలలో పరుండబెట్టి కంకణ ధ్వనులను కూలముగా మ్రోయు తాళములు గాగా, రాగ తానములతో పంచమస్వరముతో లాలి లాలి యని పాడ జొచ్చిరి.

నాయనా! నిద్రపోవయ్యా! రఘునందనా నిద్రపోరా బంగారుకొండా! ఆటలు మరగి కన్నులు మూయవేలరా? అయ్యో యిట్లు చేసిన శ్రమయగునురాయని యెన్నడు గన్నులు మూసి యెఱుగని యాదిదేవుడగు రామునకు ముగ్ధలగు స్త్రీలు జోలలు పాడుచుండిరి. జలములే నివాసముగా గలవాడయు తల్లులు స్నానము చేయించుచుండగా యేమియు తెలియనివానివలె నవ్వుచుండెను. త్రిలోకాభిరాముడైన రామునకు కౌసల్యాదేవి ప్రేమతో నీళ్ళనుదోసిట బట్టి శ్రీరామ రక్షయనుచు ఆ బాలుని చుట్టు త్రిప్పుచున్నదట. దుష్టులు తనవలన భయముచే ప్రాణములు ఈ విధముగా పిడికిట బట్టి మిడుకుదురని తెలియజేయుటకో యనునట్లు ఆ చిన్నిబాలుడు కొన్నినాళ్ళు పిడికిలి విడువకుండెనట. చూడవచ్చిన స్త్రీలు రాముని పొత్తిగుడ్డలతో నెత్తుకొని తమయెదలకు హత్తుకొని ఎక్కువగా నవ్వించుచు తల్లియగు కౌసల్యకు సంతోషముతో నిచ్చుచుందురట. వినోదము కొఱకై జగములను లాడించు శ్రీరాముడు ఆటపాటలందు నేర్పుతో తల్లుల నలరించుచుండెను. తమ్ములు తనను గలసి యాడుచుండగా కౌసల్యాదేవి

యెంతో ఆసక్తితో 'అలసిపోయితివి ఓరామచంద్రా రమ్ము' అని పిల్చి పాలివ్వగా పాలు త్రాగక ఊ! యమ్మా! అనుచు తమ్ముని చూపుచున్నాడట. ఎంతటి సహోదర ప్రేమయో! రాముడు తన యుయ్యేల ప్రక్కన నున్న యుయ్యేలలో లక్ష్మణుడు లేనిచో నిద్రపోడు. ఉత్సాహముగా నుండడు. తల్లి చనుబాలు త్రావడు. ఇంకను పాలువిడవని వయస్సుననే రాముడు రోజున నొక్కసారియయినను సవతితల్లుల యిండ్లకు వెడలక యుండడట. తల్లియైన కౌసల్యతో తన నెత్తికొని తీసికొని పొమ్మని సైగలతో చెప్పుచుండెను. పరిమళవంతమైన నూనె రాచి తలయంటి సాంబ్రాణి ధూపంబు వైచి చిక్కుదీసి వదలుగా జడయల్లి సొమ్ములు పెట్టి మోమున చుక్కయును కన్నుల కాటుకయును బెట్టి సంతోషముతో ముద్దిడి చిన్నతమ్ములతో నాడుకొను మని కౌసల్యాదేవి పంపుచుండును. ఘల్లు ఘల్లు మని గజ్జెలు మ్రోగగా బంగారపు టందెలును విశాలమైన యురంబున నుయ్యాలలూగు హారంబులను ధరించి, చెవుల కుండలములు ధగధగ మెరయ, కంకణములు ధ్వనుల చేయుచుండగా గంతులు వేయుచు రాముడు ప్రతిదినము తమ్ములతోనాడు చుండెను.

**రాజకుమార గుణవర్ణనము**

ఈ ప్రకారముగా బెరుగుచున్న రాజకుమారులు విద్యలయందాసక్తి గలవారై గురువులయొద్ద విద్యలు నేర్చుకొనిరి. పుత్రులందరిలో దశరధునకు రాముడు పతాకమువలె ప్రేమపాత్రుడయ్యెను. సర్వప్రాణులకు బ్రహ్మదేవుని వలె రాముడు దశరధునకు ప్రేమపాత్రుడయ్యెను. ఆ రాజపుత్రులందఱు సర్వవేదములు నేర్చినవారే అందఱు పరాక్రమవంతులే. అందఱు లోకక్షేమమును గోరువారే. అందఱు సత్యము, సత్యగుణము గలవారే. అందఱు సజ్జనులు, వివేకము గలవారు, సర్వకళలందు బ్రావీణ్యము గలవారై యుండిరి. వారిలో శ్రీరాముడు శీలము, సత్యము, పరాక్రమము, సద్గుణములు గలవాడు. సర్వజగత్తులకు ఆనందముగలిగించు చంద్రుని వంటివాడు. నీలమేఘశ్యాముడు. తన నాశ్రయించిన వారి కోర్కెలు దీర్చువాడునై యుండెను. రాముడు ఏనుగు మీద

గాని గుఱ్ఱముపై గాని, రథముపై గాని అధిరోహించి, వింటితో నైనను యే యస్త్ర శస్త్రములతో నైనను యుద్ధముచేయనేర్చెను. శత్రువుల సంహరించుట మొదలగు యుద్ధనైపుణ్యము గలవాడై తండ్రికి సపర్యలు సలుపుచు సంతోషము గలిగించుచుండెను. చిన్నతనము నుండియు జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు అందఱిచే ప్రేమింపబడువాడు నగు రామునకు లక్ష్మీసంపన్నుడగు లక్ష్మణుడు స్నేహభక్తి సహితుడై ఇష్టుడైయుండెను. శరీరములు వేరైనను ప్రాణములొక్కటేయనురీతి నుండెను. లక్ష్మణుడు చెంతలేనిచో తల్లియగు కౌసల్య పాయససమేతమైన యన్నముదెచ్చి బతిమాలి పెట్టినను ముట్టుకొనడు – కన్నుమూయడు.

పరాక్రమవంతుడగు నారాముడు వేడుకగా గుఱ్ఱము నెక్కి వేటాడబోవు చుండ, లక్ష్మణుడు నీడవలె ఖడ్గశరచాపములను గొని రాముని వెంటనంటియే తిరుగుచుండును. భరతునకు శత్రుఘ్నుడు కూడ నిట్లే ప్రాణముల కంటె బ్రియుడై సంచరించుచుండెను. అనురాగముల అన్నదమ్ములుగా వారు లోకమున కీర్తింపబడుచుండిరి. రాజనీతి నెరిగిన వారును, దుర్గుణరహితులును, సమస్త విద్యల నార్జించినవారును, కీర్తిమంతులను, శూరులును తేజస్సున సూర్యునిగూడ మించువారును, సర్వకళలయందు పండితులును, మన్మధాకారులును, తల్లిదండ్రుల సేవయందాసక్తులును అగు తన తనయులను గాంచి దశరథుడు వారికి వివాహము చేయ నెంచిన వాడై, గురువులను సమస్తబంధువులను స్నేహితులను, మంత్రులను జూచి ధరలో వీరికి దగిన రాజకన్యకలు గలరో ఆలోచించి చెప్పుడని కోరెను.

## విశ్వామిత్రుడు దశరథుని జూడవచ్చుట

ఆ సమయమున మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రుడను ముని రాజదర్శన కాంక్షతో వచ్చి ద్వారపాలకులతో ‘మీరు త్వరగా బోయి మీ రాజుతో నిచ్చటికి గాధినందనుడు వచ్చెనని చెప్పుడు’ అని పలుకగా వారు భయముతో పరుగులు పెట్టుచు రాజగృహంబు జేరి సంభ్రమముతో మునీంద్రులు వచ్చియున్నారని తెలుపగా ఆ మాటల నాలకించిన వాడై దశరథ మహారాజు దేవతలతో గూడి

ఇంద్రుడు బ్రహ్మదేవునకెదురేగు చందమున నాయతీంద్రు నెదుర్కొని యర్ఘ్యమునిడి సంతుష్టుజేసి ఆదరించి చేతులు జోడించి నిలుచుండెను. మౌనిచంద్రుడును సంతుష్టుడై రాజా! నీవును భార్యాపుత్రాదులును సేమమే గదాయని కుశలప్రశ్నగావించెను. రాజా! నీ పట్టణమున నెల్లరు సంతోషముగ నున్నారా? ధనాగారంబులు నిండుగనున్నావా? రాజ్యమునందలి ప్రజలెల్లరు సుఖులే గదా? మిత్రులకు శుభంబేకదా? అతిధులను పూజించుచున్నావా? శత్రువులు భయభక్తులతో నున్నారా? అని ప్రశ్నించి తరువాత పవిత్రుడగు వసిష్ఠుని నితర ఋషులను సమీపించి వారి క్షేమమరయుగా వారును విశ్వామిత్రుని కుశలమడిగి సంభాషించిరి. అందఱిట్లానందముగా సంభాషింపుచు సభాభవనములోనికి బ్రవేశించి యుచింవసనముల గూర్చున్న తరి మహారాజు మౌనితో నిట్లనెను.

## దశరథుడు విశ్వామిత్రుని రాకకు కారణమడుగుట

మహాత్మా! తాము విచ్చేయటచే, పుత్రులు లేని వానికి పుత్రులు గల్గినట్లును, పోయిన ధనరాసులు దొరికినట్లును, అనావృష్టి గల దేశమున సువృష్టి గురిశినట్లును, అమృతాశనము లభించినట్లును, బహుళాభ్యుదయములు గలిగినట్లును మహానందము గలిగినది. నన్ను కృతార్థుని చేయుటకే మీరాక యని తలంతును. నీకు నమస్కరించి యడుగుచున్నాను. నాయం దనుగ్రహముతో నీవు వచ్చిన పని యేదియో తెల్పుము. దానిని నీకు సమకూర్చెదను. నీవు తొలుత రాజఋషివై ఆసమాన తపోమహిమచేత బ్రహ్మఋషివైతివి. సర్వవిధముల పూజ్యుడవు మునీంద్రా! నీవు వచ్చుటచే నాకు తప్పక గొప్పదైన భాగ్యము చేకూరగలదని తోచుచున్నది. నేను మీదయకు బాత్రుడనేని నీవు వచ్చిన కార్యము దెల్పుము. నేను చేయుదునో చేయనో యని సందేహింపకుము. చెప్పుదునా వలదా యను సందేహము విడచి యాజ్ఞనిమ్ము. నీవు నాపాలి దేవుడవు. ఏ కోరికతో వచ్చితివో యెఱిగింపుము. అని దశరథుడు విన్నవించెను.

# పందొమ్మిదవ సర్గము

## విశ్వామిత్రుడు దశరథునకు దన రాకకు గారణము చెప్పుట

అంత విశ్వామిత్రుడు వికసించిన ముఖము గలవాడై ఓ రాజా! రాఘవాన్వయము జగములందు బ్రశస్తికెక్కినది. అది సత్యవాక్యముననను, దాతృత్వముననను నీవు నీపూర్వులను మరపించినవాడవు. నీది సూర్యాన్వయము. మీ కులగురువు వసిష్ఠుడు. నీ సుగుణములు ఎన్నరానివియగుటచే వీనన్నిటికి తగినట్లు చెప్పితిని. నాకోరికయేదైనను దీర్చెదనంటివి గదా! అందుచే నామనసులోని మాట చెప్పెదను. దానిని నీవు తీర్చి లోకమున దశరథుడు అబద్ధమాడడను ఖ్యాతిని బొందుము. నేను యజ్ఞము చేయ తలపెట్టినాను. దాని కిద్దఱు రాక్షసులు అంతరాయము కలుగజేయుచున్నారు. వారెవ్వరనిన సుబాహుడును వాని యన్నయగు మారీచుడును. వారిర్వురు కామరూపులు –క్రూరులు–అస్త్రవంతులు. మొక్కవోని బలము గలవారు. నెత్తురును, ప్రేగులను, మాంసమును అధికముగా దెచ్చి యజ్ఞవేదిపై వేయుచు– యజ్ఞము చేయించువారిని, మునులను చావమోదుచుందురు. మేమందఱము చాలా భయము పొందుచున్నాము. ఆ రాక్షసులిట్లు క్రతువిఘ్నమును చేయుచుండగా సంతాపము పొందిన వాడనై ఆశ్రమమును విడచి నిన్ను జూడవచ్చితిని. పాపాత్ములైన రాక్షసులను శాపమిచ్చి చంపుదమన్నను దీక్షలో నుండుటచే నేను గోపింపదగదు గాన వీలు కాకున్నది.

## విశ్వామిత్రుడు రాముని తనతో బంపుమని వేడుట

మహారాజా! ముద్దుగా మొగమున ముంగురులు వ్రేలు వాడును,

సుకుమారమైన చిన్నతనపు జాయలు పోని వాడను, బలముగలవాడును, సత్యవిక్రముడును నగు నీ గారాబు పుత్రుని నాతో బంపుము. రాజా! నా చేత రక్షింపబడిన వాడై దివ్యపరాక్రమము గల రాముడు నేర్పుతో మారీచుడు మొదలుగా గల రాక్షస కోటిని సంహరించును. వారు చాల నీచులు. వారలను రాముడొక్కడే చంపగలవాడు. నీ వాలొచింపవలసిన పనిలేదు. రామునికి రక్షగా నేనుండెదను. నాతో బంపుము. నా కొఱకీ యజ్ఞము సంరక్షించిన నీ సుతులకు అనేకములగు శుభములు కలుగజేయుదును. నీ కుమారుడు లోకములలో మహాకీర్తిమంతడై ప్రకాశింప గలడు ఆ రాక్షసులు బలము గలదను గర్వము గల వారయ్యును. పాపాత్ములు గాన యుద్ధరంగమున రాముని యెదుట నిలువ జాలరు. రాజా ! ఇది నిజము. నిజము. యుద్ధమునకు జాలడని, పసిబాలుడని పుత్రునిపై నీకు గల మోహమును వీడుము. నీ సుతుని యెదుట రాక్షసులు బ్రదుకజాలరు. ఓ రాజేంద్రా! ఈ రాముడు సత్యపరాక్రముడని మహాత్ముడని నేనెఱుగుదును. నేనే కాదు ఈ తేజోరాశి యగు వసిష్ఠుడును, తక్కిన మునులును ఈ విషయము నెఱుగుదురు. పసిబాలుడని కాని, యుద్ధమందు నిలువగలడా యని కాని సందేహింపకుము. దేవతలైనను, రాక్షసులైనను రాముని ముందు నిలువ జాలరని ఒట్టుపెట్టి చెప్పగలను. మమకారము విడచి రాముని బంపుము. భూమి యందు స్థిరముగా నుండు ధర్మలాభంబును ప్రకాశమానమైన కీర్తిని పొందవలెనను నాసయున్న సందేహము విడచి రాముని బంపుము. రాజా! వినుము వసిష్ఠుడును, నీ మంత్రులను, ఋషులను పంపించుమనిననే రామభద్రుని నా వెంట పంపుము. పది దినంబులు క్రతువు జరుగును. ఆపదిదినములు రాక్షసుల బారి బడకుండ దానిని రక్షింపవలెను. ఆపదిరోజులు దీక్షాకాలమగుటచే నీ కుమారుని బంపించుమని కోరెను. విశ్వామిత్రుని యీ మాటలు విని దశరధుడు నిశ్చేష్టితుడై దుర్వారమైన దుఃఖసముద్రమున మునిగిన వాడై ఖడ్గముచే నఱుక బడిన వృక్షమువలె భూమిపై బడెను.

# ఇరువదవ సర్గము

## రాముని బంప జాలక దశరధుడు పరితపించుట

ముహూర్తకాలమిట్లు మూర్ఛ మునిగి యుండి తెలివొందినవాడై దశరధుడు విశ్వామిత్రునితో నిట్లనెను. మా రాముడు చిన్నపిల్లల ఆటలనాడుకొను వాడు. పదునారేండ్లకు లోబడిన వయసువాడు. తామరరేకుల వంటి నేత్రములు గలవాడు. రాక్షసులతో యుద్ధము చేయగలడా? అందుచే- ఇదిగో నాకొక అక్షౌహిణి సైన్యమున్నది. దానిని దోడ్కొని నేనువచ్చెదను. నా సేనానులు అస్త్రశస్త్రముల యందు నేర్పరులు. వీరులు. రాక్షసులతో యుద్ధములు చేయగలవారు శక్తిమంతులు సాహసులు నేను ధనుస్సుపట్టి రాక్షసులు యజ్ఞమునకు విఘ్నము గావింపకుండ కాపాడెదను. ఓముని చంద్రమా! నామాట నమ్ముము. ప్రాణములు శరీరమున నున్నంతవఱకు యజ్ఞసంరక్షణమునకై రాక్షసులతో బోరెదను. చిన్ని బాలుని, బలాబలములు తెలియని వానిని, పాలుగారు చెక్కిళులవానిని, నీ యజ్ఞ సంరక్షణకు గాను గొనిపోవుట నీకు ధర్మమా? వంచకులను, దృఢశరీరముగలవారును, మనుష్యులను భక్షించు వారునునైన రాక్షసులను నా రాముడు సంహరింపగలడా? రాముడు ఒంటరిగా శయనింపలేడు-చీకటిలో వెళ్ళుటకు బితుకు బితుకు మనువాడు, అట్టి నాకుమారుడు అడవులందును , గుట్టలందును నెట్లు సంచరింపగలడు. నా కడుపు ఎట్లు ఒప్పుతుంది. తల్లి చేతినే దిండుగా నిడుకొని తల్లిమీద రెండవ చేయినుంచి పడుకొని మంచి కధలను చెప్పుచుండగా ఊకొట్టుచు నిద్రించు పసికూన ఆముండ్లలోను, రాళ్ళ మీదను నెట్లు శయనించునయ్యా మునీంద్రా! గిల్లిన పాలుగారు బుగ్గలు గలవాడు. ఆకుచాటు పిందెవలె నున్న రాముడు

అడవులలో కందమూలములు తిని రాక్షసులతో నెట్లు పోరుసలుప గలడు. రాముని విడచి ఒక్క నిమిషమైన నేను బ్రతుకలేను. మునిచంద్రా! నారాముని తీసుకొని పోకుము. నీ పాదములకు మ్రొక్కెదను. ఆ ప్రకారముగా రాముని తప్పక తీసుకొని పోవలయు నేని, నాసైన్యముతో నేనును రామునననసరించి వచ్చుటకు నాజ్ఞ నిమ్ము. మునీంద్రా ! నాకు నలువురు పుత్రులున్నను నా ప్రాణములు ఎప్పుడును ధర్మపరుడైన రాముని మీదనే యుండును. అట్టి రామునెట్లు పంపగలను. విశ్వామిత్ర మునీంద్రా !

## దశరధుడు విశ్వామిత్రుని యజ్ఞవిఘ్నకరులగు రాక్షసుల వృత్తాంతమడుగుట

ఆ రాక్షసులెవ్వరి పుత్రులు? వారెవరి ప్రేరణచే వచ్చుచున్నారు? వారే ప్రకారముగా యుద్ధము చేయుదురు? వారి బలమెంత? వారి యాకారంబు లెట్టివి? వారి నాయకుడెవరు? వారల నే రీతిగా నెదుర్కొన వలెను? రాముడైనను సైన్యముతో గూడిన నేనైనను ఏమిచేయవలెను? అని దశరధుండడుగగా విశ్వామిత్రుడిట్లనెను రాజా ! కుబేరుని తమ్ముడును, పులస్త్యుని మనుమడును, విశ్రవసుని కుమారుడును అయిన రావణుడు బ్రహ్మచేత వరములను బొంది యెన్నరాని బలముగలవాడై గొప్పసైన్యముతో గూడి లోకములను తల్లడిల్ల జేయుచున్నాడు. అతడు తాను స్వయముగా క్రతువిఘ్నముచేయకున్నను దుర్మార్గుడు గాన తన స్నేహితులనో, భృత్యులనో పంపుచున్నాడు. అతని యాజ్ఞగొని మహాబలుశాలురు తాటక యొక్క కుమారులు మారీచ, సుబాహులను నిరువురును వచ్చి యజ్ఞవిఘ్నము చేయుచున్నారు.

## దశరధుడు శ్రీరాముని బంప నిరాకరించుట

అని విశ్వామిత్రుడు చెప్పగా విని దశరధుడు భయంబు చెందినవాడై మునీంద్రా! ఆ దుర్మార్గుల ముందు యుద్ధమున నే నైనను నిలువగలనా? నాయందు దయగలవాడనై నారాముని రక్షించుము. నాకు వేరు దైవము లేదు.

నీవే నా దైవము. నిన్ను నా పాలి గురువుగా నెంచుకొందును. నీ పాలబడితిని. నిర్భాగ్యుడను. నాకు పుత్రభిక్ష పెట్టుము. ఈ పసిపాపని పంపజాలను. సురలు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, గంధర్వులు నైనను ఆరావణునితో పోరలేరు గదా.. యుద్ధమున వాని ధాటికి మనుష్యులు నిలువగలరా? రావణుడు గొప్ప దర్పము గలవాడు. నే నొంటరిగా గాని సైన్యముతో గూడిగాని కొడుకులతో గలసి గాని, ఆ ఇంద్రవిరోధి నెదుర్కొనలేదు. సుందోపసుందుల తనయులు సామాన్యులా? వారు యముని బోలిన వారు. మహాబలవంతులు. యుద్ధమున ముక్కాకలు దీరిన వారు. నాకుమారుడు బాలుడు. పైగా యుద్ధమునందు చేయితిరిగినవాడు గాడు. అందువలన నతని నేను పంపజాలను. వారిలో నొక్కనితో పౌరుషము ప్రకటించి మిత్రులతో కలసివచ్చి యుద్ధము చేయుదునని పుత్రస్నేహముచే కలతచెంది పలికెను. రాజీవిధముగా పలుకగా విశ్వామిత్రుడు ఆహుతులతో యజ్ఞకుండము నందలి వహ్నివలె మండిపడి కనులవెంట నిప్పులురాలునట్లుగా కోపించెను.



# ఇరువది యొకటవ సర్గము

## విశ్వామిత్రుడు దశరథునిపై గోపించుట

కనుబొమలు ముడివడగా తన దృష్టి యనెడు నగ్నితో లోకంబులెల్ల తగుల బెట్టు బోవుచున్నాడో యనునట్లుగా, యుగాంతకాల లయకాలునివలె పటాటోపముతో విశ్వామిత్రమౌని ఎండిన కట్టెలతో మండుచున్న అగ్ని దండిగా నేయిపోయ మండునట్లు మండిపడుచు దేవతల గుండెలు ఝల్లుమను నట్లును భూమియంతయు వణకునట్లును ఆ రాజుతో నిట్లనెను. "ఓరీ! రాఘవ వంశపాంసనా! ఎవ్వనికిని పుత్రులే లేరా? గారాబముతో నీవొక్కడవే పుత్రులను గన్నావా? నాకోర్కెయేదైనను దీర్చెదనని ముందట్లు పల్కి యిపుడిట్లు నేనీయజాలనని పల్కెదవా? కానీ పనులు నిలిచిపోవునా? ఇట్టి మూర్ఖుని, విషయలోలుని, అసత్యవాదిని, శఠుని, మూఢుని రాజుగాను, రామునకు తండ్రిగాను జేసిన బ్రహ్మననవలయును గాని నిన్నన బనిలేదు. చంద్రమతి భర్తయైన హరిశ్చంద్రుని వంశమున బుట్టిన వాడనని అభిలాషతో నిన్నువేడితిని. క్షమింపుము. ముందు పల్కినవి కాదని అబద్ధమాడుట నీకు ధర్మమేని వచ్చినట్లే వెడలు వాడను. రాజా ! నీ బంధువులతో అబద్ధము పలుకువాడవై సుఖ ముండుము." అని కినుకతో చూచువారు భయమందునట్లు కన్నుల నిప్పులురాలు నట్లు చూచుచున్న గాధి నందనుని జూచి దేవతలు సంభ్రమపడుచుండగా దత్తరించుచున్న రాజును గాంచి వసిష్ఠుడిట్లనెను.

## వసిష్ఠుడు దశరథునకు శ్రీరాముని బంప బోధించుట

పార్థివోత్తమా! యేది కోరిన నిత్తునని చెప్పితివి. ఆడినమాట తప్పుట న్యాయమేనా? కాకుత్థ్స వంశమునందు జనించి ధర్మమూర్తివని పేరుగాంచి నీవిట్లు పలికి బొంక తగునా? మతిమంతుడవు –ధృతియుతుడవు, ధర్మిష్ఠుడవు

నయిన నీవే యీ ప్రకారముగ ఆడితప్పుట తగునా? లోకములన్నింటను దశరథ జగతీపతి ధర్మచరితుడని పొగడబడు నీవు స్వధర్మమును విడచిపెట్టుట తగదు. నీ కోర్కె చెప్పవలసినది. అది యేది యైన తీర్చెదనంటివి. అని చేయకుండుట మంచిది కాదు. చేసెదనని చెప్పి చేయకున్న మహాపాపము వచ్చును. కావున శ్రీరాముని గౌశికుని వెంట బంపుము. అట్లు పంపిన నీకు గొప్ప శుభము కలుగును. అస్త్రములు గల వాడైనను, అస్త్రములు లేని వాడనైనను రాముడు విశ్వామిత్రునిచే రక్షితుడైయుండగా అగ్నిరక్షితమైన అమృతమును వలె అతనిని యెంతటి బలవంతులైన రాక్షసులైనను చెనకజాలరు. భయపడక వేగముగా పంపుము. ఈ విశ్వామిత్రుడు మౌని మాత్రుడు కాదు సుమా. ఈతడాకృతి దాల్చిన ధర్మము. పరాక్రమవంతులలో గొప్పవాడు. గొప్పమేధావి. అనేక వ్రతములు చేసినవాడు. లోకమున నెవ్వరికిని దెలియనట్టి గొప్ప అస్త్రము లెన్నియో తెలిసినవాడు. అవి యన్నియు నీతనికి వశ్యములైయుండును.. అన్ని విషయము లందును సాటిలేనివాడు. సురలకు, కిన్నరులకు, కింపురుషులకు, అసురులకు, గంధర్వులకు, సర్పములకు, గరుడులకు తెలియరాని పరమాస్త్ర సమూహము లన్నియు నితని వశముననున్నవి. పూర్వము భృశాశ్వుడను పేరుగల ధీరుడగు ప్రజాపతి యొకడు గలడు. దక్షుని యొక్క కుమార్తెలగు జయ–సుప్రభయను వారి నతడు పెండ్లాడెను. జయయందు ఏబదిమందిని, సుప్రభయనందు ఏబదిమందిని పుత్రులనతడు పొందెను. వారు విక్రమవంతులును దుర్ధర్షులును, అపరిమిత శక్తిగలవారునై సంహారాభిధానులై యుండిరి. వారందఱస్త్రములైరి. ఆయస్త్రములన్నీ విశ్వామిత్రుడు తాను రాజ్యమేలు సమయమందే తపము చేసి భృశాశ్వుని యను గ్రహముచే పొందియున్నాడు. అవి యెందుకు? ఎన్నెన్నియో క్రొత్తవి సృష్టించు నైపుణ్యమీతనికి గలదు. భవాదృశుడగు నీతని వెంట నీ పుత్రుడగు రాముని తప్పక వంపుము. తన కార్యము తాను నిర్వహించు కొని శక్తి లేక రామచంద్రుని బంప గోరుచున్నాడని భావింపకుము. నీ సుతునకు మంగళము లొన గూర్చుటకే యిట్టులేతెంచినాడని తెలిసికొనుము.

# ఇరువది రెండవ సర్గము

## దశరథుడు రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంటనంపుట

ఈ ప్రకారముగా వసిష్ఠుడు చెప్పగా సంతసించినవాడై ముని వెంట పంపుటకు గాను రామలక్ష్మణులను బిలిపించెను. వారు సంతోషముతో వచ్చిన వెంటనే తల్లిదండ్రులు ప్రీతిపూర్వకముగా దీవింపగా వారిని దగ్గరకు తీసికొని వసిష్ఠుడు నిష్ఠగల మనస్సుతో మంగళకరములైన మాటలతో మంత్రపూతముగా నాశీర్వదించెను. అంత తండ్రియు నాచిన్నికుమారుని శిరము మూర్కొని మీద చేయివైచి మనస్సునందు ప్రేమపొంగుచుండగా విధాతృ సమానుడగు మౌనికి బిడ్డలనప్పగించెను. ఈ విధంగా గాధినందనువెంట దశరథుని కుమారులు నడచుచుండగా మెల్లమెల్లగా సుగంధిమారుతములు చల్లని స్పర్శగలుజేయుచు వీచుచుండెను. దేవతలు దుందుంభులు మ్రోగించిరి. పువ్వులవాన కురిసెను. శంఖ దుందుభుల మ్రోతలు చెలగెను.

ముందు విశ్వామిత్రుడు నడచుచుండగా అతని వెనుక కుడిచేత ధనువు ధరించి చిన్నిగిరజాల జుట్లు ముచ్చటలు గొల్పుచుండగా, తన కిష్టుడగు తమ్ముడు వెంట రాగా భూషణముల కాంతులచే దశదిశలు వెలుగుచుండగా తన్నుజూచు కోర్కెతో పట్టణములోని పురుషులను స్త్రీలును మాటలు రాని వారి పోలిక నిశ్శబ్దముగా గుంపులుగా గూడి చూచుచుండగా రామభద్రుడు నడువసాగెను. పువ్వుబోడులు పువ్వులను జల్లిరి. మంగళధ్వనులతో దిశలు ప్రతిధ్వనించుచుండెను. రామభద్రుడు కనిపించినంతవరకు తల్లులందఱు కిటికీల వద్ద నిల్చి చూచుచుండిరి. అమ్ములపొదులు, విండ్లు, ఆభరణములు ధరించి శరీర కాంతులచే దశదిశలు వెలిగించుచున్నవారును, నడుమున ఖడ్గము

ధరించిన వారును అగు రామలక్ష్మణులను వెంటగొని విశ్వామిత్రుడు నడచుచుండగా అశ్వినీ దేవతలతో సాగెడు బ్రహ్మవలెను కుమారులనుసరింప నడచు ఈశ్వరుని వలెను కనిపించెను.

## విశ్వామిత్రుడు రామునకు బలాతిబలలను విద్యల నిచ్చుట

ఈ విధముగా గదలి యొకటిన్నర యోజనముల దూరము జని సరయూనది దక్షిణతీరమున రఘువంశ శ్రేష్ఠుడగు రాముని జూచి మృదువైన స్వరంబుతో "రామచంద్రా! రఘురామా! ఓవత్సా! నీ దోసిటితో నీటిని తీసికొనుము. ఆలసింపకుము. బల అతిబలయను గొప్పమంత్రములను నీకుపదేశించెదను. త్రోవ నడచునప్పుడు ఆమంత్రములను పఠించిన ఆకలిదప్పి శ్రమయునొందవు. నీవు నిదురించుచున్నప్పుడు గాని ప్రమాదములందు గాని రాక్షససమూహములు నీ కెట్టి యాపదలను గలిగింపలేవు. భుజబలంబునందు నీకెవ్వరు సాటి కాజాలరు. జ్ఞానమునందు, సౌభాగ్యమునందు, పరాక్రమమునందు, ధీరత్వమునందు నీకు సమానులుండజాలరు. కీర్తి హెచ్చుగా కల్గును. జ్ఞానమునకు తల్లులవంటి వగు నీమంత్రములను జపించుట చేత బుద్ధిమహిమయు, యుక్తిపటుత్వము హెచ్చును. ఇవి ప్రజాపతి సంతతి యని తెలిసికొనుము. పవిత్రమగు ధర్మనిష్ఠ గల నీవే యీమంత్రములను పుచ్చుకొనుటకు దగినవాడవు. కనుక ఇచ్చెదను పుచ్చుకొనుము. ఆలస్యముచేయుట తగదు. నీవు మనస్సులో నేపనితలచినను తప్పక జరుగును. సందేహము లేదు. నీకివి యిచ్చుటచే పెక్కు ప్రయోజనములు గలుగునుగాత. అని విశ్వామిత్రడాజ్ఞాపించగా ఆచమనము చేసి శుచియై రామచంద్రుడామంత్ర ద్వయమును పుచ్చుకొని తేజస్సుతో శరత్కాలపు చంద్రునివలె బ్రకాశించెను. వేగముగా గురువగు విశ్వామిత్రుడు చెప్పిన కార్యంబంతయు పూర్తిచేసెను. ఆరాత్రి యంతయు నా ముగ్గురు సుఖముగా నచ్చటనే గడపిరి. అపుడు దశరధరాజ నందనులకు అనువుగాని గడ్డిపడకలయందైనను, కౌశికుని మంచి వాక్యములచే మైమరచుటచే సుఖనిద్ర యొదవెను. (ఇది ఇల్లు విడచిన తరువాత మొదటిరాత్రి).

# ఇరువది మూడవ సర్గము

తెలతెలవారు చుండగా బ్రహ్మసమాన తేజస్సు గల మౌని మేల్కొంచి పచ్చిగడ్డి ఆకులతో పరువ బడిన పడకల నున్న రవివంశజులగు రామలక్ష్మణుల కడకు వచ్చి ప్రేమతో నిట్లనెను. "ఓ కౌసల్యకు సంతోషము గూర్చు రామచంద్రా! తామరరేకుల వంటి నేత్రములు గల రామా! లెమ్ము ఇప్పుడు సూర్యుడుదయించు సమయము గాన దైవపూజలు ఆహ్నికములు చేయవలయును. "ఈవిధముగా కుశికపుత్రుడైన విశ్వామిత్రుడు ఆదరముతో బిలువగా, ఆపిలుపు విని లేచి రఘువంశమునందు పుట్టిన వీరులైన రామలక్ష్మణులు సరయూనది యందు దిగి స్నానముచేసి యుదకమువార్చి యర్ఘ్యములిచ్చి పవిత్రమైన జపంబులు నిష్ఠతో జేసి తక్కిన ఆహ్నిక క్రియలన్నియు జేసి ప్రయాణమునకు సిద్ధపడిరి. మౌని వారిని తీసుకొని పోవుచుండ దారిలో జహ్నుని యొక్క కుమార్తెయైన గంగానదిని సరయూ సంగమస్థలమునందు చూచిరి. అచ్చట మహాతేజస్వులగు మహర్షులనేక సహస్రములైన యేండ్లు తపస్సులు చేసిరి. సత్ప్రవర్తనము కలిగిన రామలక్ష్మణులు సంతోషమున నాదృశ్యమును జూచుచు మిక్కిలి కౌతుకముతో నాముని సార్వభౌమునితో నిట్లనిరి. "ఓ మహాపురుషా! ఈ పుణ్యాశ్రమం బెవ్వరిది? ఏపురుషుడిచ్చట నివసించెను. వినవలెనను కుతూహలము గలుగుచున్నది. మాకు తెలియునట్లు జెప్పుము మునీంద్రా!" అనగా

## విశ్వామిత్రుడు రామునకంగదేశ వృత్తాంతము దెల్పుట

విశ్వామిత్రుడు చిరునవ్వుతో రాముని జూచి రామా! ఈ గొప్పదైన యాశ్రమంబు కథ నీకు తెలియనట్లు చెప్పెదను. వినుము. పూర్వము శివుడిచ్చట

ఘోరమగు తపమొనరించుచుండగా గిరి తనూజ సపర్యలు చేయుచుండగా, ఆతపమునకు మన్మధుడు విఘ్న మొనరింపగా, ఆకుత్సితుని శివుడు మూడవకన్ను దెరచి బూడిదగా జేసెను. అది మొదలు శరీరములేని మన్మధు డనంగుడయ్యెను. ఇచ్చట మన్మధుడు శరీరమును వీడుటచే నిదియంగదేశ మయ్యెను. ఈ ఆశ్రమము శివుడు తపస్సు చేసినది కనుక రుద్రశిష్యులగు ఋషులనేకు లిచ్చట తరతరములుగా తపస్సు చేయుచుందురు. ఆ పుణ్యాత్ముల నెట్టి పాపములు నంటవు. మనమీ రాత్రి యిచ్చట గడపి రేపు గంగానదిని దాటుదము. ఈ పవిత్రమైన సరయూనదిలో స్నానము చేసి పరిశుద్ధులమై పావనమైన మంత్రములను జపించి అగ్నిలో హోమంబులు జరిపి ఆ ఋషులను సందర్శింతమని చెప్పుచుండగా ఆ ఋషులు తమతపోమహిమచేత వీరు వచ్చిన తెరంగెరింగిన వారై, వారే వచ్చి విశ్వామిత్రునకు అర్ఘ్యపాద్యాదుల నిచ్చి తగిన యాతిధ్యమును రాజపుత్రులకిచ్చిరి. అంత నా ముగ్గురును వారు చేసిన సత్కారములనంది మంచి కథలతో ప్రొద్దుపుచ్చి తగువిధముగా సాయంతనమున సంధ్యావందనము జపము చేసిరి. కామాశ్రమమున మనసు రంజింపజేయు కథలతో సుగుణాభిరాములగు రామలక్ష్మణుల కానందము గల్గించుచూ ముని వారిని నిదురబుచ్చెను. (రెండవ రాత్రి)



# ఇరువది నాల్గవ సర్గము

## విశ్వామిత్రుడు రామునకు సరయూ వృత్తాంతము జెప్పుట

ఉదయమునే చేయవలసిన స్నానసంధ్యలు మొదలగు నవన్నియు జరిగించుకొని ముందు విశ్వామిత్రుడును వెనుక రామలక్ష్మణులును జాహ్నవీ తీరమున జేరిరి. అచటి మునులు విశ్వామిత్రునితో “నావసిద్ధముగ నున్నది. ఆలస్యమెందులకు? రాజపుత్రులతో నదిని దాటుడన” నట్లే యని యాతెప్ప నెక్కిన వారై ఆనదిని దాటుచుండగ నదీ మధ్యంబునకు తెప్పరాగానే అత్యధిక తరంగ ఘట్టన ధ్వనిని విని రాముడు విశ్వామిత్రునితో నిట్లనెను. మునిచంద్రా! పెద్దదైన ధ్వని వినిపించుచున్నది. అలల యొక్క రాపిడివలన కల్గు ధ్వనియో లేక మరియేదియో చెప్పి నా సందేహమును దీర్పుము రాముని యొక్క ఆ మాటలను విని ముని హృష్టమనస్కుడై ఆధ్వనుల యొక్క చరిత్రను చెప్ప గడగెను. కైలాసమున బ్రహ్మ క్రీడసల్పు కోర్కెతో మనస్సంకల్పముతో పూర్వమొక తటాకమును సృష్టించెను. ఆ సరోవరము మానససరోవరమని పిలువబడు చుండెను. ఆసరస్సులో నుండి వచ్చిన దగుటచే సరయూనది కాపేరు గలిగినది. ఆనది యయోధ్యాపురి నంటుచు ప్రవహించి ఇచట గంగా తరంగిణిని గలయుచున్నది. ఆ కలయికచే బుట్టిన శబ్దమిది. శ్రద్ధతో నమస్కారము చేయుము. అని చెప్పగా రాజపుత్రులభివాదము జేసిరి. అవ్వలి గట్టును జేరినవారై ముగ్గురును ప్రయాణమై వెళ్ళుచు నొక భయంకరమైన యడవిని చూచిరి. “ఈ వనాంతరము నిర్జనమై చూచుటకు భయముగొల్పుచున్నది. దీని యందెవరు నివసించెదరో చెప్పుమని” రాజపుత్రులు ప్రశ్నింపగా మునీంద్రుడు ‘దీని చరిత్రను చెప్పెదను వినుడు’ అని యిట్లు చెప్పదొడగెను.

## విశ్వామిత్రుడు రామునకు మలద కరూశ వృత్తాంతములను దెల్పుట

పూర్వకాలమున నిచట దేవనిర్మాణములవంటి నిర్మాణము గలిగి ధనసమృద్ధములయిన జనపదములుండెడివి. వీనిని మలద కరూశము లను

పేర్లతో పిలిచెడివారు. పూర్వమింద్రుడు వృత్రుడను రాక్షసుని సంహరించుటచే నతనికి బ్రహ్మహత్యా పాపము వచ్చి శరీరమంతయు మలము పూసికొన్నట్టయ్యెను. ఆకలియు నధికమయ్యెను. దేవతలు మౌనులు ఇచ్చట సురనాధుని సుస్నాతుని చేయింపగా అతని శరీరమందలి మలము కారూశము తొలగిపోయెను. ఇట్లు నిర్మలుడు నిష్కరూశుడైన యింద్రుడు సంతోషించి ఆమలంబును, కారూశమును ఆ భూమి బడుటచే ఈ దేశములు మలద కారూశ దేశములుగా పేరుగాంచునని యింద్రుడు వరమిచ్చెను. పాకశాసనుడిట్లు చెప్పగా బుధులెల్లరును మేలుమేలని మెచ్చుకొనిరి. జనులు సౌఖ్యమును ధనధాన్యములును గల్గి వృద్ధి బొందిరి.

**విశ్వామిత్రుడు రామునకు తాటకావృత్తాంతము దెలుపుట**

ఇట్లు కొంతకాలము జరిగిన తరువాత తాటక యనుపేరు గల యక్షిణి వేయియేనుగుల బలముగలది యవతరించెను. ఆమె యేరూపమైనను ధరించు నేర్పుగలది. ఆమె సుందుడను వానికి భార్యయై మారీచుడను నొక్క కొడుకును గనెను. వాడు ఇంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడు. భయంక రాకారుడు. ఆరాక్షసాధముడు దుష్ట చరిత్రుడు ఎందరో ఋషులను, సాధువులను భక్షించినవాడు. ఎన్నియో క్రతువులను ధ్వంసము చేసినవాడు. రోజురోజుకు నిందున్న జనులను దిని వేయుచు ఈదేశమును వల్లకాడు గావించెను. ఆవైభవోపేతములైన మలద-కరూశదేశము లిప్పుడీ భయంకర స్థితిని బొందినవి. ఈ దేశములేవిధముగా పాడైపోయినది విన్నావు గదా రామా! వారల నివాసప్రదేశము దగ్గరలోనే యున్నది. ఒకటిన్నర యోజనముల దూరమున మాత్రమే గలదు. నా ఆజ్ఞ ప్రకారముగా నీ భుజశక్తితో తాటకయను రాక్షసిని సంహరించి యీ ప్రదేశమునకు భయమును బోగొట్టుము. తాటక వలన తరుమబడిన ఇక్కడి జనులు మనసులో నైన నిక్కడకు రావలెనని భావించుటలేదు. వారెల్లరు ఇక్కడకు వచ్చి సుఖముగ నుండునట్లు చేయుము. అని విశ్వామిత్రుడు చెప్పెను.

# ఇరువది అయిదవ సర్గము

## తాటక నగస్త్యుడు శపించుట

అంతట రాముడు "ఓ తపోధనా! యక్షులు బలహీనులని లోకములో ప్రతీతి గలదు గదా! వేయి యేనుగుల బలము తాటకకెట్లు వచ్చెనో తెలుపుమని యడుగగా మౌని యిట్లనెను. పూర్వము సుకేతుడను సదాచారవంతుడగు యక్షుడొకడు సంతానములేక తీవ్రమైన తపస్సుచేయగా బ్రహ్మ వానియందు సంప్రీతుడై వేయియేనుగుల బలముగల తాటకయను పుత్రిక ననుగ్రహించెను. గాని పుత్రునొసగలేదు. ఆపుత్రికకు రూపయౌవనములు రాగా సుకేతుడు ఝర్ఝుని కుమారుడగు సుందున కిచ్చి వివాహము చేసెను. అది మారీచుడను క్రౌర్య నిరతుడగు ప్రియపుత్రుని గాంచెను. తరువాత సుందుడగస్త్యుని చేత మరణించెను. అంత తాటక పుత్రునితో గూడి దిక్కులు బెదరిపోవునట్లు బొబ్బలు పెట్టుచు అగస్త్యుని జంపుటకు పోగా భయపడక నిల్చి మౌని వారిని శపించెను. రాక్షసుడవు గమ్మని పుత్రుని, వికార మొగముతో వికారరూపముతో సంచరింపు మని తాటకను అగస్త్యుడు శపించెను. ఆ కోపముతో వారిరివురు ఆ మునీశ్వరుడు సంచరించు నీ జనపదములను పాడుచేసిరి. బ్రాహ్మణులకు గోవులకు హితము కలుగునట్లుగా నిర్దయడవై నీవు దీనిని జంపి కీర్తిని పొందుము.

## తాటకను జంప రాముని విశ్వామిత్రుడు ప్రబోధించుట

శాపము పొందిన తాటకను ఏలోకమునందైనను ఎట్టివాడైనను భయముచే జంప నుత్సహింపలేకున్నాడు. ఓ రాజాకుమారా! నీవే సమర్థుడవు. స్త్రీని వధించిన పాపము పొందుదునని దయాపరుడై చింతింపకుము. రాజకుమారు

డెల్లప్పుడు నాల్గుజాతుల వారిని రక్షింపవలెను. క్రూరపు పనినైనను మంచి పనినైనను పాపము సంభవించునదైనను ప్రజలను రక్షించుటకై రాజు చేయవలయును. రాజ్యభారము వహించిన రాజపుత్రులకిది పూర్వమునుండియు నున్న ఆచారమే గదా. ఆధర్మము నీవెరిగినదే కదా. అందువలన అధర్మపరురా లగు నీమెను చంపుము. నీవు వినదలచినచో ఇట్టి పూర్వవృత్తాంతములను చెప్పెదను వినుము. పూర్వము భూమినే చంపబూనిన విరోచనపుత్రికను మంథరయను దానిని క్రూరతతో నింద్రుడు చంపినాడు గదా. లక్ష్మీభర్తయగు విష్ణువు ఇంద్రలోకమును కోరిన శుక్రుని తల్లియైన భృగుపత్నిని చక్రముతో సంహరించెను గదా. రామా ఇంతేకాక అనేకులగు రాజులు అధర్మముగా సంచరించు స్త్రీలను చంపదగిన వారు గనుక చంపివేసిరి. సందేహింపకుము. రామచంద్రా! నా యాజ్ఞగా నీవీపనిని చేయుము.



# ఇరువది యాఱవ సర్గము

## శ్రీరాముడు తాటకను వధించుట

ఈ ప్రకారముగా గొప్ప అర్థవంతమయినవియు, మంచివియునైన మాటలను మౌని చెప్పగా విన్నవాడై 'విశ్వామిత్రుడే పని చెప్పినా వినయ విధేయతలతో చేయవలసినదిగా తనతండ్రి నిండుసభలో చెప్పెను. ఆయన మాట జవదాటరాదు. గౌరవముతో అనుసరింపవలెను. కనుక మునీంద్రుని యిష్టప్రకారమే చేసెదను. నన్ను పంపిన తండ్రి యాజ్ఞమేరకు మౌని శాసనము నెరవేర్చెదను సందేహమేల' యని తలచి చేతులు జోడించి మునీంద్రా ! విప్రులు గోవులు మొదలగునవి సుఖము పొందునట్లుగా మీ ఆజ్ఞప్రకారము తాటకను వధించెదననెను. దిక్కులు పిక్కటిల్లునట్లుగా ధనుస్సు యొక్క నారిని మ్రోయించెను. ఆధ్వని చెవులు పగల్చునంత ఘోరముగా విన్పించగా ఆయక్షిణి హుంకారము చేయుచు గర్జించుచు లేచి ఆధ్వని వచ్చుచున్న దిక్కుగా గొప్ప ఆటోపముతో వేగముగా వచ్చుచుండగా రాముడు తమ్మునితో నిట్లనెను. "లక్ష్మణా! దారుణమైన దేహముతో వికారవేషముతో –భైరవారావము చేయుచున్న రాక్షసిని జూచితివా ? దీని భయంకరరూపమును చూచినచో ఎంతటి ధీరులకైనను గుండె బ్రద్ధలుగాక యుండునా ? ఇది సాటిలేని రాక్షసమాయచే నెవ్వరికైనను జయింపరానిది. స్త్రీ కనుక దీనిని జంపజాలదు. దీనియొక్క ముక్కుచెవులు గోసి దౌర్జన్యమును మాన్పి పరువెత్తు వేగమును తగ్గించెదను చూడు" మనుచుండగా ఆ దానవి చేతులెత్తుకొని పెద్దదైన హుంకారముతో రాముని

మీదకు వచ్చెను. అట్లు వచ్చుచున్న దానిని విశ్వామిత్రుడు హుంకారముతో అదల్చి "జయ జయ రామభద్ర" నీకు జయము కలుగునని స్వస్తి వచించెను. యక్షకాంతయైన తాటక వేగముగా ధూళివర్షముతో రామలక్ష్మణులను ముంచివేయగా విస్మయము చెందినవారై యొక్క నిమిషంబు ప్రతిగా నేమిచేయుటకు దోపకయున్న సమయమున, నా మాయావిని కఠినమైన రాళ్లను ధారలుగా వర్షముగా కురిపించెను. అప్పుడు రాముడు దాని యొక్క దుర్మార్గమును మాన్పించుటకై బాణములచే ఆ రాక్షసి చేతులను రెంటిని ఖండించెను. అంతలో దయను వీడి లక్ష్మణుడు దాని ముక్కు, చెవులు లేనిదాని గావించెను. అంతలో నూరకుండక ఆ రాక్షసియు కామరూపములను దాల్చి కనబడకుండ అనేక మాయలు చేయుచు రాళ్లవాన గురియించెను. ఆ రాక్షసి యొక్క అనూహ్యమైన పరాక్రమమును వేగమును జూచినవాడై మౌని, "రామా! నీవు దీనియందు లేశమైనను దయజూపకుము. దుష్టమైన నడవడి గలిగినదియును క్రతువులను విఘ్నమొనర్చునదియును, గొప్ప పరాక్రమము గలదియునగు దీనినిప్పుడే చంపివేయుము. సంధ్యాకాలము దాటినచో దైత్యులను సంహరించుట కష్టము"అని చెప్పునంతలో మాయాబలముతో రాళ్లవాన గురియించుచు యక్షిణి సమీపింపగా రాజపుత్రుడు శబ్దవేధులయిన బాణములచే దానివేగంబణంచెను. అయినను మానక అది మీద పడుటకు రాగా బలవంతుడగు రాముడు రివ్వున బాణమొక్కటి సంధించి దాని రొమ్మును నాటునట్లు గొట్టగా నా రాక్షసి చచ్చి భూమి వణకు నట్లుగా పడగా ఇంద్రాది దేవతలు సంతోషించి బాగుబాగు అని పొగడుచు రాముని పూజించిరి. అంత ఇంద్రుడు మొదలగు దేవతలందరు సంతోషముతో "మహామహుడవైన కౌశిక మునీంద్రా ఈ రాక్షసకాంతను జంపిన రామునకు భృశాశ్వసుతులను ఆప్తులుగా జేయుము. లోకములను రక్షించుటకై ఈ రాజకుమారులు చేయవలసినవి చాలా

యున్నవి గదా! ఈతని కంటె పుచ్చుకో తగినవారు మఱియెవ్వడు నీకు లభింపడు గాన నీకు దెలిసిన విద్యాసమూహమును రామునకీయవలసినదని చెప్పి వెడలగా విశ్వామిత్రుడు ఆ రఘువీరుని చేతులతో దగ్గరకు దీసుకొని శిరంబు మూర్కొని, "ప్రసిద్ధమైన చరిత్ర గలవాడా! రామా! ఈ రాత్రి యిచ్చట గడపుదము రేపు మదాశ్రమమునకు పోవుదము" అనెను. అట్లే యని రామలక్ష్మణులును మునీంద్రుడును నారాత్రి అచ్చట గడపిరి. (మూడవనాటి రాత్రి)

మునుపు అగస్త్యుడిచ్చిన శాపము తీరిపోవుటచే ఆవనమంతయు పల్లవ పుష్పఫలములతో కుబేరుని చైత్రరధమును యుద్యానమా ! యనునట్లెంతయో సుందరముగా లక్ష్మీనివాసముగా నయ్యెను.



# ఇరువది యేడవ సర్గము

**ఆ** ప్రకారముగా అచ్చట నారాత్రి గడపిన వారై ఉదయముననే యా చిన్ని బాలకులను మునిరాజు మేలుకొల్పి శ్రీ రాముని జూచి" రామా ! నీ చరిత్రమునకు నాకు సంతోషమయ్యెను. నరులు, సురలు, రాక్షసులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, గరుడులు, సిద్ధులు, మున్నగువారి నెవ్వరినైనను యుద్ధమున జయింప జాలెడి గొప్ప అస్త్రముల సమూహమును మిక్కిలి సంతోషముతో నీకెచ్చెదను. సొంపుగా పుచ్చుకొనుము. ఎట్టి శత్రువులనైనను మట్టుపెట్టు గలవాడవై ధరను ప్రకాశించెదవు"అని మౌనీంద్రుడు చెప్పెను.

**విశ్వామిత్రుడు రామునకు దివ్యాస్త్రముల నిచ్చుట**

"దండచక్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, ఐంద్రాస్త్రము, వజ్రాస్త్రము, పవిత్రమగు శివశూలము, బ్రహ్మశీర్షాస్త్రము, ఐషీకాస్త్రము, బ్రహ్మాస్త్రము, మోదకి, శిఖరి అనుపేర్లు గల గదలు, వరుణపాశము, వారుణాస్త్రము, ధర్మపాశము, కాలపాశము, ఆర్ద్రము, శుష్కము అను రెండు అశనులు, నారాయణాస్త్రము, పైనాకాస్త్రము, ఆగ్నేయాస్త్రము , అగ్నిదైవతమైన శిఖరాస్త్రము, వాయవ్యాస్త్రము, హయశిరోస్త్రము, క్రౌంచాస్త్రము, శక్తులు దైత్య సమూహములు ధరించి తిరుగునట్టి కంకాళ, ముసల, కంకణములు, కాపాలము, ఇవియన్నియు నీకిచ్చుచున్నాను. ఇంకను విద్యాధరాస్త్రమును, నందనమను పేరుగల ఖడ్గమును, మానవాస్త్రము, గంధర్వాస్త్రము, ప్రశమనము, ప్రశ్వాపనము, భాస్కరాస్త్రము, దర్పణము, శోషణము, సంతాపనము, విలాపనము, దర్పకాస్త్రము, పైశాచికాస్త్రము గొప్పదైన మోహనాస్త్రము,

సంవర్తకము, తామసము, సౌమనము, అమోఘములయిన మౌసలము, సత్యము, మాయాధరంబైన తేజఃప్రభాస్త్రము, సౌమ్యశరము, త్వష్ట్రస్త్రమైన సుదాయము, భగేషువు, శీతేషువు, మానవము, అనెడు కామరూపములు, మహాబలకలితములు నయిన ఈ శరములనన్నింటిని నీకు పూర్ణముగ నిచ్చుచున్నాను. పుచ్చుకొనుము. అనిపలికి పూర్వాభిముఖుడై శుచియైయున్న రామునకు విశ్వామిత్రుడిచ్చెను.

ఇన్ని యస్త్రములను పొంద దేవతలకు గూడ నసాధ్యము. విశ్వామిత్రుడిన్ని యస్త్రమును దారుడై రామునకొసగగా రాముడును నిష్ఠతో మౌని యాజ్ఞతో జపము చేయగా ఆయస్త్ర సమూహములన్నియు రాముని సేవకులై కొల్చెను. ఆదరముతో వాటిని చేతులతో స్పృశించి, ఇంక మీరలు ఇష్టము వచ్చిన చోటునకు వెళ్ళుడు. ఎప్పుడైన నాకవసరమైన నేను కోరినప్పుడు వచ్చి నాపనిని తొందరగా జేయుడు. అని రాముడు చెప్పగానే ఆయస్త్రములన్నియు తమ ఇష్టానుసారముగా వెడలెను.



# ఇరువది యెనిమిదవ సర్గము

**మ**హాబుద్ధిశాలియగు రాముడు సంతోషముతో మునిశ్రేష్ఠునకు నమస్కరించి ప్రయాణమై నడచచు ఈ ప్రకారముగా బలికెను. “ఓ మునిచంద్రమా! దేవతలకైనను దర్లభములైన యస్త్రములను దయతో నిచ్చితివి. గ్రహించితిని. కాని వీనికి నుపసంహారములు యధావిధిగా నిమ్ము అనగా సువ్రతాద్యుడగు మౌని రామచంద్రునకు వాటినన్నిటిని నిట్లుచెప్ప దొడంగెను.

## విశ్వామిత్రుడు శ్రీరామున కుపసంహారాస్త్రము లొసంగుట

సత్యవంతము, సత్యకీర్తి, ప్రతిహారతరము, ధృష్టము, రభసము, పర్మాజ్ఝ్ముఖము, అవాజ్ఝ్ముఖము, లక్షాక్షము, విషమము, దశాక్షము, ఉగ్రమమగుదృఢనాభము, సునాభము, సుదీప్తము, దశశీర్షము, శతోదరము, శతవక్త్రము, కృశనము, జ్యోతిషము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, నైరాశ్యము, విమలము, శుచిబాహువు, విరుచి, రుచిరధనము, మహాబాహువు, నిష్కలి, దైత్యశయనాస్త్రము, హరిద్రము, యోగాంధరము, మకరము, ధాన్యము, పిత్రస్త్రము, నసము, కరవీరము, విధూతము, కామరుచి, ఆవరణము, మోహము, కామరూపము, సర్వనాభము, జృంభకము, సంతానము, వరణము, అనునట్టి అనంతకాంతిమంతములైన భృశాశ్వ తనూజులైన కామరూపములైన జపించువారికి చింతామణుల వంటివైన ఉపసంహారాస్త్రంబులను స్వీకరింపుమనుచు విశ్వామిత్రుడు శ్రీరామునకొసగెను.

## శ్రీరామున కుపసంహారాస్త్ర దేవతలు ప్రత్యక్షమగుట

కొన్ని సౌమ్యమైనవియు, కొన్ని గొప్పనైన దివ్యతేజము గలవియు, కొన్ని సుఖప్రదములైనవియు, కొన్ని జ్వాలతో దహించు వాని బోలియున్నవియు, కొన్ని పొగలతో గూడినవియు, కొన్ని సూర్యునివలె ప్రకాశించునవియును, కొన్ని చంద్రునివలె ప్రకాశించునవియును అగు ఉపసంహారాస్త్రము లన్నియు

రామచంద్రుని యొద్దకు వచ్చి చేతులు జోడించి తీయనిమాటలతో నిట్లనెను.

"తామరరేకుల వంటి కనులు గల ఓ రామచంద్రా! మేము నీకు సేవకులము. చేయవలసిన పనిని మాకు దెల్పుము" అని పలుకగా రాముడు నేను మదిని తలచినంతనే వచ్చి సాహ్యామొనరింపుడు. అంతవరకు మీ యిష్టము వచ్చిన చోటునకు వెళ్లుడనెను. అంత నాయస్త్రములు చేతులు జోడించి నొసట ధరించి రామునకు ప్రదక్షిణించి కనబడకుండ వెడలిపోయినవి. అంతట విశ్వామిత్రు నాజ్ఞగైకొని తాను గ్రహించిన అస్త్రశస్త్రములన్నింటిని ప్రయోగోపసంహారములతో శ్రీరాముడు లక్ష్మణున కొసంగెను. ఈ విధముగా ఆ విద్యలెల్ల నెరిగినవారై వారిర్వురు ప్రకాశించిరి.

ఆ వటుశ్రేష్ఠులతో (బ్రహచార్యశ్రమమునందున్నవారు) మౌని వరుడు ముందుకు సాగుచుండగా త్రోవలో మృదువులైన మాటలతో రాముడు మునితో నిట్లనెను."ఓ ఋషివర్యా! ఆ కొండ దగ్గర అందమైన చెట్లవరుసలను జూచితిరా? సరసములయిన సాల రసాల తమాల మాలతీ మలయజ బీజపూర శిరీష మాధవీలతాదికములతో, గూడి మేఘ సమూహమువలె నొప్పుచు చిత్రచిత్రము లైన శుకపిక కోకిలల యొక్కయు నెమిళ్లయొక్కయు, తుమ్మెదలయొక్కయు మ్రోతలుగలదై మనోహరమై కనుపట్టుచున్నది. గోరువంకల–చిలుకల–నెమిళల కంఠధ్వనులు మిక్కుటమై ఆకాశము నంటుచున్నవి. ఇచ్చట నే ఋషి యాశ్రమంబైన గలదా ? దారుణమైన అడవిని దాటితిమి గదా ? ఈ ప్రదేశము చాలా సుందరముగాను నెమళ్ల, కోకిలల, చిలుకల కలకల ధ్వనులతోను స్వేచ్ఛగా సంచరించు మృగములతోను ఒప్పుచున్నది. ఇది యే వనమో తెల్పుడు. అని పలికి మరల మీ యొక్క క్రతువును పాడుచేయు వారెవ్వరు? మీరు యజ్ఞమొనర్చు వనమేది? ఆ దుర్మార్గులుండుచోటెచ్చట? యజ్ఞమెప్పుడు ఏ ప్రకారముగా జరుగును? మేమేమి చేయవలయును? ఈ విషయములనెల్ల సెలవిమ్మనగా ముని రామచంద్రునితో నిట్లనెను.

# ఇరువది తొమ్మిదవ సర్గము

## విశ్వామిత్రుడు శ్రీరామునకు సిద్ధాశ్రమ వృత్తాంతము దెల్పుట

"రాఘవా! ఇచ్చట పూర్వము విష్ణుమూర్తి అనేకయుగములు, లోపములేని నిష్ఠతో తపస్సు చేసెను. ఆతపస్సుచే తాను కోరినవి పొందెను. ఇచ్చటనే వామనుడు కూడ వసించెను. ఆ ఆశ్రమమిది. ఇచ్చట యోగములు ఫలించును. మున్నిచట కశ్యపుడు యోగసిద్ధిని పొందెను. అందరి కోరికలు సిద్ధించుటచే దీనికి సిద్ధాశ్రమమను పేరు వచ్చెను. పూర్వము కోరినవారి కోరికలనిచ్చు కల్పవృక్షమువోలె విరోచనుని కుమారుడగు బలిచక్రవర్తి దేవతలను జయించి రాక్షససమూహము తన్ను సేవించుచుండగా లోకములను నిరాటంకముగా బరిపాలించుచుండెను. అప్పుడు అగ్ని మొదలగా దేవతలందఱు నిచ్చుటకువచ్చి విష్ణువును గాంచి కడు దీనతో "బలిచక్రవర్తి గొప్పగా యజ్ఞము చేయుచున్నాడు. అది ముగియకముందే మీరువెళ్ళి యాబలిని జూచి, మనకార్యమును నెరవేర్పుడు. ఎచ్చటెచ్చటి నుండియో యాచకులు వచ్చుచున్నారు. ఎవరేది కోరిననదియిచ్చుచున్నాడు. అది యెట్టిదైన విచారించుట లేదు. నీవు మాయతో వామనాకృతితో దేవతలకు శుభము కల్గునట్లుగా చేయుము. ఓ నారాయణా! ఓ వారిజాక్షా! అని ప్రార్థించిరి. ఆసమయమున అగ్నితేజస్సువంటి తేజస్సుగలవాడగు కశ్యపుడను ముని తనయులు కావలెననెడు కోరికతో శ్రీహరిని గూర్చి కొన్నివేల సంవత్సరములు అదితితో గలసి తపస్సుచేయగా లక్ష్మీపతియైన విష్ణువు సంతుష్టుడై అతని యెదుట సాక్షాత్కరించగా ఆయన యిట్లు స్తుతించెను. "పుణ్యతపోమయా! వరదానమూర్తీ! భక్తవరదుడవైన నిన్ను చూచుటచే నా జన్మ తరించినది. నిన్నుగన్న సకల ప్రపంచము గన్నట్లే. నీ చరణములే నాకు శరణము" అనగా కశ్యపునిజూచి కరుణ గలిగిన వాడై నీవు వరములను పొందుట కర్హుడవైతివి. నీవేమి కోరదలచితివో కోరుకొమ్మనెను. అప్పుడు

కశ్యపుడు ఓ దేవా! అసురవైరీ నాయందు వరదుడవైన నాకీవరమునిమ్ము. అదితియందు నీవై నాకుమారుడుగా జన్మించి యింద్రునకు సోదరుడవై దేవతలను గాపాడుము. నాతపమిచట సిద్ధించినది గావున దీనికి సిద్ధాశ్రమమను పేరు కలుగుగాక. అని పలుకగా తథాస్తు అని వెంటనే చని, శ్రీమన్నారాయణుడు ఎంతో గారవముతో వామనాకృతితో అదితి గర్భమందు దయించెను. అట్లు పుట్టినవాడై విరోచననందనుడు యజ్ఞముగావించు, యజ్ఞశాలకు జని బలిచక్రవర్తితో అసురేంద్రా! (మూడడుగుల) భూమినిమ్మని యాచించుచున్నాను. అని అడిగెను. బలి సమ్మతించి యీయ గడంగెను. వామనుడు దానము పుచ్చుకొని భూనభోంతరాళమంతయునిండెను. బలియను మూడులోకంబులను వామనునకర్పించెను. మునులెల్లరు మేలు మేలని పొగడిరి. దేవతల కష్టములు తొలగెను. శ్రమలు తొలగించు నీ యాశ్రమమున వామనుడు నివసించెను. రామా నేనును కమలాహృదయేశ్వరుడగు విష్ణుమూర్తి యొక్క పదపద్మములందలి భక్తితో ఇచ్చట నివసించుచున్నాను. ఇచ్చటి కారాక్షసులు వచ్చి యజ్ఞవిఘ్నము గావించుచున్నారు. నీవు వారిని వధింపవలెను. నాయనా! రామచంద్రా! భవ్యమైన నాయాశ్రమము చూడ నింక వెళ్ళుదము. రామా! ఆయాశ్రమము నాకెటువంటిదో నీకు నటువంటిదేయని భావింపుము. అని పలికి విశ్వామిత్రుడు ప్రీతితో రామలక్ష్మణులను దోడ్కొని శ్రమతీరునట్లుగా మంచు తొలగిన చంద్రుడు పునర్వసు సమేతుడై వచ్చు మాడ్కిని తన యాశ్రమము ప్రవేశించెను. అట్లు వచ్చిన వారిని ఆశ్రమములో నున్న మౌనులు చూచి యెదురు వచ్చి విధివిహితముగా వారి ముప్పురకు నాతిథేయమిచ్చిన స్వీకరించి విశ్రమించిరి. ఆ సమయమున రాముడు విశ్వామిత్రుని జూచి యిట్లనెను. మౌనీంద్రా! యజ్ఞ దీక్ష గైకొనుము. మేము జాగ్రత్తగా యజ్ఞవిఘ్నముగాకుండ చూచెదము. సిద్ధాశ్రమమను పేరు సార్థకమగునట్లు జరిగింపుము. రాఘవుడిట్లు చెప్పగా నియమముతో మౌని వేకువనే (నాల్గవరాత్రి) యజ్ఞదీక్షను దాల్చినవాడయ్యెను. రామలక్ష్మణులను సంధ్యావందనాదికృత్యము లొనర్చి యజ్ఞరక్షణ పరులై మునికి నమస్కరించిరి.

# ముప్పదవ సర్గము

## రామలక్ష్మణులు యాగ సంరక్షణ గావించుట

దేశకాలజ్ఞులు, కార్యసమర్థులు, మాటనేర్పరులు నగు రామలక్ష్మణులు మహాతపశ్శాలియగు గాధినందనునితో "మహాత్మా! రాక్షసులెప్పుడు వచ్చెదరు. వారు వచ్చు సమయమున మేము జాగరూకులమైయుండి యజ్ఞతంత్రమును గాపాడెదము" అని పలుకగా యుద్ధకౌతూహలులైన రామలక్ష్మణులు జూచి ఆమౌనులందరును మేలుమేలని పొగిడి, నేడు మొదలాఱు దినంబులు విశ్వామిత్ర క్రతువును గాపాడుడు. మౌని మౌనదీక్ష వహించి యుండును గాన మీరలు జాగరూకలై కాపాడుమని చెప్పగా వారి మాటలు విని భయంకరములైన బాణములను ధరించి భయములేక రాత్రింబవళ్ళు గొప్పపరాక్రమముతో కాపాడుచుండిరి. ఆరవరోజున లక్ష్మణునితో రాముడు లక్ష్మణా! యింక నీవును, నేనును జాగ్రత్తగానుండవలెను" అనెను. యజ్ఞము చేయుచున్న వేదిక పుష్పములతో, సమిధలతో, దర్భలతో, స్రుక్కులతో, ఆజ్యపాత్రలతో ఋత్విజులతో మిక్కిలి ప్రకాశించుచుండెను. విధిపూర్వకముగ మంత్రవంతముగ క్రతువు సాగుచున్నది. అంతలో ఆకాశమున భయంకరమైన ధ్వని వినిపించెను. వెంటనే దట్టమైన మేఘసంఘము వ్యాపించినట్లు శాంబరి నాశ్రయించి మారీచ సుబాహులు తమ పరివారము వెంటరాగా వచ్చి,రక్తమునే వర్షముగా వేదికమీద గురియించిరి. వేదికపై రక్తము అపారముగా గురియుచున్నది.

## శ్రీరాముడు మారీచుని బారద్రోలి సుబాహుని జంపుట

రామచంద్రుడంతట సౌమిత్రి సహితుడై యావేదికను జూచి యాగ్రహించిన

వాడై గబగబ వచ్చి యాకాశమున వచ్చుచున్న రాక్షసులను జూచి తమ్మునితో "లక్ష్మణా! చూడు. దుష్టులైన వీరిని చెదరగొట్టు నట్లుగా మానవాస్త్రమును వేయుచున్నాను. దీని ప్రభావముచే పెనుగాలివీచి వీరిని చెల్లాచెదురు చేయునని పల్కి మారీచుని రొమ్మునగొట్టెను. వాడు వెంటనే నూరుయోజనముల దూరమున గల సముద్రములో పడెను. మూర్ఛనంది మానవాస్త్రమహిమచే పెనుగాలికి యెండుడాకు పోయినట్లు పోవుచున్న మారీచుని జూపుచు రాముడు లక్ష్మణునితో లక్ష్మణా చూచితివా! మానవాస్త్రము సద్ధర్మయుక్తమగుటచే మారీచుని జంపకుండ మూర్ఛ నొందించి గొప్పధ్వనితో దూరముగా బారవైచినది. ఇట్లే నేను నిశితములైన బాణములచేత నీ రాక్షసులను సంహరించెదనని ఆగ్నేయబాణము సంధించి క్రోధముతో సుబాహుని రొమ్మున గొట్టగా వాడు భూమిమీద చచ్చిపడెను. తక్కిన రాక్షసులను వాయవ్యాస్త్రముతో సంహరించెను. క్రతువును పాడు చేయదలచిన రాక్షసుల నందరినీ ప్రకారముగా జంపి రాముడు పూర్వము రాక్షసులను చంపిన యింద్రునివలె ఋషులచే పూజింపబడెను. దిశలన్నియు బ్రకాశించెను. యజ్ఞము సమాప్తమయ్యెను. భయము తొలగిపోయినది. ఇది యంతయు గాంచి గాధి నందనుడు సంతోషించి ప్రీతితో రామచంద్రుని జూచి "రామా! నీవి క్రతురక్షణము చేయుటచే నేను కృతకృత్యుడనైతిని. తండ్రి యాజ్ఞప్రకారము నడచుకొని నీవును ఖ్యాతి జెందితివి. ఇందుచే నాయాశ్రమము సార్ధకమయ్యెను" అని పల్కెను.



# ముప్పది యొకటవ సర్గము

## విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలానగరమునకు దోడ్కొని పోవుట

ఆ ప్రకారముగా రాజఋషి (బ్రహ్మర్షి) యొక్క క్రతువును రక్షించి ఆ సూర్యవంశ రాజకుమారులా రేయి నిద్రించిరి. (పదవనాటి రాత్రి) ఆ రేయినట్లు నిశ్చంతగా గడపి వేకువనే లేచి ఉదయమే చేయవలసిన కార్యములన్నియు పూర్తిచేసి, విశ్వామిత్రుని, తపశ్శ్రీకలితులైన ఇతర మునీశ్వరులను సమీపించి నమస్కరించి "ఓ యోగపావనా! కుశికనందనా! ఇంకనేమి చేయవలెను. మేము నీ భృత్యులము సెలవిమ్ము" అని రామలక్ష్మణులు వినయమధురోక్తులతో పల్కగా విశ్వామిత్రాదులగు ఋషులు వారితో నిట్లనిరి. "ఓ దశరథనందనా! మిథిలానగర రాజైన జనకుడనువాడు యజ్ఞము చేయుచున్నాడు. ఆక్రతువు చూచుటకు మేమందఱము వెళ్ళుచున్నాము. మీరు కూడా మాతో వచ్చెదరా ? అచ్చటనొక దివ్యకోదండము కలదు. అది ఆ వంశములోని వాడైన దేవరాతుడను రాజునకు యజ్ఞమునందు దేవతలొసగిరి. సురలు-రాక్షసులు-గంధర్వులు-యక్షులు-గరుడులు-కిన్నరులు ఎవరైనను ఆ విల్లును ఎక్కుపెట్టలేదు. ఇంక నరుల విషయము చెప్పనేల? ఆవింటి నెక్కుపెట్టుటకై అనేకులగు రాజులు వచ్చి దానిని మోపెట్టలేక మొగములు చిన్నబుచ్చుకొని వచ్చిన త్రోవనే పోవుచున్నారు. ఓ రాఘవవంశ దీపికా! నీవా ఘనుని క్రతువును ఆ దివ్యకోదండమునుజూచుటకై మాతోరమ్ము. ఆ వంశములో బుట్టిన యొకరాజు యజ్ఞము చేసి దేవతలచే క్రతుఫలముగా ఆ కోదండమును పుచ్చుకొన్నప్పటి నుండి అది వారియింట ప్రతినిత్యము గంధపుష్ప దూప దీపములచేతను అక్షతలు

చేతను పూజింపబడుచున్నది. ”అని ఋషులు చెప్పగా రాయలక్ష్మణులు వారి వెంట బయలుదేరిరి.

రామలక్ష్మణులు తన్ను వెంబడించగా మునివరుడు ప్రయాణమై వెడలుచు ఓ వనదేవతలారా! మీకు శుభములగు గాక మిమ్ములను మీ యాశ్రమమును వీడి హిమాలయమునకు వెడలుచున్నాను. అని పల్కి ఆశ్రమమునకు ప్రదక్షిణించి ఉత్తరదిక్కుగా బయలుదేరెను. అంత మునులందరు వారి ననుసరించి బండ్లపై అగ్నిహెూత్రములతో వెళ్ళిరి. మునివెంట ఆ వనమునందలి మృగములును, పక్షులను బయలుదేరగా మీ మీచోటులకు వెళ్ళుడని వానిని మరలించి రామలక్ష్మణులు వెంటరాగా చాలాదూరము ప్రయాణించి సూర్యాస్తమయము కాగా శోణానదీ తీరమునందాగిన వారై ఆనదియందు స్నానముచేసి, సాయంత్రము చేయువిధులన్నియు నిర్వర్తించిరి. విశ్వామిత్రుని ముందిడుకొని విశ్రమించి యున్న మునీశ్వరులను సమీపించి తమ్మునితో గూడి రామచంద్రుడు ఆ రాత్రి (పదునొకండవ రాత్రి) మునివరా! ఎవ్వరిదీ దేశము? సమృద్ధిగా వృక్షలతా వితానములతోను, పక్షికూజితములతోను కన్నులకు వీనులను విందుగూర్చుచున్నది. వినగుతూహలం బయ్యెను. అనిరాముండడుగగా మునీశ్వరులెల్లరు వినుచుండ విశ్వామిత్రుండిట్లు చెప్పదొడంగెను.



# ముప్పది రెండవ సర్గము

## విశ్వామిత్రుడు తనవంశ కథ రామునకు జెప్పుట

“రామా! వినుము పూర్వము బ్రహ్మపుత్రుడను, మహానిష్ఠగలవాడు, మహామహుడు నగు కుశుడనువాడు గలడు. అతడు గుణమణియైన విదర్భరాజపుత్రిని తనకు దగిన యిల్లాలుగా బొంది తనతో సమానులైన నలువురు పుత్రులను, గుణవంతులను బడసెను. కుశాంబుడు, కుశనాభుడు, ఆధూర్తరజసుడు, వసువు నను నా నలువురు మహాదీప్తిమంతులు, నుత్సాహ ధీరత్వాది సుగుణములు గలవారునై ప్రకాశించిరి. క్షత్రియ ధర్మస్థాపన కాంక్షతో శూరులగు నాకుమారులను గాంచి కుశుడిట్లనెను. “భూమిని న్యాయముగా పరిపాలించినంత మాత్రమున పుణ్యము పెరుగును. కాననట్లు చేయుడు”. ఆ నలువురు నాఋషిపల్కులు విన్నవారై వారికి తగిన యోగ్యములైన దేశములను న్యాయమైన పద్ధతిని జనులుమెచ్చునట్లుగా పాలించుచుండిరి. అందు కుశాంబుడు కౌశాంబీనగరమును, కుశనాభుడు మహోదయమును, ఆధూర్తరజసుడు ధర్మారణ్యమను పట్టణమును, వసువు గిరివ్రజమను నగరమును, రాజధానులు గావించుకొనిరి. వారిలో వసువు అనురాజు ఈ ప్రదేశమును పరిపాలించెను. ఈ ఐదు మహాపర్వతములు నడుమ హారమువలె ప్రకాశించుచున్నది. ఈ యేఱు పడమటి దిక్కుగా ప్రవహించుచున్నది. ఈ యేటి నీటిచే పైరులన్నియు బాగుగ పండుచున్నవి. ఆ నలువురిలో కుశనాభుడు మంచిరూపముగల ఘృతాచియను దానిని బెండ్లియాడి ఇంద్రునివలె వైభవముతో వెలుగొందుచునుండి రూపవిలాసములుగల నూర్వురు కన్యలను కనెను.

## కుశనాభు పుత్రికల వృత్తాంతము

వికసించిన పుష్పములతో గూడిన తంగేడు చెట్లవలె పచ్చని రంగుగల మేనులతోను, మంచి యాభరణములతోను, పలుచని దువ్వలు వలతోను, కందర్పుకేతనములన కదలాడు పయ్యెదలతోను, యౌవనగర్వమున ఒకదినమున నుద్యానవనమున విహరించుచుండిరి. చేతులతో వీణియలు పూని పాడుచు ఆవనమున మెరుపుతీగల వలె సంచరించుచుండిరి. ఆ సుందరీమణులను జూచి జగత్ప్రాణుండైన వాయుదేవుడు మదనపరవశుడై "ఓ చెలులారా! మీ యందఱను భార్యలుగా స్వీకరించెదను. నన్నంగీకరించిన మీరెల్లరు నరత్వమును వీడి దీర్ఘాయుశ్శ్రీలతో నుందురు. మిమ్ము జూచి నప్పటినుండి మోహముచే మన్మధవేదనకు గురియయితిని. మీకు దేవత్వమబ్బును మానవులందు యౌవనము చంచలము. అని మీరెరుంగుదురుగదా" అనగా నయ్యంగనలు పరిహాస వచనములతో నిన్నెరుంగమా? భూతరక్షణపరాయణత్వమున చరాచరముల అంతరాత్మలలో నుందువు. ఇట్టి నీవంటివారు భీతకురంగలోచనల నిట్లు అవమానపరచుట ధర్మమా? ఓ పవమానా ! నిన్నిచటినుండి పంపించ గలము గాని మా తపస్సు పాడుచేసికొనుట కిష్టములేదు. కుశనాభుని పుత్రికలమని యెఱుగవా? పాపము మన్మధుడు నీకన్నుల దుమ్ముగొట్టుటచే నెఱుగకున్నావు గాబోలు మాతండ్రి నిన్నిప్పుడే త్రుంచ గలడు. అతనిని చులకనగా జూడకుము. మాతండ్రి ఇష్టపడి యేఘనునికిచ్చిన అతడే మాకు భర్త. అనవసరముగా మాటాడక వెడలుము. అని ఆ కన్యకలు జంకులేక మాటాడిరి. ఆమాటలకు వాయుదేవుడు మిగుల కోపించి దయారహితుడై వారి శరీరములలో ప్రవేశించి వికృతి గల్గించెను. కరుకైన శరీరములను వంకరగా నున్న నడకలును కురుచైనతొడలను గలిగి మరుగుజ్జు రూపకములు గలవారై వడివడిగా నింటికి వచ్చిరి. ఈవిధముగా నిల్లుచేరి సిగ్గుచే సొమ్మసిల్లి పడిన కుమార్తెలను కుశనాభుడు చూచినవాడై "మిమ్మేదుర్మార్గుడిట్లు చేసెను. ఇట్లు మాట్లాడకుండ నేలబడి దొర్లుచున్నారేమి? ఊరక కన్నీరు గార్చెదరేమి? మీ దుఃఖమునకు కారణము చెప్పుడని" అడిగెను.

# ముప్పది మూడవ సర్గము

## కుశనాభునకు కుమార్తెలు తమపరాభవమును దెల్పుట

వారు కన్నీరు మున్నీరుగా నేడ్చుచు కుశనాభుని పాదములపై బడి దుఃఖముతో నిట్లు చెప్పిరి. "ఓ తండ్రీ! ఏమి చెప్పుదుము. మోహాంధుడైన గాడుపు దుర్మార్గుడై మమ్మిట్లొనరించెను. అతడు నన్ను భర్తగా స్వీకరింపుడని నిర్బంధించెను. మేమును "నీవు మాతండ్రిని కోరుము. తండ్రి యొసగినచో అట్లే అగుగాక. మాకు స్వాతంత్ర్యమున్నదా? తండ్రిచాటు బిడ్డలము. కనుక అధర్మముగా మాటాడుకుము. మమ్ముకోపింపజేయకుము. అని పలుకగా ఆ పాపి మమ్ముకుబ్జలను జేసి యవమానించెను.

శత్రుదమనుడైన ఆకుశనాభుడు కుమార్తెలను జూచి బిడ్డలారా! మీ క్షమ మెచ్చదగినది. నావంశ ప్రతిష్ట నిలువ బెట్టితిరి. ఒక్కమాటలో జెప్పవలెనన్న స్త్రీలకైనను పురుషులకైనను క్షమయే భూషణము. వాయువిట్లు చేసినను మీరు ఓర్పువహించుట చాల అసాధ్యమైనపని. ఇంతకన్న ఉత్తమము వేఱొకటి యున్నదా? క్షమమే దానము. క్షమమే యజ్ఞము, క్షమమే సత్యము, క్షమమే సత్కీర్తి, క్షమమే సద్ధర్మము, కన్యలారా అందుకే ఈ జగములన్నియు క్షమయందే నిలిచియున్నవి. ఈ ప్రకారముగా తనకుమార్తెల నూరడించి కుశనాభుడు కొలువుతీర్చి విశ్వాసపాత్రులగు మంత్రులతో తనకుమార్తెలనీయదగిన వరులను గూర్చి యాలోచించెను. ఇట్లు కుశనాభుడు రాజ్యము చేయుచున్న కాలమున నూర్ధ్వరేతస్కుండైన చూళియను మౌని తపస్సు చేయుచుండగా ఊర్మిళ యొక్క కుమార్తెయు, సుమతియునగు సోమదయను గంధర్వయువతి అతని యొద్ద భక్తితో పరిచర్యలు చేయుచుండెను.

## బ్రహ్మదత్తు చరిత్రము

ఇట్లు కొన్ని సంవత్సరములు గడవగా మౌని సోమదయొక్క భక్తికి మనసులో

మెచ్చుకొని "ఓ సుందరాంగీ! నీ యొక్క శుశ్రూషను మెచ్చుకున్నాను. నీ కేమి కోరిక కావలయునో కోరుము" అనగా తన శుశ్రూషకు ముని సంతుష్టుడగుట తెలిసికొని భాగ్యమనుకొని మిక్కుటయగు సంతోషముతో మౌనితో నిట్లనెను. "ఓ చూళీ ! దివ్యమైన తపస్సు చేసిన మౌనీ ! నీ విట్లడుగుట నా భాగ్యముగా భావించుచున్నాను. సద్బ్రాహ్మణుడవు. బ్రహ్మజ్ఞానము గలవాడవు. ఓ బ్రహ్మతో సమానుడగు వాడా! పరమపవిత్రుడు బ్రహ్మతపోయుక్తుడునైన పుత్రుని దయచేయుము. నాకు భర్తయెవ్వడు లేడని నీకు తెలియును. నేను వివాహము చేసికొనలేదు. ఓ కరుణాకరా! ఈ శరణు వేడిన నన్ను నీ మహిమచేతనే పుత్రవతిని జేయుము". అనగా ఆ కన్యమాటలు విని ప్రసన్నుండై చూళి తనమనస్సంకల్పముచే గుణవంతుడగు పుత్రునొసగి పంపెను. ఆ సోమదయొక్క పుత్రుడైన బ్రహ్మదత్తుడు రాజై కాంపిల్యమను పట్టణమును నేలుచుండెను. అతని కీర్తి దశదిశల విస్తరించెను. ఆ బ్రహ్మదత్తుని తన కుమార్తెలకు తగిన వరునిగా నిశ్చయించి, కుశనాభుడతనిని బిలిపించి, ప్రేమతో తన యభిప్రాయము చెప్పి, తనయొక్క కుమార్తెలను నూర్వురను ఇచ్చి పెండ్లిచేసెను. వింతగా అందరు చూచుచుండగా ఆ కన్యలచేయి బ్రహ్మదత్తుడు పట్టగానే వారి యొక్క వికృతములైన రూపములుపోయి రూపసంపదలతో ప్రకాశించిరి. తన పుత్రికలను జూచి కుశనాభుడు విస్మయము సంతోషము పొందినవాడై వారిని తగిన భర్తయైన బ్రహ్మదత్తునితో బంపించెను. తనకుమారునకు తగిన ఆ యువతులను చూచి సోమద శరీరము గగుర్పొడువగా వారిని స్పృసించి–వారిని వారి తండ్రియగు కుశనాభుని మెచ్చుకొనెను.

ఆ విధముగా తన నూర్వురు పుత్రికలను బ్రహ్మదత్తుడు పెండ్లియాడి తీసికొనిపోవగా కుశనాభుడు తనకు పుత్రసంతతి లేనందున పుత్రలబ్ధికై యజ్ఞము చేయగా బ్రహ్మ కుశనాభుని గన్గొని "నిన్నుమించినవాడు గాధియను పుత్రుడు నీకు కలుగును. అతడు భూమిని ధర్మవంతమొనరించును". అని చెప్పి అంతర్ధానమయ్యెను.

# ముప్పది నాలుగవ సర్గము

**అం**త కొంతకాలమునకు ధర్మమును సంరక్షించుటకై గాధి జనించెను. ఆ గాధియే నా జనకుడు. ఓ సుగుణభూషణుడవగు రామా ! ఈ విధముగా నేను కుశవంశోద్భవుడనగుటచే జగత్తునందు కౌశికుడని ప్రసిద్ధికెక్కిన వాడను. నాయొక్క అక్కగారైన సత్యవతిని ఋచీకుడను ముని భార్యగా చేసుకొనిరి. ఆమె తన పాతివ్రత్యపు మహిమచేత శరీరముతోనే స్వర్గమును పొందెను. అంతేగాక కౌశికి యనుపేరుతో జగముల యొక్క శ్రేయస్సు కోరినదై యఖండ నదీమతల్లిగా దేవలోకము నుండి హిమాలయ శిఖరమునందు దిగెను. ఆ అక్కయైన కౌశికి యందుండు అభిమానముచేతనే నేనుకూడ అచ్చటనే సుఖముగా నుండగోరితిని. ఆ సత్యవతి సత్త్యైక పథచారిణియై సత్యవతియని ప్రఖ్యాతి చెంది సాటిలేనిదయ్యెను. రామా ! నీ వడుగుటచే నా వంశచరిత్రను నా జనన వృత్తాంతమును నీకు తెలియజెప్పితిని. నేనిట్లు కథలు చెప్పుచుండుటచే అర్ధరాత్రి దాటినది. ప్రొద్దుననే లేచి ప్రయాణము చేయవలెను గదా! నిద్రలేకున్న శ్రమచే అడుగు ముందుకు సాగదు. నీకు శుభమగుగాక ఇంక నిద్రపొమ్ము. (11వ రాత్రి)

### రాత్రివర్ణనము

ఆ రాత్రి వృక్షములయందు ఆకులు కూడ కదలుట లేదు. మృగములు – పక్షులు సద్దుచేయక నిద్రపోవుచున్నవి. చీకటులుపోయి ఆకాశము పెద్దపెద్ద కనులు అనునట్లు చుక్కలతో నిండెను. చల్లని కిరణములతో జగములను ముంచెత్తునట్లు చంద్రుడు ఉదయించెను. చీకటిని లెక్కచేయని గుడ్లగూబలు మొదలయిన క్రూర సత్వములు రాక్షస సమూహములు సంచరించుట మొదలుపెట్టినవి. అని విశ్వామిత్రుడు చెప్పగా మునులు నీవు మహానుభావుడవు. ఈ రాజకుమారులు కూడ నిరుపమానులు. నీ సోదరి కూడ నదియై భూమిని పవిత్రము చేసినది అని స్తుతించుచుండగా అస్తమించిన సూర్యునివలె ముని నిదురించెను. శ్రీరాముడు తమ్మునితో గడ్డిశయ్యయందు నిద్రించెను.

# ముప్పది యైదవ సర్గము

**అ**ట్లా రాత్రి గడిపి వేకువనే మునులతో గూడి లేచి కాల్యకృత్యములను దీర్చి కౌసల్యాకుమారుడైన రాముని గారాబముతో 'రామా! లెమ్ము లెమ్ము. తెలతెలవారుచున్నది. మనము ప్రయాణమై వెళ్ళవలెను గదా! నీకు శుభమౌను లెమ్ము" అని లేపెను. ఆ ముని యొక్క మధుర వాక్కులను విని నిద్రలేచి అనుష్ఠానములను యథావిధిగా జరిగించుకొని త్వరగా పయనమగుటకు గాను 'మౌనీంద్రా ! శోణనది శుభ్రమైన నీటితో ఎక్కువలోతులేనిదై ప్రవహించుచున్నది. ఏ విధముగా దీనిని దాటవలెను? అని యడుగగా విశ్వామిత్రుడు నాయనా! ఈ మునీంద్రులేరేవున దాటెదరో మనము గూడ ఆ రేవున దాటవలెననెను'. అంత మహర్షులందరఱు శోణానదిని దాటి రామలక్ష్మణులతో వనమున జనుచు మధ్యాహ్నసమయమునకు జాహ్నవీనదిని సమీపించిరి. మంచి చోటున తర్పణాదులు గావించి అమృతముతో సమానమైన హవిస్సును భుజించిరి.

## శ్రీరాముడు గంగానదీ వృత్తాంతము విశ్వామిత్రునడుగుట

తరువాత సాయం సమయమున ఆ నది సమీపమున ఇసుక తిన్నెలపై విశ్వామిత్రమునితో గూడి యందఱు కూర్చున్నవారైరి. సుగుణభద్రుడగు రాముడు మౌనిని గాంచి, దేవతలనదియైన యీ నది మూడు త్రోవలుగ సముద్రములో గలియుటకు కారణమేమి? యని అడుగగా గాధినందనుడు గంగ యొక్క ప్రభావమును, దాని యొక్క వృద్ధిని వినువారు సంతోషించునట్లుగా నిట్లు చెప్పదొడంగెను.

"ప్రాలేయాచలము గలదు గదా! దాని రత్నమయములగు శిఖరములు

ఆకాశము నంటుచుండును. గైరికాది ధాతువులచే ప్రకాశించుచుండును. చల్లని గాలులు వీచుచుండెను. ఆ హిమవంతుడు మేరుపర్వత పుత్రియగు మేనకయను కాంతను భార్యగా బొంది విఖ్యాతలైన యిరువురు పుత్రికలను కనెను. వారిలో పెద్దది గంగాదేవి. రెండవయామె ఉమాదేవి అను నామములతో వృద్ధినందు చుండిరి. దేవహితార్థమై సురలు హిమవంతుని జేరి మహాత్మా యి గంగను దేవలోకమున ప్రవహింపజేయుము అని వేడ పర్వతరాజు వారి యాశలను త్రోసివేయక త్రిలోకపావనియైన గంగను లోకశ్రేయస్సును గోరి వారి కొసగెను. వారామెనుగ్రహించి తమ భూములకు వెళ్లిరి. రెండవ కూతురైన ఉమ చలనములేని గొప్ప తపస్సుచేసి శివుని భార్యయయ్యెను. హిమవంతుని కుమార్తె లిరువురిట్లు ప్రఖ్యాతిని బొందిరి. ఈ పర్వతరాజు కుమార్తెదేవనదియై స్వర్గమున ప్రవహించుచున్నది. ఈ గంగ పర్వతరాజు కూతురైన విధమును, ఆకాశగంగ యైన విధమును జెప్పితిని".



# ముప్పది యాఱవ సర్గము

## గంగ త్రిపథగయైన వృత్తాంతము శ్రీరామునకు విశ్వామిత్రుడు దెల్పుట

అనగా రామలక్ష్మణులు ఉత్సాహము గలవారై మహాత్మా! యీ చరిత్ర యింకను వినవలెననిపించుచున్నది. మంచుకొండ యొక్క కుమార్తె ఎందుకు మూడుత్రోవలు ప్రవహించినది? యని యడుగగా మౌని " వినుడు గంగ యొక్క సర్వవృత్తాంతమును జెప్పెదను." అని యిట్లు వివరించెను.

పూర్వకాలమున చంద్రశేఖరుడగు శివుడు పార్వతిని బెండ్లాడి మహానందముతో ఆమెతో భావజకేళిలోనుండగా నూఱుదివ్య వర్షములు గడచినను ఒక్క పుత్రుడు కూడ పుట్టడయ్యెను. మహాభీతితో బ్రహ్మ ఇంద్రుడు దేవతలతో గూడి శివుని సమీపించి ఈ పార్వతియందు సుతుడుద్భవించినచో అతని తేజస్సు భరింపశక్యము గాని దగునని కలత జెందుచు నమస్కరించి దేవదేవా! నీలకంఠా! రక్షింపుము. మామ్రొక్కులను గ్రహింపుము. నీతేజస్సు నీజగత్తు భరింపలేదు. నీవును, ఉమాదేవియు మీమీ తేజస్సులను తపముచే మీయందే నిగ్రహించుకుని లోకములను లయింప బోకుము. అని దేవతలు కొనియాడ శంకరుడు "దేవతలారా! మేమే ఈ వీర్యమును ధరింతుము. జనులు దేవతలు సుఖింతురు గాక. ఇప్పటికి స్థానమునుండి చలించిన నా వీర్యము నెవ్వరు ధరింతురు"? అని ప్రశ్నింపగా దేవతలు నీ తేజమునీభూమి తప్ప ఈ దేవతలలో నెవ్వరు ధరింపగలరు? అని విన్నవించిరి. అంత శంకరుడు స్థానము నుండి చలించిన తన తేజమును భూమి మీద విడువగా అది వనములు పర్వతములు నిండెను. భూమి పగిలిపోవునేమో యనిపించుచుండెను. అప్పుడు దేవతలు భయము చెంది అగ్నిహోత్రుని జూచి నీవు వాయువుతో గూడి ఈ

తేజమును ధరింపుమనగా వల్లెయని దానిని స్వీకరించెను. అంతనది విభవాభిరామమై హిమశైలము మాదిరిగా శరవణమయ్యెను. అద్దాని నుండి కార్తికేయుడు పుట్టెను. అతడిట్లు అగ్నిహోత్రిని పుత్రుడయ్యెను. దేవతలు చూచి సంతోషముతో శివపార్వతులను పూజించిరి.

## పార్వతి దేవతలను శపించుట

పర్వతరాజు ముద్దుపట్టియైన పార్వతి కోపముతో ఆ దేవతలను జూచుచు పరుషపు మాటలతో 'మీరు చేసిన పనికి ఫలము అనుభవించుడు' అని దోసిటితో నీటిని బట్టి "నాకు తనయులు గలుగ వలెనను కోర్కెకు విఘ్నము కలిగించితిరి గాన మీకు మీ భార్యలుబిడ్డలను గనరు. ఇకవారు గొడ్రాళ్లై యుండెదరు" అని శపించెను. భూమిని జూచి యాగ్రహముతో "ఓసీ ! పాపురాలా ! వివిధ స్వరూపములు గల దానవై యనేకులకు భార్యవగుదువు గాక. నాకు పుత్రులు గలుగుట సహింపలేకపోయితివి. కాన నీకు కూడా పుత్రజననము వలన నేయానందము కలుగకుండుగాక" యని శపించెను. ఇట్లు శపింపబడినవారై సిగ్గుతో దేవతలు తలలువంచుకొనగా వారియొక్క దుఃఖమును జూడలేక శివుడు గౌరితో ఉత్తరదిక్కుగా పోయి నిష్ఠతో హిమగిరిపై తపస్సు చేయుచుండెను. ఇంతవఱకు మీకు శివుని పత్నియైన పార్వతియొక్క చరిత్ర చెప్పితిని. ఇక గంగ యొక్క చరిత్ర చెప్పెదను. నీవును, తమ్ముడును వినుడు.



# ముప్పది యేడవ సర్గము

## కుమారస్వామి జనన చరిత్రము

పూర్వము శంకరుడు ఘోరమైన తపస్సు చేయగా ఋషులు దేవతలు గూడి బ్రహ్మ యొద్దకు బోయి మాకు ఒక సేనాపతి నీయవలసినదిగా కోరుచున్నాము. హిమవంతముపై శివుడు ఉమనుగూడి తపస్సు చేయుచున్నాడు. ఇప్పుడు లోక శ్రేయస్సును గోరి యేమి చేయవలయునో చెప్పుము. మాకు నీవు కాక వేరుదైవమెవరున్నారు? అనగా మీకు పార్వతి యిచ్చిన శాపముతప్పదు. మీకు భార్యలయందు సంతతి గలుగదు. అది యటులుండనిండు. అగ్నిదేవుడొక పుత్రుని గంగయందు పుట్టించును. అతడు సేనాపతియై మిమ్ము కాపాడును. అతనిని గంగయు తన ప్రియపుత్రునిగ గారవించును. పార్వతియు నతని తనపుత్రునిగా నెంచి ప్రేమించును. సందేహపడకుడని బ్రహ్మపలికెను. దేవతలు బ్రహ్మను స్తుతించి వెంటనే వెండికొండకు వెడలి అగ్నిని జూచి ఓ అగ్నిదేవా! విశ్వరక్షణమునందు శ్రద్ధగలవాడా ! నీ యందున్న శివవీర్యమును గంగ యందు విడిచి మహాబలశాలియగు పుత్రుని బడయుము. అని ప్రార్థింపగా పావకుడు గంగను సమీపింపగా ఆమెయు సమ్మతించి సౌందర్యవతియగు స్త్రీ రూపమునుదాల్చి రాగా అగ్ని తన తేజముతో శివరేతస్సు నామె సకలాంగము లందు ప్రవహింపజేసెను. అప్పుడు గంగకాతేజము భరించుట కష్టమయ్యెను. అయ్యో భరింపలేకున్నాను దగ్ధమై పోవుచున్నానని ఆమెవాపోవగా అగ్ని కార్యజ్ఞుడై నీ గర్భమును హిమగిరిపై విడువుమనెను. గంగ యట్లొనర్చెను. ఆ ప్రదేశమంతయు వెండి, బంగారములుగా మారెను. గంగనుండి వెడలిన క్షారములు సోకిన చోటులు రాగి యినుము గా మారెను. మట్టిసోకిన చోటు

సీసము తగరమయ్యెను. అది పారిన చోటులెల్ల అనేక ధాతువులేర్పడెను. గర్భము పడిన చోట రెల్లువనమైనది. అచట లతలు వృక్షములు కూడ బంగారమయ్యెను. అది మొదలుగా అగ్నితో సమానకాంతి గల బంగారు జాతరూపమను పేరుగాంచెను.

## శ్రీ కుమారస్వామి జననము

అందుండి పుట్టిన బిడ్డని జూచి యింద్రుడు ఇతనికి పాలిచ్చి పెంచువా రెవ్వరన కృత్తికలను సుందరాంగులు మనస్సులలో పొంగినవారై ఇతనిని మాకు కుమారునిగ నిచ్చిన పెంచుట కిష్టమనిరి. సందేహమెందులకు? ఈ బిడ్డడు జగత్తునందు కృత్తికానందనుడని, కార్తికేయుడని కీర్తిని పొందునని యింద్రుడు పలుకగా వారు సంతసించి ఆ కుమారునకు స్నానము చేయించి పాలిచ్చి తమ పుత్రునిగా బెంచిరి. గర్భస్రావము వలన జనించుటచే స్కందుడను పేరు జగత్తులలో కలుగునని దేవతలు పలికిరి. స్తనము పాలుగార ఆరుగురు కృత్తికలు తనను సమీపింపగా ఆ బాలుడాఱుమొగములతో ఒక్కమారే పాలుద్రావెను. తన బలముచే అనేక రాక్షసులను సంహరించుటకై దేవతలతనిని సేనానిగా నభిషేకించిరి. దేవనది యొక్క చరిత్రమంతయును సవిస్తరముగా జెప్పితిని. కుమారస్వామి యొక్క చరిత్రను విన్నవారు కడు ధన్యులు. పుణ్యములను బొందుదురు. శుభములు కలుగును. స్కందుని యొక్క భక్తుడు ఇహమునందు సర్వసంపదలు సౌఖ్యములు ననుభవించి చివఱకు స్కందసాయుజ్యము నందును.



# ముప్పది యెనిమిదవ సర్గము

## సగర చక్రవర్తి వృత్తాంత ప్రారంభము

అని చెప్పి మఱియు రామలక్ష్మణులను జూచి కౌశికుడు ఇట్లు చెప్ప దొడంగెను. "పూర్వము మీ అయోధ్యను కీర్తి ప్రతిష్ఠలు గలవాడును పరాక్రమ వంతుడును అగు సగరుడను రాజు పాలించుచుండెను. అతడు తనకు సంతానము లేనందున తనకు పవిత్రుడు సద్గుణ విఖ్యాతుడగు నొక కుమారుడు గలుగునా యని మిగుల చింతించుచుండెను. ఆరాజునకిద్దఱు భార్యలు. వైదర్భుని కుమార్తెయగు కేశిని పెద్దభార్యయు, అరిష్టనేమి పుత్రికయగు సుమతి యను సుందరి. రెండవ భార్యయునైయుండిరి. భార్యలతో గూడి యారాజు ప్రస్రవణ పర్వతమున వర్షశతము తపస్సు చేయగా భృగుమహర్షి వారి తపమునకు మెచ్చి నిండుమనముతో రెండు వరములొసగెను. నీకు చాలామందిపుత్రులు కల్గెదరు. కానీ వంశము నిలబెట్టు ఒక్క పుత్రుడు ఒకతె యుందును, వేరొకతె యందరువది వేల పుత్రులును గలిగెదరని చెప్పగా ఆయనకు నమస్కరించి రాజపత్నులిట్లనిరి. నీ సూక్తిసత్యమగు గాక. మునీశ్వరా మాలోనెవతకు ఒక కుమారుడు ఎవతకు బహుపుత్రులు కలుగుదురో తెల్పుము. అనగా ముని మీ కోరిక ప్రకారము జరుగుననెను. మీలో నెవ్వరికి ఒకపుత్రుడు కావలెనో యెవ్వరికి చాలామంది పుత్రులు కావలెనో చెప్పుడనగా వారిలో పెద్ద భార్యయగు కేశిని తనకు వంశకరుడైన పుత్రుడు కావలెననెను. అంత సుపర్ణుని చెల్లెలైన సుమతి తన కరువదివేలమంది సుతులను కోరెను. అంత మునిని వీడ్కొని రాజు నిజ నగరంబున కేగెను. అంత గొంతకాలమునకు ఆ కాంతలు గర్భవతులైరి.

కేశినికి అసమంజుడను పుత్రుడు పుట్టెను. సుమతికి మాంసపుముద్ద పుట్టెను. అందుండి చిన్నియాకృతులతో అరువదివేల శిశువులు కలిగిరి. దాదులా శిశువులను నేతి కుండల నుంచి నేర్పుతో కాపాడుచుండగా చాల కాలమునకు ఆ యరువది వేలమంది బిడ్డలు పెరిగి యౌవనవంతులైరి. పెద్దభార్య కుమారుడగు అసమంజుడు దుర్మార్గుడై పౌరుల బిడ్డలను సరయూనదీ జలములలో పారవేసి వారు మునిగి తేలుచుండగా గట్టున నుండి చూచుచు ఆనందించుచుండెను. ప్రతిదినమిట్లు పౌరుల బిడ్డలను చంపుచుండుటచే ధర్మనిష్ఠగల సగరుడు తన పుత్రుడగు అసమంజుని పురమునుండి వెడలగొట్టించెను. అతని పుత్రుడగు అంశుమంతుడు సత్యము పలుకు వాడును, సర్వులకు హితుడునై యుండెను. అప్పుడు సగరునకు క్రతువు చేయతలంపు గలిగి చేయనుపక్రమించెను.



# ముప్పది తొమ్మిదవ సర్గము

## సగరుడశ్వమేధము చేయ నింద్రుడు యజ్ఞాశ్వమపహరించుట

హిమవంతమునకు వింధ్యకు నడుమనున్న ప్రదేశము పవిత్రము. అచ్చట యజ్ఞము చేయుట యోగ్యము కావున సగరమహారాజు యజ్ఞమునకు వలయు సామగ్రిని సంగ్రహించెను. అశ్వమేధమును జేయుటకై అశ్వమును వదలి దాని వెంట అంశుమంతుని ససైన్యముగ బంపెను. కాని యజ్ఞము చేయునాటికి మాయజేసి ఇంద్రుడు యజ్ఞాశ్వమును హరించెను. అప్పుడు యజ్ఞము చేయించు ఋత్విజులు సగరునితో నిట్లనిరి. నీ క్రతువును భంగపరచుటకై ఎవరో నీ యజ్ఞాశ్వమును హరించినారు. దీనివలన నీకును మాకును గూడ దోషము సంభవించును. కావున నీ వెట్లైనను అశ్వమును పొంది క్రతువు పూర్తిగావింపుము. వారిట్లు పలుక సగరుడు తన యరువది వేలమంది పుత్రులను జూచి యిట్లనెను.

## సగరకుమారులశ్వము నిమిత్తమై భూమిని త్రవ్వుట

పుత్రులారా! ఋత్విజులు నాచే మంత్రపూతముగా యజ్ఞము చేయించు చుండగా దొంగతనముగా రాక్షసులు అశ్వమును గొనిపోయిరి. ఈ సర్వంసహా చక్రమున ఆ దొంగ దొరకువరకు వెదకుడు. వెనుకకుదిరుగవద్దు. నేనును మనుమడగు అంశుమంతుడును మునులు ఇచ్చట నుందుము. మీరు వెళ్ళి యజ్ఞాశ్వమును వెదకి తెండన వారుత్సాహముతో వెళ్ళిరి. ఒక్కొక్క డొక్కొక్క యోజనము చొప్పున భూమిని గొడ్డళ్ళతోను, శూలములతోను,

వివిధాయుధములతోను త్రవ్వగా భరింపరాని ధ్వని గలిగెను. చచ్చెడు పాముల సమూహముల యొక్కయు, క్రూరజంతువుల యొక్కయు ఆర్తధ్వనులును, చచ్చెడు రాక్షసుల యొక్క మూల్గులును నలు దిశలయందధిక మయ్యెను. ఇట్లరువదివేల మంది యరువదివేల యోజనములు త్రవ్విరి. భూమియంతయు చిందరవంద రయ్యెను.

**దేవతలు బ్రహ్మతో సగరకుమారుల వృత్తాంతము చెప్పుట**

సగరపుత్రులిట్లు సమర్థతతో జంబూద్వీపమును త్రవ్వి యశ్వము కొఱకు వెదక జొచ్చిరి. గంధర్వులు యక్షులు దేవతలు కూడి బ్రహ్మయొద్దకు జని "ఓ దేవా భూమి యంతయు సగర పుత్రులతో త్రవ్వబడినది. యజ్ఞాశ్వము కొఱకై వారు భూమిని మిట్టపల్లములోనర్చిరి. పెద్దలు పిల్లలనక కనబడిన వారికెల్ల వీడే మాక్రతు హయమును దొంగిలించెనని బాధించుచున్నారు. వారు చెలగి భూతాళినెల్ల కలత పెట్టుచున్నారు" అని విన్నవించిరి.



# నలువదియవ సర్గము

**పి**తామహుడు భయకంపితులైన దేవతలను గని "సురవర్యులారా! తొమ్మిది ఖండములు గాగల ఈ భూమిమంతయు వాసుదేవునిది. అందువలన నతడే కపిలరూపముతో తనకోపదృష్టులచే సాగరులను రూపుమాపి వారివలన బాధలను బాపును. ప్రతికల్పము నందు భూమి ఇట్లే త్రవ్వబడుచుండును. దానికై విచారింపకుడు. అల్పాయుష్కులయిన సగరసుతులు నాశము పొందెదరు" అనెను. దేవతలు సంతోషించి తమతమ నెలవులకు బోయిరి. అక్కడ సగరసుతులు భూమినిట్లు చిందర వందర చేసియు అశ్వమును గానక తండ్రిని జేరి భూమి యంతయు త్రవ్వి, దైత్యులను కిన్నరులను భంగపరచి వధించి అశ్వము కొఱకై వెదకి వేసారితిమి. కాని గుఱ్ఱము కనిపింపక మరలి వచ్చితిమనిరి. ఆ మాటలకు సగరుడు కన్నులెఱ్ఱనగాగా పుత్రులారా! మీరశ్వమును తేకుండ ఏల వచ్చితిరి. అశ్వములేకుండ తిరిగి రాకుడు పొండు అని ఆజ్ఞాపింపగా, వారు మరల వెళ్ళి రసాతలమెల్లను ద్రవ్వి అచ్చట విరూపాక్షము అను దిగ్గజమును దాకునట్లుగా వెళ్లిరి. దాని శిరస్సు వణకగా భూమి చలించెను. ఆ ఏనుగును చుట్టుచు తూర్పుదిక్కున నున్న పద్మమను ఏనుగువరకు త్రవ్వుతుపోయిరి. పడమటి కొండవలెనున్న నాగమను ఏనుగును చుట్టి, ఉత్తరదిక్కు నున్నసౌమనసమను ఏనుగును జేరి దాని క్షేమమడిగి అటనుండి తూర్పుదిక్కుగా త్రవ్వుచుబోవుచుండగా అచ్చట వాసుదేవుడు కపిలరూపమున అఖండమైన తపస్సులో నుండుట కన్పించెను. అతని యొద్దనే

యజ్ఞాశ్వము కనిపించెను. అశ్వమును జూచిన సంతోషముతో , కపిలుని మీది కోపముతో సగరపుత్రులు ఓరీ దొంగా నిలునిలు నీకిది తగునా? యజ్ఞాశ్వమును దొంగలించి దొంగమునివై ముక్కు మూసికొని కూర్చున్న నిన్ను నమ్ముదుమా? నీవు సముద్రమునందు దాగినను నిన్ను విడువము. మాయాశ్వమునే బట్టిన నీకింక దిక్కెవ్వరు? అని జంకులేకుండ పల్కిన సగరపుత్రులను గని కపిలమౌని కన్నులు దెరచి హుంకారము గావించుచు అగ్నివలె మండు కనులతో జూడగా వారందరు బూడిదరాసులుగా మారిపోయిరి.



# నలువది యొకటవ సర్గము

**అ**క్కడ సగరుడాత్మలో దిగులు చెందుచు పుత్రులు వెళ్లి చాలా కాలమైనది. అని దుఃఖించి, తన గారాబు మనుమని జూచి "నాయనా! నీవు చిన్నవాడనైనను బుద్ధిమంతుడవు, విద్యావంతుడవు, శౌర్యవంతుడవు, ధీరత్వాది గుణములచే పూర్వరాజన్యులను బోలినవాడవు. నీ పిన్నతండ్రులేమైరో గుఱ్ఱమేమైనదో చూచిరమ్ము. ఆ గుఱ్ఱమును దెచ్చిన నేను క్రతువును పూర్తిచేయుదును. వేగముగా వెళ్ళుము. భూమియందు గల భూతతతులు సత్యసంపన్నములు. వానిని జయించుటకై కత్తిని బాణములను తీసికొని వెళ్ళుము. మ్రొక్క దగువారికెల్ల నమస్కరింపుము. నీకు వ్యతిరేకముగా నున్న మొరటువారిని యుద్ధమున జయింపుము. కార్యము సాధించుకొని రమ్ము" అని ఆదేశించెను.

## అంశుమంతు డశ్వమును వెదుక బోవుట

అంశుమంతుడు ధనుస్సును ఖడ్గమును ధరించి బయలుదేరి, తన పినతండ్రులు త్రవ్విన దారిని బట్టిపోయి అచ్చట మేరుపర్వతమును బోలు దిగ్గజమును జూచి ప్రదక్షిణించి, గుఱ్ఱము గాని, మాపినతండ్రులు గాని ఎటువెళ్లిరో చెప్పుమని వేడగా అది యంశుమంతుని జూచి నీవు అశ్వమును గైకొని సుఖంబుగా తిరిగి పురంబునకు పోగలవని చెప్పగా అచ్చట నుండి బయలుదేరి దిగ్గజముల వరుసను జూచుచు వెళ్లి వానినుచితరీతిని పూజించి మా పినతండ్రుల జాడతెల్పుమననవియు నీవు గుఱ్ఱమును తీసుకొని సుఖముగా వెళ్లగలవు. ఈ దారినే వెళ్లుమనెను. అట్లేపోవగా పోవగా ఒక్కచో తన పినతండ్రిల యొక్క బూడిద పోగులు కనిపించెను. వానిని జూచి అతడు సహింపరాని

దుఃఖమును పొందెను. ఎవరికైనను జనక దుఃఖము సహింపరానిది గదా!

## పితృవ్యులకై దుఃఖించు అంశుమంతుని గరుడు డోదార్చుట

కన్నులు నీరు గారుచుండ, మాట తడబడుచుండ, అచ్చటనే మేతమేయుచున్న యజ్ఞాశ్వమును జూచి అంశుమంతుడు కర్తవ్యమాలోచించి పినతండ్రులకుదక క్రియలు జరుపుటకై నీటికొఱకన్నిచోటుల వెదకెను గాని ఎచ్చటను కనిపించలేదు. ఖిన్నవదనంబుతో దిక్కులు చూచుచుండ దూరమున తనపినతండ్రుల మేనమామయగు గరుడుడు కనిపించెను. ఆ గరుత్మంతుడు ఓ పృధివీవరా ! నీ పినతండ్రుల మరణము లోక సమ్మతము. వారిని గూర్చి విచారింపకుము. మహామహుడైన శ్రీహరి కపిల రూపమును బొంది వీరిచేత తిరస్కరింపబడి కోపించి వీరిని సంహరించి బూడిద చేసెను. ఈ వీరుల గురించి విచారింప దగునా? ఈ శూరులకు నివాపములిచ్చుటకీసారములేని నీరములు తగవు. నీవు వీరి భస్మసముదాయము మీద జగత్పావనియైన ఆకాశగంగను ప్రవహింప జేయుము.

## అంశుమంతుని గరుత్మంతుడు గంగను దెమ్మనట

వీరిభస్మరాశులపై ఆ గంగ ప్రసరించినచో వీరు నరకమునుతరించి స్వర్గ సౌఖ్యములు పొందగలవారు. గాననట్లు చేయుము. సమీపమున దిరుగుచున్న ఈ గుఱ్ఱమును తీసికొనిపోయి తాతయొక్క క్రతువును పూర్తిచేయింపుము. అని చెప్పుచున్న వైనతేయుని వాక్యములను విని అంశుమంతుడు అశ్వంబును వెంట బెట్టుకొని పురంబుచేరి దీక్షలోనున్న తాతకు అశ్వము దొఱికిన విధమును, గరుడుడు చెప్పిమాటలను, తండ్రుల గతియును వివరించెను. అంతయును విని సగరుడు పుత్రులకై వగచి, యధావిధిగా యజ్ఞమును పూర్తిచేసి తనపురమును జేరెను. తరువాత ఆకాశగంగను భూమికే ప్రకారముగా రప్పింపవలెనో తెలియక చింతించుచు ముప్పదివేల సంవత్సరములు రాజ్యముచేసి స్వర్గమును బొందెను.

# నలువది రెండవ సర్గము

సగరుడు దివంబున కేగగా, ప్రజలు ధార్మికుడగు అంశుమంతుని రాజుగా జేసిరి. అతడు మహాబలవంతుడగు దిలీపుని పుత్రునిగా గని సకల రాజ్యమున తనకిచ్చి హిమవత్పర్వతమున కేగి యచ్చట భయంకరమైన నిష్ఠతో గంగాదేవికై తపస్సు చేసెను. అట్లు ముప్పది రెండువేల సంవత్సరములు తపస్సు చేసియు, గంగను భూమికి తేజాలక స్వర్గమున కేగెను. తరువాత దిలీపుడు తాతల యొక్క మృతికి విచారించి ఎట్లు గంగను భూమికి తేవలెను? తాతల బూడిదరాసులెట్లు తడుపవలెను? అనిచింతించుచు పెక్కు యజ్ఞములు చేసి ముప్పదివేల యేండ్లు రాజ్యముచేసి పితరులను దరింపజేయలేనైతినని దుఃఖించి కుమారుడైన భగీరథుని రాజుగా జేసి దివంగతుడయ్యెను. భగీరథుడు రాజర్షియై పితరుల హితము కోరినవాడై తాను సంతతిలేని వాడగుటచే మంత్రులకు రాజ్యమప్పగించి గంగను దెచ్చుటకై గోకర్ణక్షేత్రమునకు వెళ్లి పంచాగ్నుల మధ్యనుండి జితేంద్రియుడై తపస్సు చేసెను.

## భగీరథుడు గంగకై తపంబుచేయుట

ఒక వేయి సంవత్సరములు చేతులను పైకెత్తి వర్షమును గాలిని లెక్కచేయక నెలకొక మారు వన్యములగు కందమూలములను ఆహారముగా గొనుచు గొప్ప తపస్సు చేయగా మెచ్చి, ఋషులు, దేవతలు వెంటరాగా బ్రహ్మ భగీరథుని యెదుట సాక్షాత్కరించి ఇట్లనెను. 'భగీరథా! లెమ్ము! నీకేమి కావలెనో కోరుకొనుము. నీవు నిష్ఠతో చేసిన తపస్సునకు మెచ్చితిని' అనగా భగీరథుడు

లేచి చేతులు జోడించి శిరమువంచి ఓ జగదీశ్వరా! నీవు నాకు ప్రసన్నుడవేని నేను చేసిన తపము ఫలించెనేని సగరుని కుమారులందఱు తరించునట్లు గంగా జలంబులచే తడుపబడు నట్లును వారు స్వర్గమునకు వెళ్లునట్లును, వంశము నిలుచుటకై పుత్రులు గలుగునట్లును వరము దయచేయుమనగా బ్రహ్మదేవుడు "భగీరథా ! అట్లే యగుగాత ! కాని ఆకాశమునుండి గంగ భూమిపై పడగానే పాతాళమునకు జొచ్చుకొనిపోవును. దానిని భరించుటకు శివుండు తప్ప అన్యుడు సమర్థుడు కాడు. కాన శివుని వేడుమని చెప్పి ఆకాశగంగను జూచి "సతీ ఈ రాజుయొక్క కోరికను దీర్పుమని" పల్కి అదృశ్యుడయ్యెను.



# నలువది మూడవ సర్గము

**ఈ** ప్రకారముగా జెప్పి బ్రహ్మ అంతర్ధానము నందగా, భగీరథుడు తన మనస్సునందు హరుని భావించి పాదాంగుష్ఠమును మాత్రము భూమిపై మోపి రాత్రిపవలనక బాహువులు మీదకెత్తి గాలియే ఆహారముగా నిశ్చలుడై నిలిచి ఒక వేయి సంవత్సరములు తపమొనరింపుగా, వృషభవాహనుడు ప్రత్యక్షమై రాజకుమారా! నీ తపమునకు సంతసించితిని. దేవగంగను శిరమున ధరింతును అని పలుకగానే ఆకాశవాహిని గర్వము గొన్నదై నా ఆటోపముచే నీ శివుని గూడ పాతాళమునకు తీసికొని పోయెదనని తలచుచు భయంకర రూపముతో భరింపరానిదై గొప్పవేగముతో ప్రవహించెను.

## గంగ రుద్రజటాజూటమున దిరుగుడు వడుట

అంత నా గంగ గర్వమును దగ్గింపదలచి భవానీ భర్తయైన శివుడు రోషముతో గంగను రూపుమాప దలచెను. రుద్రుని యొక్క జటాజూటమున బడిన గంగ వెలుపలికి రాజాలక చాల సంవత్సరములు దుస్సహమగు వేదనను అనుభవించెను. గంగ శివుని శిరస్సున ప్రవేశించుటయేగాని వెలువడి రాకుండుటను గని భగీరథుడు శివుని గూర్చి గొప్ప తపము చేసెను. నిష్ఠాపూర్వకమైన అతని తపమునకు మెచ్చి శివుడు తన జటలు కొంచెము సడలించి గంగను మానససరోవరము నందు వదలగా అది ఏడుపాయలై ప్రవహించెను. తూర్పుదిక్కుగా హ్లాదిని, పావని, నళిని యను పేర్లతోను, పడమటిదిక్కుగా సుచక్షువు, సీత, సింధువను పేర్లతోను, ప్రవహించెను. మిగిలిన ఏడవపాయ రాజువెంట నంటెను. భగీరథుడు రథమెక్కి ముందు వెడలుచుండగా

ఆకాశగంగ ఆ రథము వెనుకనే బుధులు, దేవతలు నుతించునట్లు వెడలు చుండెను. ఆకాశగంగ స్వచ్ఛమైన కాంతితో ఆకాశమునుండి విశ్వేశ్వరుని జటలలోనికి అటనుండి భూమికి తాబేళ్లు, చేపలు మొదలైన జలచరములతో గూడినదై ప్రవహించెను. అప్పుడు దేవతలు, మునులు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు సంతోషముతో ఆకాశమునందు గుఱ్ఱములు, ఏనుగులు, వృక్షములు, కొండలు, రథములు మొదలగు ప్రదేశములనుండి, మేడలవంటి విమానముల నుండి వింతగా చూచుచుండిరి. ఆకాశమునుండి వచ్చు దేవతలతోను వారి యొక్క భూషణకాంతులతోను నిర్మలమగు ఆకాశము నూర్వురు సూర్యులతో ప్రకాశించినట్లు ప్రకాశించెను. చంచలములగు చేపలు, మొసళ్లు, పాములు మున్నగువానితో ఆకాశము, చంచలములగు మెరుపుతీగలతో నిండి నట్లుండెను. గొప్పవేగముచే నాలుగుదిక్కులకు చెదరిన తెల్లనురుగులతో, తెల్లని రెక్కలుగల శరత్కాల మేఘములతో గూడిన దానివలె ఆకాశము ప్రకాశించెను. ఒక్కొక్కచో ఉద్ధతురాలి వలె వేగముగా పరువెత్తును. ఒక్కొక్కచో సాధ్వివలె గంభీరముగాను, ఒక్కొక్కచో వెలియాలి వలె వక్రమార్గమునను సంచరించును. మిఱ్ఱుచోటుల నర్తకివలె గంతులువేయును. ఒక్కొక్కచో నితంబినివలె మందయానము జూపించును. ముందునకు పారునీటిని వెనుకకు మరలు నీరు దాకి నప్పుడు మధ్యమ సిరివచ్చిన వారివలె మిడిసి పడుచుండును. హరుని శిరము నుండి జారి భూమికి, భూమినుండి మరల జారి ముల్లోకముల వ్యాపించి పాపముల హరించునదై ఆగంగ కీర్తిగాంచెను. దేవర్షులు, దేవతలు, భూతలవాసులును ఈ జలము పవిత్రము. శివుని శిరమునుండి ప్రవహించినది అని దాని యందాచమించి యర్ఘ్యములిచ్చిరి. ఘోరశాపములచే, దివ్యత్వము గోల్పోయిన దేవతలందఱు అందు గ్రుంకి, పాపములు తొలగి, దివ్యత్వము గాంచిరి. భూజనులందు గ్రుంకి తొలగిన శ్రమగలవారైరి. అంత నాభగీరథుని రథము ముందు నడచుచుండ రాక్షసులు, దేవతలు, యక్షులు, కిన్నరులు వెంట నడువగా గంగదాని ననుసరించెను.

**జహ్నుముని గంగా జలంబులు నెల్ల ద్రావుట**

ఇట్లు చనిచని ఆనది జహ్నుండను మహర్షి యొక్క యజ్ఞవాటము మీదుగా ప్రవహించి దానినంతను ముంచి వేసెను. అప్పుడు జహ్నుమహర్షి యాగ్రహించి దాని గర్వమడంప దలచి నిమేషములో ఆ జలప్రవాహమునంతను త్రాగివైచెను. భగీరథుండును దేవతలు మొదలుగా గలవారును మౌనీ ఈ గంగను విడిచి పుచ్చుము. ఇప్పటినుండి ఈమె జహ్నుపుత్రిక యనుపేరు గాంచునని విన్నవించగా సంతుష్టుడై ముని తనచెవుల నుండి గంగను వదలెను. అట్లు వింతగా బయలు వెడలిన ఆ గంగ నాటినుండి జహ్నుని సుత గాన జాహ్నవి యని పేరు గాంచెను.

అంతట ఎట్టి యాటంకము లేక భగీరథుని రథము వెంటజని యానది సముద్రమున బ్రవేశించి పాతాళము దనుక ప్రవేశించి ఆతని కోర్కెదీరునట్లు అతని తాతల బూడిదరాసులపై ప్రసరింపగా వారు కల్మషరహితులై స్వర్గమును జేరిరి.



# నలువది నాలుగవ సర్గము

## భగీరథునకు బ్రహ్మ ప్రత్యక్షమగుట

ఇట్లాకాశగంగను దెచ్చి తాతల యొక్క బూడిదరాసులపై ప్రవహింపజేసి వారిని దివికంపిన భగీరథుని యెదుటికి బ్రహ్మ చనుదెంచి యిట్లనెను. "ఓ రాజా! సగరుని యొక్క పుత్రులరువది వేల మందియు దేవత్వమును బొంది స్వర్గమును జేరిరి. ఈ సముద్రమున నీరెంతవఱకుందునో అంతవఱకును వారు దివ్యులై స్వర్గమున నుందురు. భూమియందు గంగ నీ కూతురను ప్రఖ్యాతిజెంది భాగీరథి యనబడును. దేవనది గంగయనియు, త్రిపథగమనియు, భాగీరథి యనియు, ప్రఖ్యాతినందును. మూడు మార్గములలో ప్రవహించుటచే నీమె త్రిపథగ యనబడును. తాతలకందఱకు ఇచ్చట నీవు ఉదకదానముచేసి నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుము. ధర్మాత్ముడైన నీ ముత్తాత గంగను దెచ్చుటకు సమర్థుడు కాలేదు. నీ తాతయైన అంశుమంతుడు కూడ వృథాశ్రమ పడుటెగాని ప్రతిజ్ఞ నెరవేర్చుకొనలేకపోయెను. తండ్రియగు దిలీపుడు గొప్ప రాజర్షి యయ్యును, దేవర్షులతో సమానుడయ్యును, గంగను నేలపై ప్రాకింపలేకయే దివికేగెను. నీవు చాలా శ్రమించి ప్రతిజ్ఞ నెరవేర్చుకొని కీర్తినందితివి.

ఎల్లప్పుడు స్నానములు చేయుటకుపయోగించు నీ గంగ యందు నీవు స్నానమొనరించి శుచివై నీ తాతలందఱకు ఉదకదానములిచ్చి నీ పురంబునకు వెళ్ళుము. నేనును స్వర్గమునకు వెడలుదును. నీకు మంగళమగు గాక ఇట్లు పలికి విరించి అంతర్ధానమందగా భగీరథుడు గంగలో పితృతర్పణములు చేసి తన నగరమునకు వెళ్లి రాజ్యభారము వహించెను. భూప్రజలందఱు మిక్కిలి

సంతోషించిరి. అతని రాజ్యమునందలి జనులు కష్టములు లేక సుఖసంపదలతో విలసిల్లిరి. కాకుత్థ్సవంశమున జనించిన రామా గంగ యొక్క పుట్టుపూర్వోత్తరములను నీకు జెప్పితిని. నీకు మేలగు గాక. సంధ్యావేళయయ్యెను.

## గంగా మాహాత్మ్య కథనము

ఈ కథ వినినచో విత్తముకోరిన వారికి విత్తమును, కీర్తి కోరినవారికి కీర్తిని, ఆయువును గోరిన వారికి దీర్ఘాయువును, పుత్రులను గోరిన వారికి పుత్రులను, స్వర్గమును గోరినవారికి స్వర్గము నొసంగును. పితృదేవతలు తరించెదరు. దేవతలు తృప్తి పొందుదురు. బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులలో నెవ్వరైనను శ్రద్ధతో వినెడువారును వినిపించువారును సర్వపాపములు తొలగి కోరిన కోరికలను బొంది ఆయువు, కీర్తి పొందుదురు.



# నలువది యైదవ సర్గము

**అ**ని చెప్పిన విశ్వామిత్రుని వాక్యములను విన్న రామలక్ష్మణులు గొప్ప సంతోషమును బొందిన వారై మృదువచనములతో "మునీంద్రా! నీవు చెప్పు కథలను వినుచుండ ఆశ్చర్యము కలుగుచున్న" దనిరి. ఆ రాత్రి రాముడు తమ్మునితో గూడ ముని చెప్పిన కథలనే మనసులో తలచుచు మెచ్చుకొనుచు గడపెను. తూర్పుదిక్కున సూర్యుడుదయింపగా లేచి ప్రాతర్విధులన్నియు భక్తితో ముగించి మునింగని భక్తితో నమస్కరించి "మునిచంద్రా ! నీవు చెప్పిన కథలు తలచుకొనుచుండ రాత్రి ఒకనిమిషము వలె గడచిపోయినది. నీ విచ్చట నుండుట తెలిసి యిక్కడి మునీశ్వరులు ఒక యోడను పంపిరి. తొందరగా మనమీ జాహ్నవీ నదిని దాటుదము" అని పల్కగా విని ముని రాజకుమారుల తోను, మునులతోను గంగను దాటి ఆవలి తీరమున దిగెను. అచ్చట ఎత్తైన సౌధములతోను, ఫలపుష్పభరితములగు తరువులతోను అందమై స్వర్గమును మించుచున్న విశాలాపురంబును జూచిరి.

## శ్రీరాముడు విశ్వామిత్రుని విశాలానగర వృత్తాంతమడుగుట

ఆ పట్టణమున బ్రవేశింపగనే రాజకుమారులా మునిని ఓ మహాత్మా! ఈ పట్టణమునేలు రాజెవ్వరు? వాని వంశమేది? యని ప్రశ్నింపగా ప్రేమతో ముని రామలక్ష్మణులను జూచి, ఆకథను వినుము రామాయని యిట్లు చెప్పదొడగెను. పూర్వము కృతయుగమున మహావీరులైన రాక్షసులను మహాశూరులును, ధర్మాత్ములునగు దేవతలను గలిసి మనము చావులేని వారమై

వార్ధక్యములేని వారమై యుండుటకేమి చేయవలెననోయని భావించి పాలసముద్రమును చిలికిన రసముదయించునని యెంచిరి. వారు కవ్వముగా మందరపర్వతమును, వాసుకియను సర్పమును కవ్వపు త్రాడుగా నేర్పరచి, పాలసముద్రమును మథించుచుండగా ఒక వేయిసంవత్సరములు గడచెను. కవ్వపు త్రాడుగా నున్న వాసుకి బాధనోర్వజాలక ఉగ్రమగు విషమును కక్కెను. అది వృక్షములను, పర్వతమును భస్మముచేయుచుండగా దేవతలమితమైన భక్తితో పార్వతీపతిని వేడగా శివుడు వారి యెదుట సాక్షాత్కరించెను. అప్పుడే శంఖు చక్రధారియగు విష్ణువు వచ్చి శివుని గాంచి నీవు దేవతలలో పెద్దవాడవు దేవతలు తరచెడు సముద్రము నుండి హాలాహలము పుట్టినది. నీవు దీనిని అగ్రపూజగా గైకొనుము అని చిరునవ్వుతో పలికెను.

**శివుడు హాలాహలమును మ్రింగుట**

ఇట్లు చెప్పి హరి వెడలెను. దేవతల భయమును చూచి, విష్ణువు మాట ననుసరించి శివుడుగ్రమైన యా విషమును కంఠస్థము చేసికొనెను. ఇట్లు విషము మ్రింగి నీలకంఠుడేగగా దేవతలు, రాక్షసులు మరింత పట్టుదలతో మథించుచుండగా కవ్వముగా నుంచిన పర్వతము పాలసముద్రములో మునిగి పోజెచ్చెను. అంత దేవతలు పుండరీకాక్షుని స్మరించి "దేవా! మాకు నీవే దిక్కు. కాపాడుము. మునిగిన కొండను పైకి తీసికొనిరమ్ము. నిన్నుశరణు పొందిన వారలు బాధలుపడుట చూచుచు నూరకుండుట తగునా? యని ప్రార్థింపగా వారియందు దయగలవాడై శ్రీహరి కూర్మమై తనవీపుపై కొండకు మోసెను. సురలు మరల మథింపసాగిరి. ఇట్లు వేయిసంవత్సరములు మథింపగా

**క్షీరసముద్రమున ధన్వంతరిలో నగువారుదయించుట**

సముద్రమునుండి మొదట దండకమండలములు ధరించి ధన్వంతరి దేవతలకు కనిపించెను. తరువాత మథింపబడుచున్న సముద్రమునుండి

జనించిన రసము నుండి సొగసుగలిగిన అప్సరసలు అరువది కోట్లమంది యుండిరి. వారి పరిచారకల సంఖ్య ఎంతయో చెప్పనలవికాదు. వారిని దేవతలను రాక్షసులను గ్రహింపరైరి. ఎవరును గ్రహింపకుండుటచే వారు సామాన్యలైన వేశ్యలైరి. తరువాత వరుణిని కూతురు వారుణి యనునది సుర అనుపేరుతో జన్మింపగా దానిని రాక్షసులు ముట్టుకొనకున్న దేవతలు గ్రహించిరి. సురను గ్రహింపక పోవుటచే దితిపుత్రులు అసురులైరి. సురను పుచ్చుకొనిన దేవతలు సురలైరి. తరువాత నుచ్చై శ్రవమను గుఱ్ఱము పుట్టెను. తరువాత కౌస్తుభమనెడు రత్నము జనించెను. తరువాత ఉత్తమమైన యమృతము లభించెను. అది వారి వంశమునే నాశమొనర్చెను. అది యెట్టులనగా ఆ యమృతమునకై రాక్షసులు వేల్పులతో దలపడి గొప్పయుద్ధము చేయగా రెండుపక్షములలోను చాలామంది నశించిరి. ఎందఱు నశించిరో లెక్కపెట్టు నలవి కాకుండెను. అప్పుడు విష్ణువు దేవతల పక్షము వహించి ఆ యమృతము నపహరించెను. తాను మోహినియై దేవతలకమృతము నిచ్చెను. రాక్షసులను వధించెను. ఇంద్రుడు ఘోరయుద్ధమున రాక్షసులను వధించి, దేవతలు, ఋషులు సంతోషము పొందునట్లుగా తన రాజ్యమును తిరిగి పొంది పాలించెను.



# నలువది యాఱవ సర్గము

## దితి ఇంద్రుని జంపు కుమారునికై వ్రతమనుష్ఠించుట

దితి తనకొడుకులు చంపబడుట చూచి ఖిన్నవదనంబుతో అపరిమితమైన దుఃఖముతో తనభర్త కశ్యపుని సమీపించెను. కన్నుల బాష్పకణములురాలు చుండగా "నాథా! నీ కుమారులే నా కడుపున చిచ్చుపెట్టిరి. ఎట్లు సహింప గలదానను. నా పగదీర్పగల సుతుడు కలుగ కున్న నేనెట్లు భరించగలను. ఇంద్రుని చంపగల కుమారుడు పుట్టిన చో నాపగతీరును. కాన నాకు అట్టిపుత్రుని ఇమ్మని ప్రార్థించుచున్నాను. తపస్సుచేసెదను". అని పల్కగా అమితమైన దుఃఖముతోనున్న దితిని జూచి కశ్యపుడిట్లనెను. "ఓ సుందరాంగీ ! అట్లే యగు గాక. నీవు నిండుగా ఒక వేయేండ్లు అఖండమైన తపస్సును నేను చెప్పిన రీతిగా జేసెదవేని ఇంద్రుని జంపగల పరాక్రమవంతుని, త్రిలోకములను రాజుకాగల పుత్రుని గనెదవని ఆమె యొక్క కడుపును తనచేతితో నిమిరి, నీకు శుభమగు గాక" యని పలికి వనమునకు వెడలెను. అప్పుడు దితి కుశప్లవమున దీర్ఘమైన తపస్సు చేయుచుండెను. ఇంద్రుడామెకు బరిచర్యలు సలుపుచుండెను. నీతితప్పక పవిత్రుడై గురుభక్తితో ఆతల్లికి సేవచేయుచుండెను. సమయము తప్పక మంచిఫలములు, దర్భలు, సమిధలు మొదలగు కావలసిన సమస్త వస్తువులను దెచ్చి ఇచ్చుచు శ్రమచెందియున్నప్పుడు వీవనతో విసరుచు నింద్రుడు సేవించుచుండెను. బడలిక జెంది యున్నప్పుడు కాళ్లు పిసుకుచుండెను. ఆమె యేమి చెప్పినను వెంటనే తెచ్చి యిచ్చుచుండెను. ఈ ప్రకారముగా నుపచారములు చేయుచుండగ పదియేండ్లు తక్కువగ నొక వేయిసంవత్సరములు

గడచెను. సంప్రీతయై దితి ఇంద్రునితో నిట్లనెను. “నీ తండ్రిని ఒక పుత్రునిమ్మని వేడగా వేయేండ్లు నిష్ఠతో నీ తపము చేయగా కల్గుననెను. మూడులోకములను నిన్నును జయింపగల గర్భము నాకు కలిగినది. ఈ నిష్ఠపూర్తియైన వెంటనే నీ తమ్ముని జూడగలవు. భయపడుకుము. నీ కొఱకు వేయివిధములుగ నైనను జెప్పి నీకే కొరతయు గల్గకుండ వానికి నచ్చజెప్పెదను. మీరిద్దఱు నొకటియై జగములను గాపాడుడు. నీకు శుభము కలుగును. అని చెప్పుచు దితి మిట్టమధ్యాహ్నపు టెండకు ముమ్మరముగా నిద్ర ముంచుకొని రాగా శరీరమును మరచి పాదములవైపు తలనుంచి, జుట్టు వెంద్రుకలు విడివడి జారుచుండగా, తలవైపు పాదములుంచి శయనించెను.

**ఇంద్రుడు దితి గర్భమున నున్న పిండమును ఖండించుట**

అది చూచి ఇంద్రుడు నవ్వి సంతోషముతో ఆమె గర్భమున బ్రవేశించి వజ్రాయుధముతో గర్భము నేడుముక్కలుగా త్రుంచెను. ఖండింపబడిన పిండములు విడువక యేడ్చుచుండగా మారుద (ఏడ్వవలదు) అని ఇంద్రుడు నరకుచుండగా, ఆ దితి మేల్కొంచి చంపకు చంపకు మని పలుకగా తల్లిమాటల యందలి గౌరవముచే చంపక మాని వజ్రాయుధమును చేతబూని వచ్చి ఇంద్రుడు దితి పాదములపైబడి ఇట్లు చెప్పెను. తల్లీ ! నేను చేసినది అపరాధమే. క్షమింపదగిన వాడను. క్షమింపుము. నీవు పాదములవైపు శిరముంచి నిద్రను పొందుటచే అశుచివైతివి. ఆసమయమును జూచి లోకము నలజడి పెట్టునట్టి ఆ పాకశాసనవిరోధిని ఏడుముక్కలుగా నరకితిని సుమా” అనెను.



# నలువది యేడవ సర్గము

## సప్తమరుత్తుల యుత్పత్తి

ఈ ప్రకారముగా తన గర్భము విచ్ఛిత్తిగనుటకు జాల శోకించి మిక్కిలి బలవంతుడైన ఇంద్రుని జూచి అనునయ వాక్యములతో నిట్లనెను. నాయనా! నీ వలన దోషము లేదు. దోషమంతయును నాయదియే. అందువలననే నీవు నాగర్భము నేడు ముక్కలు చేయగల్గితివి. దానివలన దోషము లేదు. నా కిక విచారము లేదు. ఏడుగురు భూమినేలునట్లు చేయుము. నా కొడుకులు ఏడ్వురును దివ్యమైన శరీరములు దాల్చి నీవు పిలిచినట్లుగా మారుతులు అనుపేరుతో పిలువబడుదురు. వారాకాశమునందు వాయురూపులై సంచరింతురు. ఒకడు బ్రహ్మలోకమును, ఒకడింద్రలోకమును, ఒకడు వాయుమార్గమున జరించెదరు. ఉన్న నలువురు నాల్గుదిక్కులను నీయాజ్ఞ ప్రకారము దిరుగుచుందురు. సందేహింపక ఇట్లు చేయుమనుచున్న తల్లిని జూచి "అమ్మా నీ వాక్యములు సత్యములగును. మనమున సందేహము వదలుము" అని యింద్రుడూరడించెను. ఇట్లు తల్లియు కొడుకగు నింద్రుడును సమాధానపడ్డవారై తృప్తితో దివంబునకు జనిరి. ఇది మేముపూర్వము వినియున్నారము.

## విశ్వామిత్రుడు విశాలా వృత్తాంతమును రామునకు జెప్పుట

రామచంద్రా! ఈ దేశము పూర్వమింద్రుడు దితికి సేవచేసిన ప్రదేశము.

పునీతుడైన యిక్ష్వాకుడు అలంబుసయందు విశాలుడను కుమారుని గనెను. అతడు తన పేరు మీదనే ఈ విశాలానగరమును కట్టించెను. విశాలుని కుమారుడు హేమచంద్రుడు. మహాబలశాలియగు సుచంద్రుడను పుత్రుడు గలిగెను.

అతని పుత్రుడు ధూమ్రాశ్వుడు. అతని తనయుడు సృంజనుడు. అతని తనయుడు సహదేవుడను రాజు. అతని కులవర్ధనుడైన కుశాశ్వుడు పుట్టెను. అతని సుతుడు సోమదత్తుడు. ఇతనికి కాకుత్సుడను రాజుదయించెను. అతని కుమారుడే ఇప్పుడీదేశమునకు రాజుగానున్న సుమతియనురాజు, ఇక్ష్వాకుని దయతో నీ వంశమునందలి రాజులు పరాక్రమవంతులు, పవిత్రమైన మనస్సులు గలవారు, దీర్ఘాయువులును. మనమీరాత్రి (13వ నాటి రాత్రి) రామా! ఇచ్చట సుఖముగా నుండి ఉదయమే జనకుని దర్శింతము. అని చెప్పుచున్న సమయమున, విశాలాధిపుడైన సుమతి విశ్వామిత్రుని రాకను దెలిసికొని ఎదురువచ్చి మునిని జూచి నమస్కరించి, “మునీంద్రా! ధన్యుడను, నీవు వచ్చుటచే మా దేశము పవిత్రమైనది. నిన్ను జూడగలుగుట సామాన్యవిషయము కాదు. నిన్నుచూచుటచే నేను ధన్యుడనైతిని. నాకంటె ధన్యులులేరు” అని పల్కెను.



# నలువది యెనిమిదవ సర్గము

## సుమతి విశ్వామిత్రుల సంభాషణము

సుమతి విశ్వామిత్రులు పరస్పరము కుశలప్రశ్నలు చేసికొనిన తరువాత సుమతి గాధినందనునితో నిట్లనెను. “వీరలెవ్వరు? ఏనుగుల వంటి, సింహముల వంటి గమనము గలవారు, వీరులు, పెద్దపులి, వృషభముల వంటి బలము గలవారు, పద్మములవంటి కనులుగలవారు, సరసమైన బుద్ధిగలవారు, బాణతూణీరములను ఖడ్గములను దాల్చినవారు. అశ్వినీదేవతల వంటి సుందరదేహము గలవారు, నిండారిన మొలకవయసువారు, దివినుండి స్వేచ్ఛతో భూమికి దిగివచ్చిన దేవతలవలె నున్నవారు, ఆకారచేష్టలచే ఒక్కమాదిరిగ నున్నవారు వీరిని గూర్చి చెప్పుమా మునీంద్రా? వీరు నీ వెంట ఎందులకు వచ్చియున్నారు. మనుష్యులెన్నడు సంచరించని ఈ ఘోరాటవిలో పాదచారులై యాయుధములు ధరియించి ఎందులకు సంచరించుచున్నారు. మునీంద్రా ! ఆకాశమును చంద్రసూర్యులువలె ఈ ప్రదేశమును వెలుగజేయుచున్న ఈ యవక్రవిక్రములెవ్వరు? ఎవరిపుత్రులు?” అను రాజుమాటలను విని ముని వారు సిద్ధాశ్రమమునకు వచ్చుట, అచట రాక్షసులను సంహరించుట, మొదలగు విషయముల నన్నిటిని విశదముగ జెప్పెను. విశ్వామిత్రుని మాటలను విని రాజు సంతోషముతో దశరథరాజ పుత్రులైన రామలక్ష్మలకతిథి పూజలుచేసి సత్కరించెను. ఆసత్కారములను గ్రహించి ఆరాత్రి అచ్చటనున్నవారై (14వ నాటి రాత్రి) వేకువనే లేచి మునులబృందముతో గూడ ప్రయాణమై వారు మిథిలానగరమును సమీపించిరి. మునులు దూరమునుండి దాని సొంపు జూచి

మేలుమేలని మెచ్చుచుండ ఆపురి సమీపమున నా(శమమువలె నున్నయొక ప్రదేశమును జూచిరి.

## గౌతమాశ్రమ వృత్తాంతము

అంత రాముడు విశ్వామిత్రునితో "మునీంద్రా! ఈ ఆశ్రమమెవరిది? జనసంచారము లేకయున్నదేమి? అందముగా నున్న ఈ ఆశ్రమమున నెవ్వరును లేకుండుటకు గారణమేమి?" అని యడుగ విశ్వామిత్రుడు "బాగు బాగు ఈవనమిట్లగుటకు గారణము చెప్పెదను వినుము రాఘవా! బ్రహ్మయంతటి మహానుభావుడగు గౌతమమహర్షి పూర్వమిచ్చట అహల్యయను తనపత్నితో గలసి చాల సంవత్సరములు తపస్సు చేయుచుండెను. ఈ సమయమున నొక్కనాడు సమయము చూచి ఇంద్రుడు గౌతముని వంటి రూపముతో వచ్చి యహల్యను జూచి 'ఓ అంగనా! మన్మథప్రేరితులైన వారు ఋతుకాలము వఱకు ప్రతీక్షింపజాలరు. కావున నీతో రమింపవలెనను కోరికతో వచ్చితిని. నా కోర్కె దీర్పుమని యనేకవిధముల వేడుకొనగా మునివేషముతో వచ్చినవారు ఇంద్రుడని తెలిసియు అతని యందభిలాషచే దుర్మతియై అతనితో సంగమించెను. మఱియు "ఓ మానదా ! శచీకాంతుడా! నీతో రమించుటచే నా మనస్సు చాల సంతోషమును బొందుచున్నది. ఇక చాలసేపు ఇచ్చట నుండకుము. నన్నును రక్షింపుము. త్వరగా వెళ్లుము." అని పల్కగా సురేంద్రుడు నవ్వుచు సంతోషముతో నీవు భయపడకుము. నేను ఇప్పుడే వెడలిపోయెదను అనుచు గౌతముడు వచ్చునేమోయను శంకతో గబగబ ఆశ్రమము వీడి వెలుపలికి వచ్చినంతనే, ఎదుట గౌతముడు, ఒక చేత దర్భలును, రెండవచేత సమిధలను ధరించి స్నానముచేసి తడివస్త్రములను ధరించి అగ్నిహోత్రమువలె వెలిగిపోవుచు వచ్చుట చూచి, కంపించుచు, వెలవెలపోవుచున్న ముఖము గలవాడయ్యెను. తన రూపముతో వచ్చిన ఇంద్రుడని తెలిసి రూపము దాల్చిన కోపమో యనునట్లు మండి పడుచు నా ఋషి నిట్లనెను.

## గౌతముడింద్రుని అహల్యను శపించుట

"నా వంటి రూపము దాల్చి చేయదగని పని చేసితివి గాన నీ బీజముల తెగినేల బడును గాక" యని శపించెను. అట్లు శపించిన వెంటనే ఇంద్రుని యొక్క వృషణములు తెగి నేలపైబడెను. మహారోషముతో గౌతముడు తన భార్యయైన యహల్యను జూచి, పండ్లు పటపట గొరుకుచు ముక్కుపుటము లదరుచుండ 'ఓసీ! నీవు చాలా యేండ్లు గాలియే యాహారముగా, శరీరము తపించుచుండగా ఎవ్వరికి గనబడకుండ నిక్కడనే పెద్దబూడిదలో పడియుందువు గాక' అని శపించి హీనమైన నడవడి గలదానా ! ఏనాడు దశరథుని కుమారుడైన రామచంద్రుడీయాశ్రమములోనికి వచ్చునో ఆనాడు నీవు పవిత్రవై నీ పాపములు పోగొట్టు కొందువు. అప్పుడారామునకు అర్ఘ్యమగు పరిచర్యలనజేసి పూర్వపు లోభమోహములు తొలగిన దానవై నిజరూపమును బొంది నాయొద్దకు వచ్చెదవని పలికి ఈ యాశ్రమమును వీడి హిమవత్పర్వతమునకు వెడలెను.



# నలువది తొమ్మిదవ సర్గము

**ఈ** రీతిగా ముష్కవిహీనుడైన ఇంద్రుడు అగ్ని, బృహస్పతి మొదలగు దేవతలను సమీపించి చిన్నబోయిన మొగముతో వారిని జూచి "గౌతముడు ఘోరమగు తపము చేయుచుండగా ఆ తపస్సును జెరచి అతని క్రోధమధికమగు నట్లు చేసి తపోభంగ మొనరించితిని. అతడు కోపించి నన్ను బీజములు లేకుండునట్లు శపించెను. భార్యయైన యహల్యను తిట్టి రోషముతో విడచి పెట్టెను. అతడు మమ్మిట్లు శపించుటచే నతని తపము నశించెను. దేవకార్యము నిర్వహించుచు నిట్టి నష్టము పొందితిని. మీరు నన్ను మరల సఫలుని జేయు" డనెను. ఇంద్రుడిట్లు పల్కగా విని అగ్ని ప్రముఖులగు దేవతలందఱు పితృదేవతలను జూచి "ఓ పితృదేవతలారా ! మీరు అండవిహీనుడగు నింద్రుని మేషాండములతో బీజయుతుని చేయుడు. బీజములులేని మేకయై నీకు తనివిని చేకూర్చుగాక! మీ కట్టిమేకను బలియిచ్చినను యజ్ఞఫలమునకు హానిరాదు"అని చెప్పగా దేవతల మాటలు విన్న పితృదేవతలు మేక వృషణములను దీసి యింద్రునకు తగిలించిరి. అప్పటినుండియు నింద్రుడు గౌతముని తపోమహిమచే వృషణములు గోల్పోయి మేషవృషణుడాయెను. ఆ నాటినుండి పితృదేవతలు బీజములులేని మేకమాంసమును భుజింపుచు యజ్ఞకర్తకు యజ్ఞఫలమునిచ్చుట కంగీకరించిరి. కావున రామా నీవీ ఆశ్రమములో బ్రవేశించి అహల్యను తరింపజేయుము. అని చెప్పగా మౌని వాక్యములను విని లక్ష్మణునితో గూడి రాముడు విశ్వామిత్రుని ననుసరించి యా యాశ్రమమునందు బ్రవేశించెను.

## అహల్యా శాపమోక్షణము

అందు మంచి మనస్సుగలదియును, బహుకాల తపస్సుచే తేరి చూడరాని తేజస్సు కలదియును, బ్రహ్మచే మహాశ్రద్ధతో సురూపగా సృష్టింపబడినదియును, మబ్బునందు దాగిన నిండుచంద్రుని వలెనున్నదియును, నీటియందు ప్రతిబింబించిన యెండవలె తేరిచూడరాకున్నదియు నగు అహల్యను గాంచెను. శ్రీరామచంద్రుడాశ్రమ ప్రదేశమును చేరజనగా, శాపము యొక్క తాపముతొలగి అహల్య తన పూర్వరూపముతో మరల భువనములకు గన్పింపగా, రామలక్ష్మణులామెకు నమస్కరించిరి. ఆమెయు గౌతముని యొక్క మాటలను దలచి వీరలు పవిత్రులయిన వారని భావించి వారికి అర్ఘ్యపాద్యములిచ్చిన రాముడందుకొనెను. ఆ సమయమున పువ్వులవాన కురిసెను. దేవతలు దుందుభులను మ్రోగించుచు మేలుమేలని పొగడిరి. ఘోరమగు తపస్సు చేసి పరిశుద్ధిని పొందిన యహల్యను గౌతమమహర్షి స్వీకరించి రాముని పూజించెను. ఆ ముని పూజలందుకొని రాముడు, తమ్మునితోను, మౌనితోను ఈశాన్యదిక్కుగా పోవదొడంగెను.



# ఏబదియవ సర్గము

**జ**నక మహారాజు యొక్క యజ్ఞశాలకు వెళ్లి యజ్ఞమును జూచి రాముడు మునితో నిట్లనెను. "ఇచ్చట యజ్ఞసామగ్రి చాల బాగుగనున్నది. అనేక దేశములనుండి వచ్చిన బ్రాహ్మణులు, వేదాధ్యయనతత్పరులు వేలకువేలున్నారు. ఋషుల యొక్క పర్ణశాలలును వందలకొలది శకటముల సందడికలిగి యున్నవి. ఇక్కడ మనమెందు నిలువవలెను" అనగా విశ్వామిత్రుడు జనుల సందడిలేని చోటును, జలము సమృద్ధిగా నున్నచోటును జూపెట్టెను. మునివర్యుడగు విశ్వామిత్రుడక్కడకు వచ్చుటవిన్న జనకుడు భక్తితో తన పురోహితుడైన శతానందునితో అచ్చటికి వచ్చెను.

## శ్రీరామాదులు మిథిలకు బోవుట

ఇట్లువచ్చి ఆ మునీంద్రునకు నమస్కరించి సేవించుచుండగా నింతలో ఋత్విజులు వచ్చి విధిపూర్వకముగా విశ్వామిత్రునకర్ఘ్య పాద్యములనిచ్చిరి. వానిని స్వీకరించి జనకుని క్షేమమును సప్తతంతు నిర్వహణమును గురించి ప్రశ్నించి, విశ్వామిత్రుడు మునులనెల్ల గారవించెను. మునులతో మాటలాడు చున్న మౌనితో జనకుడు 'మునీంద్రా! నీవు మునులతోడంగూడి ఈ ఆసనంబుల నధివసింపు' మన కూర్చుండి నీవును గూర్చొను మనగా జనకుడు తన మంత్రి పురోహితులతో ఆసీనుడై గాధి నందనునితో నిట్లనెను. "మునీంద్రా నీవు వచ్చుటచే నేనుచేయు యజ్ఞమున పుణ్యఫలమును పొందగలిగితిని. దేవతలు

సంతోషింతురు. నేను ధన్యుడనైతిని. నా పుట్టువు సార్థకమైనది. ఇంక పన్నెండు రోజులు యజ్ఞము పూర్తియగుటకు కొఱతయున్నది. అప్పుడు దేవతలు హవిర్భాగములకు వచ్చెదరు. నీ వంతవఱకుండి దర్శింపదగును" అని పలికి మరియు నిట్లడిగెను. ఈ పరాక్రమవంతులు, మదగజములవంటి, సింహము వంటి నడక గలవారు, తామరరేకుల వంటి కనులు గలవారు, ఖడ్గములు, తూణీరములు, శరచాపములు ధరించినవారు తొలకరించుచున్న లేబ్రాయము వారు స్వేచ్ఛగా దివి నుండి భువికి దిగి వచ్చిన దేవతలవలె నున్నవారు, వయోరూపగుణములచే ఒక్క పోలిక నున్నవారు అగు వీరిద్దరెవ్వరో నాకు దయతో జెప్పుము". అని వేడగా మౌని రాజా వీరు దశరథ మహారాజు యొక్క కుమారులు. గొప్ప పరాక్రమము గలవారు. నాయజ్ఞమును సంరక్షించిరి. తాటక, మారీచుడు, సుబాహుడు మొదలగు రాక్షసులను చంపిరి. విశాలాపురమును దర్శించిరి. అహల్యను శాపముతొలగి పూర్వరూపమునందు నట్లు చేసిరి. గౌతముని సందర్శించిరి. నీ యొద్దనున్న శివధనుస్సును దర్శించుటకై వచ్చియున్నారు.



# ఏబది యొకటవ సర్గము

**ఆ** ప్రకారముగా విశ్వామిత్రుడు చెప్పగా, గౌతముని పుత్రుడైన శతానందుడు విన్నవాడై శరీరము పులకరించుచుండగా రాముని దర్శనమున కాశ్చర్యము నందుచు విశ్వామిత్రునితో నిట్లనెను. "మునీంద్రా! తపస్విని యైన నాతల్లి యహల్యను రామునకు జూపితివా? నాతల్లి రాముని వన్యోపహారములచే నర్చించెనా? చెడుదినముల చేత నాతల్లిచేసిన దుష్టమైన పనిని జెప్పితివా? మహానుభావుడైన రాముని దర్శనము వలన పవిత్రయై నాతల్లి ఆదరమున నాతండ్రిని జేరెనా? నాజనకుడైన గౌతముడు మహాత్ముడగు నీ రాముని బూజించెనా? తన యాశ్రమమునకు వచ్చిన ఈ పవిత్రునిచే బ్రహ్మవిదుడగు నాతండ్రి పూజలనందుకొనెనా? నాతల్లిని మాతండ్రి మరల స్వీకరించెనా? అని యిట్లు శతానందుడడుగ, విశ్వామిత్రుడు 'సమయము మించకుండ కర్తవ్యమును జేసితిని'. రేణుక పతిని జేరినట్లుగా నీ తల్లి గౌతముని జేరెను. అని చెప్పెను. ఆ మాటలు విని మనసునందు చాలాసంతోషము పొందినవాడై దశరథుని పుత్రుడైన రాముని జూచి గౌతమనందనుడైన శతానందుడు ఓ రామచంద్రా నీకు స్వాగతము. మాయదృష్టము పండి ఈదేశమునకు వచ్చితివి. రామా! నీకు తెలియునా? గొప్పతేజము గల గాధి పుత్రుడైన విశ్వామిత్రుడు చెప్పనలవికాని యంతటి తపశ్శాలి. బ్రహ్మర్షి పదమును గొన్నవాడు. నీకు శుభములు గూర్చువాడు. అసామాన్యుడు. మాన్యుడునగు నీ విశ్వామిత్రుడు నీకు రక్షకుడగుటచే నీవు ధన్యుడవైతివి. ఈ విశ్వామిత్రుని మహిమను సమస్తము ఉన్నది యున్నట్లుగా నీకు జెప్పెదను వినుము. అతని బలము, గుణములు, చరితలు వివరించెను.

## శ్రీరామునకు శతానందుడు విశ్వామిత్ర చరిత్ర చెప్పుట

ధర్మశీలుడైన ఈ విశ్వామిత్రుడు రాజై ఎంతయోకాలము రాజ్యపాలనము చేసెను. సకలవిద్యలను నేర్చినవాడు. జనుల సంతోషపడునట్లు పరిపాలనము చేసి ధర్మజ్ఞుడని కీర్తి బడసినవాడు. అజునియొక్క పుత్రుడు కుశుడు. అతడు కుశనాభుని గనెను. అతనితనయుడు గాధి. ఆ గాధియొక్క పుత్రుడే ఈ కౌశిక బ్రహ్మర్షి. పెక్కువేల సంవత్సరములీ భూమిని బాలించుచుండి యొకనాడు సైన్యసమేతుడై నగరములు, ఆశ్రమములు, పట్టణములు, ఏఱులు, పర్వతములు సంచరించుచు ఒకానొక సమయమున వశిష్ఠాశ్రమమును గాంచెను. అది నానావిధవృక్షములతోను, అనేక మృగీ మృగపక్షులతోను, సమాకీర్ణమై, రాక్షసులు దేవతలు గలదియై, సాధువులగు లేళ్లగుంపులతో మనోహరమై యొప్పుచుండెను. అగ్నిసమతేజస్వులగు మహాత్ముల చేతను, తపస్సుచేత ధన్యులయిన వారిచేతను, దివ్యమైన తేజస్సుగల దేవర్షులచేతను, బ్రహ్మర్షులచేతను, ప్రకాశింపజేయబడు చుండెను. నీరము మాత్రమే త్రాగి తపమొనర్చువారును, గాలియే యాహారముగ గలవారును, చెట్లఆకులే ఆహారముగా గలవారును, ఫలములు మాత్రమే ఆహారముగ గొనువారునునై క్రోధమును వీడి ఇంద్రియనిగ్రహము గల్గియున్న ఋషులు, జపపరాయణులైన వైఖానసులు, వాలఖిల్యులు మఱి యనేక విధముల మునిసమూహములు గలిగి బ్రహ్మలోకమునకు సమానమై యుండెను.



# ఏబది రెండవ సర్గము

## విశ్వామిత్రుడు వసిష్టునాశ్రమమునకు బోవుట

ఇట్టి వసిష్ఠాశ్రమము ప్రవేశించి వినయ విధేయతలతో తపశ్శీలుడైన వసిష్ఠుని గాంచి నమస్కారము చేసిన ఆ మునిచంద్రుడు, ఓ రాజా! సుఖమా యని యుచితమైన ఆసనము నిచ్చిన రాజు అందుపవిష్ఠుడయ్యెను. యథాశాస్త్రముగ మధువును, ఫలములను వసిష్ఠుడీయగా విశ్వామిత్రుడానందముతో ఆరగించెను. అంత వసిష్ఠుని గని "ముని చంద్రమా! కుశలమా? మీ యగ్ని హెూత్రములకును మీ శిష్యులకును భద్రమా? మీ తపస్సులు నిర్విఘ్నముగా సాగుచున్నావా? ఫలమూలాదులు సమృద్ధిగా దొరకుచున్నవా? అని రాజడుగగా వసిష్ఠుడిట్లనెను. రాజేంద్రా మేమందఱము క్షేమమే. నీవు క్షేమమే గదా? నీ సేవకులు, బంధువులు, హితులును క్షేమమే కదా? ధర్మము తప్పక రాజ్యము చేయుచున్నావా? నీభృత్యులు నీవు చెప్పినట్లు వినుచున్నారా? వారిని మిగుల బ్రీతితో నరసికొనుము. నీ శత్రువులు నీకు ఒదిగి యుండుచున్నారా? నీ కోశము ధనసమృద్ధమై యున్నదా? భార్యలు, పుత్రులు, పౌత్రులు అందఱు క్షేమముగ నున్నారా? నీ ప్రజలు సుఖసంతోషములతో నున్నారా?" అనగా విని కుశలమే యని విశ్వామిత్రుడు బదులుపలికెను. ఇట్లిద్దఱు సంభాషించుచు అనేకమైన పుణ్యకథలతో బ్రొద్దుపుచ్చుచుండిరి. అప్పుడు రాజునుగని వసిష్ఠుడిట్లనెను.

## వసిష్టుడు విశ్వామిత్రునకు విందుసేయుట

"ఓ రాజా! నీవతిథి శ్రేష్ఠుడవు పూజింపదగిన వాడవును. నిన్ను నీ సేనలతో గూడ సత్కరింపవలెనని యిచ్ఛ గలిగినది. గాన నీవంగీకరింపుము". అన

రాజు మునీంద్రా! నీ ప్రియవాక్యముల చేతనే ఆతిథేయమునందితిని. సుధారస మొలుకు వన్యములగు కందమూలఫలముల నారగించుట చేతనే ఆనందము పొందితిని. నీదర్శనము చేయుటచేతనే ధన్యతను పొందితిని. సెలవిమ్ము. స్నేహమును మరువకుము. వెళ్లి వచ్చెదను" అనెను. కాని మఱలమఱల వేడుచున్న వసిష్ఠుని మాటను కాదన జాలక, విశ్వామిత్రుడు మునీంద్రా నీ యిష్టమెట్లో అట్లే యొనర్చెదనని సమ్మతించెను. అంత అనఘుడగు వసిష్ఠ మౌని శబలయను పేరుగల దైవధేనువును చూచి, రమ్ము రమ్ము ధేనువా వినుము నేనీ రాజునకును వీరి పరిజనులకును విందు పెట్టెదను. అందుచే నీవు వెళ్లి వీరికెల్లరకును వారివారి కోర్కెలు దీరునట్లుగా మధురములైన అన్నము, పానకము, రసాయనము, లేహ్యము, ఫలములు మున్నగు భోజ్యపదార్థములన్నియు సమకూర్పుము, అని యజ్ఞాపించెను.



# ఏబది మూడవ సర్గము

**అ**నగా విని యా ధేనువు ఎట్లుండదగునో యట్లుండునట్లు పలువిధములైన పిండివంటలను, అధికమైన తేనెను, మద్యములను, కమ్మనైన కూరలను, పప్పులను, అప్పములను ఎవ్వరేమికోరెదరో అవియన్నియును, పాలును, పండ్లును, రుచిగాను వేడిగానునున్న యన్నమును, కండచక్కెరలును, తేటగా నున్న పానకముతో నిండిన స్వచ్ఛమైన పాత్రలను మొదలగు నవన్నియును సృష్టిచేసెను. అప్పుడు మునిరాజు, రాజునకును, పరివారమునకును బంగారుపాత్రల నుంచి అందములయిన ఆసనముల గూర్చుండజేసి వెండి యరటాకులలో రుచికరములైన అన్నము మొదలగనవన్నియు వారందఱకు సాపడ బెట్టెను. అంతఃపురకాంతలతోను, మంత్రులతోను, బ్రాహ్మణులతోను, సైన్యముతోను రాజు సంతుష్టిగా కంఠములవఱకుండునట్లు ఆరగించెను. ఈ ప్రకారముగా సాపాటొనరించి విశ్వామిత్రుడు మౌనీంద్రా ! మేము సంతుష్టి పొందితిమి. నీ యొక్క శక్తికి మెచ్చుకొనుచున్నాము. అని పలికెను.

## విశ్వామిత్రుడు కామధేనువు నడుగుట

విశ్వామిత్రుడు వసిష్ఠుని జూచి “మునీంద్రా ! నిన్ను స్నేహపూర్వకముగా ఒక్కటి యడిగెదను. మెచ్చదగిన లక్షగోవులను నీకిచ్చెదను ఈ కామధేనువును నాకిచ్చివేయుము. ఏలయన గోవులన్నిటిలోను శబల శ్రేష్టమైనది. సూర్యసమ తేజస్వి. మునీంద్రా ! శ్రేష్ఠవస్తువులు రాజసమూహము నొద్ద నుండదగినవి గదా. రాజులు రత్నహారులన వినవే? అని పలుక ముని “జననాథా ! ఏమిటికి ఊరకమాటలాడెదవు. నూరువేల ఆవులనిచ్చెదనంటివి గాని నూరుకోట్ల

ఆవులనిచ్చినను, కనకపు రాసులనిచ్చినను, ఈ కామధేనువును ఎడబాయ జాలను. ఆత్మవంతుని కీర్తివలె ఈశబల నన్ను విడచి ఎప్పుడునుండ జాలదు. హవ్యము, కవ్యము, బలి, అగ్నులు, హోమము, జీవనము మొదలగు సర్వము దీనివలననే జరుపుకొనుచున్నాను. దీనియందు దివ్యములైన విద్యలుగలవు. ఇది నాకు మిక్కిలి యానందదాయకము. ఇది నిక్కమైన మాటసుమీ. దీనిని వదలలేను. అదేకాక ఇంకను అనేకమైన కారణములన్నవి. కాన దీని నివ్వజాలను అని చెప్పగా గాధిజుడు మునీంద్రా ! బంగారు సొమ్ములు గల పదునాల్గువేల యేనుగుల  నిచ్చెదను. నాల్గుగుఱ్ఱములు కట్టబడిన బంగారు రథములను ఎనిమిదినూర్లు ఇచ్చెదరు. అనేక దేశముల నుండి తెప్పించిన గుఱ్ఱములను పదునొకండువేలు ఇచ్చెదను. అనేక వర్ణములు గలిగిన కోటియావులనిచ్చెదను. మునీంద్రా! నాకు ఈ శబలనిచ్చి వేయుము. నగలుగాని, రత్నములుగాని , హిరణ్యములు గాని, అనేక దేశములయందు తయారగు సామాగ్రులు గాని తగినటువంటి భూములుగాని, మడులుగాని, స్త్రీ సమూహములుగాని ఏవి నీవు కోరెదవో అవి యన్నియు నిచ్చెదను. దీనినిమ్ము. అనెను.

ఓ రాజా ! నీవెంతగా అడిగినను దీనిని నేనీయలేను. యజ్ఞములకు గాని దక్షిణలకు గాని ఇంకను నేను చేయు మంచి కార్యములన్నిటికిని ఇదియే నాకు ధనము, ఇదియే రత్నము, బంగారము, ఇదియే నా జీవితము. ఉపయోగపడని మాటలు చాలా చెప్పినను ప్రయోజనములేదు. ఈ కామధేనువును విడచి పెట్టను. వృథా ప్రసంగములను విడువుమని వసిష్ఠుడు పల్కెను.



# ఏబది నాలుగవ సర్గము

## విశ్వామిత్రుడు కామధేనువును బలాత్కరించి పట్టుకొనిపోవుట

ఈ ప్రకారము వశిష్ఠుడు చెప్పగా విశ్వామిత్రుడు బలాత్కారముగా ఆవును పట్టికొట్టి తీసికొని పోవుచుండగా నదివిచారముతో కన్నులనీరు గార వసిష్ఠుని యొద్దకు వచ్చి మునీంద్రా నేనేమి తప్పుచేసితిని. ఈ రోజు భటులు నన్ను నీ నుండి దూరము చేసి ఈడ్చుకొని పోవుచున్నారు. నన్నిట్లు వీడుటకు గారణమేమి యని గోలు గోలున నేడ్చుచుండగా, దుఃఖభారముచే భాధనొందుచున్న మనస్సుతో వాడిన మోముతో తోడబుట్టిన దానివలె వగతో బ్రార్థించుచున్న ఆ ఆవును జూచి, ధేనురత్నమా! ఈ రాజు మోహాంధుడై వీరుడునను గర్వముతో నిన్నుతీసికొని వెళ్లుచున్నాడు గాని నేను నిన్ను వీడలేదు. అతడు రాజు పైగా అపరిమితమైన బలము గలవాడు శౌర్యముగలవాడు. ఇక అతనినుండి నిన్ను విడపింప గలనా? యని వసిష్ఠుడు పల్కగా విని ఆ సౌరభేయి యిట్లనెను. మహాత్మా ! క్షత్రియ బలమొక బలమా? బ్రహ్మబలము బలముగాని. బ్రహ్మ తేజస్సు గల మునీంద్రా ! ఆ రాజు ఎంతటి బలాఢ్యుడయ్యును, నీముందు నిలవజాలడు. నేనిప్పుడే అతని సైన్యము నంతను జంపివేసెదను. ఆ దుర్మార్గుని గర్వమునంతయు నీయొక్క మంత్ర మహిమచేత నేను నాశనము చేసెదను. ఆజ్ఞయిమ్ము అని వేడుచున్న శబలను జూచి వసిష్ఠుడట్లే చేయుము. శత్రువులు ఆశ్చర్యపడునట్లు, వారి పౌరుషము నశించునట్లు పరాక్రమవంతులను సృష్టింపుమని యానతీయగా శబల అట్లొనర్చెను.

# ఏబది అయిదవ సర్గము

## కామధేనువు కల్పించిన సేనచే విశ్వామిత్రుని సేన నాశనమగుట

శబల తన హుంకారముచే శత్రువులకు భయము గలిగించు వారును, శూరులును అగు పప్లవులను, మ్లేచ్ఛులను వందలకొలదిగ సృజించెను. వారు విశ్వామిత్రుని సైన్యమును రూపుమాపిరి. అది చూచి విశ్వామిత్రుడు క్రోధముచే నెఱ్ఱవడిన కన్నులు గలవాడై ఘోరములగు బాణములతో ఆ సేనను నేలగూల్చెను. మఱల ధేనువు పట్టిసము మొదలగుగాగల యాయుధములను ధరించిన వారిని, యవనులను, శకసైన్యములను కోట్లకొలదిగా సృజించెను. వారు కారుచిచ్చువలె ఆరాజు యొక్క సైన్యమును ఆటలాడుకున్నట్లుగా కాల్చివేసిరి. విశ్వామిత్రుడు క్రూరములగు, నస్త్రములతో ఆయవనులను, శకులను నిశ్శేషముగా చంపివేసెను. భూమియంతయు పీనుగుపెంటలై గుదిగ్రుచ్చినట్లుగా నయ్యెను. ఇట్లు విశ్వామిత్రుని చేత సంహరింపడిన సేనలను జూచి వసిష్ఠుడు శబలా ! తొందరగా బలములను సృజింపుము. నీ యోగబలము నాశ్రయించి సృష్టింపుమనగా నదియు హుంకారవముచే కాంభోజసమితిని, పొదుగునుండి పప్లవులను, యోనినుండి యవనులను, గుదస్థానము నుండి శకులను, రోమకూపముల నుండి మ్లేచ్ఛ కిరాతులను సృష్టిచేసెను. వారు విజృంభించి రాజు యొక్క భటులను, రథములను, గుఱ్ఱములను, ఏనుగులను సంహరించిరి. సేనలు సమూలముగా వసిష్ఠునిచేత చచ్చుట జూచి రాజు యొక్క కుమారులు నూర్వురును శూలములను పరశువులను ధనుస్సులను, శస్త్రములను దాల్చి ఒక్కమారుగా మునీంద్రుని మీదకురాగా వసిష్ఠుడు ఒక్క హుంకారముతో వారిని ఒక్క క్షణములో బూడిదచేసెను. ఈ ప్రకారముగా నూర్వురు కుమారులును చచ్చుటయు, సేనయంతయూ సమూలముగా నశించుటయు చూచి విశ్వామిత్రుడు క్రుంగిపోయి, సిగ్గుతో కుంచించుకొనిపోయి చెడిపోయితిని, ఈమునిని జయించుటెట్లు అని దీనుడై ఆందోళన జెందుచు, నిటూర్పులు విడుచుచూ విషాదముతో నేలపై వ్రాలెను. వేగములేని సముద్రము వలెను,

కోఱలు తీసిన సర్పమువలెను, పూర్ణముగా గ్రహింపబడిన సూర్యునివలెను, రెక్కలు తెగిన పక్షివలెను గర్వహీనుడై ఏ ప్రకారముగా నేనీమునిని జయింపగల నని తలంచినవాడై మిగిలిన తన కుమారుని రాజుగా పట్టముగట్టి విశ్వామిత్రుడు హిమవత్పర్వతమునకు జని, శివుని గూర్చి తపస్సు చేసేను. పార్వతీపతి దర్శనమిచ్చి రాజేంద్రా! ఏమి కావలెనో కోరుకొనుము. ఇచ్చెదననగా చేతులు జోడించి, నుదటజేర్చి మ్రొక్కి ఆ రాజు భక్తులను రక్షించువాడా! కష్టములను బాపువాడా! ఉమారమణా! దైత్యసంహరణా! నాపై అనంతమైన దయను జూపుము. నాయెడ దయగలవాడవేని సాంగోపాంగముగా ధనుర్వేదమును రహస్యయుక్తముగ నాకుపదేశింపుము, అని విశ్వామిత్రుడు ప్రార్థింపగా అట్లే యిచ్చితినని శంకరుడు వెళ్లగానే, అస్త్రముల యొక్క సమూహమంతయును నతనకి వశముయ్యెను. సంతుష్టుడై అస్త్రసమృద్ధిచే నుప్పొంగిన వాడై, మునీశ్వరుడింక నశించునని పున్నమినాటి సముద్రమువలె పొంగిపోవుచు వసిష్ఠమునీంద్రుని యాశ్రమసమీపమునకేగెను.

### వశిష్ఠ విశ్వామిత్రుల యుద్ధము

శివునిచేత వరంబులను పొందిన రాజు, వసిష్ఠుని యాశ్రమము నంతయు బూడిదచేసెను. అచ్చట మౌనులందఱు భయంకంపితులై పరువెత్తిరి. పక్షులు పరువు లెత్తెను. శిష్యులందఱు మూర్ఛపొందిరి. నిమిషములో ఆవనమంతయు చవిటిపఱ్ఱగా తయారయ్యెను. ఎచ్చటను చప్పుడు కూడా లేకుండెను. అప్పుడు వసిష్ఠుడు క్రోధమును పొందినవాడై ఇప్పుడే విశ్వామిత్రుని జంపివేసెదను. వెళ్లకుడు వెళ్లకుడు అని మఱల మఱల జెప్పినను ఎవ్వరు నిలబడకుండిరి. ఇట్లు అందఱు పరువుపెట్టుచుండగా కన్ను లెఱ్ఱవడగా, కనుబొమలు ముడివడు చుండగా వసిష్ఠుడు రాజుతో నిట్లనెను. నిన్ను నేనాపలేనను కొనుచున్నావు గాబోలు. ఆవునీయలేదను కోపముతో దోపిడి దొంగవలె నావనమును గాల్చితివి. ఓరీ ! దురాత్మా నిన్నింక క్షమించను. అనుచు రోషతామ్రక్షుడై చూచుటకు శక్యముగాకున్నవాడై, రెండవ యమదండమోయనునట్లును, పొగలేని యగ్నివలెను, వెలుగుచున్న తన బ్రహ్మదండమును చేతధరించి నిలబడెను.

# ఏబది యాఱవ సర్గము

**వి**జృంభించిన సంరంభముతో నిలిచిన మౌనిపై నిలునిలుమని రాజు అగ్నిబాణమును వైచెను. అది మీదకు వచ్చుచుండగా హస్తమందు బ్రహ్మదండము నుంచుకొని వసిష్ఠుడు విశ్వామిత్రునితో నిట్లనెను. 'గాధిజుడా ! నిలిచినాడను. నీ పరాక్రమము చూపుము. నీ బలమును, పట్టుదలను, శస్త్రాస్త్ర పాండిత్యమును గర్వమును బూడిద చేసెదను. నిన్ను నేల గూలజేసెదను. క్షత్రియ బలమెక్కడ? బ్రహ్మ బలమెక్కడ! ఓ పలుగాకీ! తుచ్ఛుడా! దివ్యమైన బ్రహ్మబలమును జూడుము. చూపించెదను. అని అగ్నిబాణమును బ్రహ్మదండముతో పడగొట్టెదను. అది నీళ్లలో పడ్డ అగ్నివలె చల్లబడెను. రాజు వారణము, ఐంద్రము, రౌద్రము, పాశుపతము, ఐషీకము, స్వాపనము, గాంధర్వము, మోహనము, మానవము, జృంభణము, వజ్రశరము, బ్రహ్మపాశము, కాలపాశము, వారుణపాశము, దండము, పైశాచము, దయితము, రెండశనులు, క్రౌంచముపైనాకము అను నస్త్రములను ప్రయోగించెను. ధర్మచక్రమును, భయంకరమైన కాలచక్రమును, విష్ణుచక్రమును, మధనమును, వాయువ్యమును, హయశిరమును, రెండు శక్తులను, ముసలమును కంకాళమును, కాలాస్త్రమును, వైద్యాధరమును, కాపాలమును, త్రిశూలమును ప్రయోగించెను. బ్రహ్మయొక్క కుమారుడైన వసిష్ఠుడు వాటినన్నింటిని ఒక్క క్షణములో బ్రహ్మదండకముతో మ్రింగివేసెను. అందఱకు ఆ మహాత్ముని మహిమ ఆశ్చర్యకరమయ్యెను. శ్రీరామచంద్రా ! ఏమని చెప్పుదును. ఇట్లు తన సర్వాస్త్రములు నిష్ఫలములయిన, అఖండమైన

క్రోధముతో విశ్వామిత్రుడు చెలరేగి గంధర్వులు ఋషులు, దేవతలు ముల్లోకములు భయము చెందునట్లుగా మునిపై తన బాహుదర్పము నంతయున జూపించుచు బ్రహ్మాస్త్రము నభిమంత్రించి వేయగా నది తన మీదికి నిప్పులు గ్రక్కుచు వచ్చుచుండగా వశిష్ఠుడు చూచి తనచేతనున్న బ్రహ్మదండంబుతో దానిని మ్రింగివేసెను. దేవతలు భయభ్రాంతులై చూచుచుండిరి. ఆ బ్రహ్మాస్త్రమును మ్రింగుటచే మౌని యొక్క ఆకారము మహాభయంకరముగా కనిపించెను. దారుణమైన రూపమునుదాల్చిన ఆమౌని రోమకూపములనుండి అగ్నిజ్వాలలు వెలువడుగా మహాప్రభావము గల ఆ ముని రాజును గాంచి ఋషీశ్వరులు స్తోత్రంబులను జేయుచు ఆనందముతో నుప్పొంగుచున్న మనస్సులతో నిట్లనిరి. నీ యొక్క బలమమేయము అద్వితీయము. అన్ని లోకములలో నీ కీర్తి వ్యాపించినది. ఓ బ్రాహ్మణోత్తమా! జగములు నీతేజమును భరింపలేకున్నవి. నీయొక్క తేజమునుపసంహరింపుము. లోకములను బాధలేకుండ జేయుము. రాజు నీచే జయింపబడినవాడు. అని యిట్లు మునులు తన్ను ప్రార్థింపగా మునిరాజు శాంతుడయ్యెను.



# ఏబది యేడవ సర్గము

## విశ్వామిత్రుడు పరిభవమంది తపముచేయ నిశ్చయించుకొనుట

దానిని జూచి గాధినందనుడు నిట్టుర్పులు విడుచుచు వగతో తన మనములో నిట్లు తలచెను. బలమనిన బ్రహ్మతేజోబలమేగాని, క్షత్రియ బలమొక బలమా? యుద్ధరంగమున నాయస్త్రములను అన్నిటిని బ్రహ్మదండమొక్కటియే హరించినది. ఇక నా శౌర్యమెందులకు పనికివచ్చును? అస్త్రము లెందుల కుపయోగించును? శాంత హృదయముతో నున్న బ్రహ్మత్వమునకు సాటి యున్నదా? అని తలచి నేను బ్రహ్మత్వనకై తపస్సుచేసెదనని మనస్సున నిశ్చయించుకొన్నవాడై, మైత్రావరుణునితో తన శత్రుత్వమును, పరాభవమును తలచుకొనుచు ఖేదము, లజ్జయు బొంది నిట్టూర్పులు విడచుచు దక్షిణ దిక్కుగా పోయి భార్యాసహితుడై తపము జేయచుండెను. అప్పుడతనికి మధుష్యందుడు, హవిష్యందుడు, మహారథుడునను పుత్రులు గలిగిరి. ఇట్లు వేయి సంవత్సరములు జరుగగా బ్రహ్మ అచ్చటికి వచ్చి రాజును జూచి మంచివాక్యములతో నిట్లనెను. తపస్సుచే రాజర్షులందరు నీచే జయింపబడిరి. కాన నీవు రాజర్షివైతివని తలచుచున్నానని పలికి దేవతలతో బ్రహ్మతన లోకమున కేగెను. విశ్వామిత్రుడు చింతించుచు సిగ్గుతో తలను వ్రేలవైచికొని దుఃఖముచేతను కోపము చేతను, మనమున వేగుచున్నవాడై మనస్సులో నిట్లు తలంచెను. ఎంతెంతయో తపస్సు చేసితిని. కాని అదియంతయు వ్యర్థమని తలంతును. మునులు, దేవతలు నన్ను రాజర్షిగనే ఎంచుచున్నామని పలికిరి. దీనివలన నాకుపయోగమేమి? అని నిశ్చయించుకొన్నవాడై ఇంకను గొప్పనైన తపము చేయుటకు ప్రారంభించెను.

## త్రిశంకోపాఖ్యానము

రామా! వినుము. ఇతడిక్కడ ఇట్లు తపము చేయుచుండగా సూర్యవంశమున బుట్టిన త్రిశంకుడను రాజు శరీరముతో స్వర్గమునకు వెళ్లవలెనని తలచి యజ్ఞము చేయ నిశ్చయించి వశిష్ఠుని బిలిపించి, నాయిష్టమెట్లు నెరవేరునని యడుగగా ఆలోచించి వశిష్ఠుడు ఇది నెరవేరుట శక్యము గాదని చెప్పగా, రాజు వానిని విడచి అతని నూర్వురు పుత్రులను జూడనేగెను. ఇట్టులేగి పరిశుద్ధులను, మహాతపస్వులును నగు గురుసుతులను జూచి, నమస్కరించి, సిగ్గుతో ముఖమును కొంచెము వంచినవాడై, వారితో నిట్లనెను. "గురుసుతులారా! మీ శరణుజొచ్చితిని. మీరే నాకుదిక్కు. మేనితో స్వర్గంబునకు వెళ్ళుటకు గోరికకలవాడనై ఒక యాగము చేయ సంకల్పించితిని. మీ జనకుని గోరితిని. తిరస్కరించబడితిని. మీ పాదములపై శిరముంచి వేడెదను. ఓ తపస్వులారా! నన్ను రక్షింపుడు. మేనితో స్వర్గమునకు వెళ్లునట్లు యజ్ఞము నాచేజేయింపుడు. మీ తండ్రి తిరస్కరింపగా, గురుపుత్రులు మీరు కాక నాకెవ్వరు అండగా నుందురు. తిరస్కారమును బొందివచ్చితిని. అయ్యా ఇంక మీరే నాకు దిక్కు. నాకీకార్యము నెరవేర్పుడు. ఇక్ష్వాకు వంశములో బుట్టిన వారికి ఏపుణ్యము సంపాదించి పెట్టవలెనన్నను మీ పురోహితులే కదా దిక్కు. రాజులకు పురోహితులే దైవము.



# ఏబది యెనిమిదవ సర్గము

కోపముతో గూడియున్న యా రాజు మాటలను విన్నవారై ఆ వసిష్ఠసుతులు నూర్వురును రోషముతో అతని జూచియిట్లు పలికిరి. “ఓ తెలివితక్కువ వాడా! సత్యవాదియైన గురువు చెప్పిన మాటను మీరి అన్యులనాశ్రయింప వచ్చునా? గురువును తిరస్కరించుట రఘువంశమున బుట్టిన వారికి మరియాదా? పురోహితుడైన యాచార్యుని మాట మీరవచ్చునా? ముని అసత్యము చెప్పువాడను కొంటివా? కాదని వసిష్ఠుడు చెప్పిన దానిని మేము చేయవచ్చునా? నీకు వివేకము లేదు. కాదనక పురమునకు బొమ్ము. వసిష్ఠుని జూడుము. నిన్నేకాదు. జగములన్నిటిలో గల యెవరినైనను యజ్ఞములు చేయింపనతడే సమర్థుడు. అతని కవమానము కలుగుపనిని మేము చేయవచ్చునా?”.

వారిట్లు పరుషముగా పలుకగా రాజు “గురువుచేతను అతని తనయుల చేతను పరాభవింపబడితిని. నేనింకొకరిని శరణు వేడెదను. మీకు శుభంబగు గాక. వెళ్లివచ్చెదననగా వారలారాజుంగని రోషాగ్ని పెరుగగా చండాలత్వమును బొందు మని శాపమిచ్చి తమయాశ్రమములోనికేగిరి. తెల్లవారి మేల్కొను నప్పటికి మెరయుచున్న పట్టుపుట్టములు, కాటుకద్దిన గుడ్డలవలెనయ్యెను. బంగారు ఛాయనుండు శరీరము కారు మేఘమును బోలియుండెను. మృదువుగా పొడవుగా నున్న జుట్టు కరకు దేరి కురుచయై జుంజురులయ్యెను. మణిమయము లగు కనకభూషణములన్నియు ఇనుప ఆభరణములయ్యెను. చూచుచుండగానే మెడలో వ్రేలాడు యజ్ఞోపవీతముల పోగులన్నియు నినుపకమ్ములయ్యెను. మునిజన శాపమిట్టి సైపరాని యాకృతిని కల్గజేసెను. మౌనుల కోపముచే

నిట్లు మాలతనమును పొందిన తన్ను జూచి ఎల్లరును అసహ్యపడుచు దూరముగా తొలగిపోవుచుండగా, తనయొక్క ధైర్యమే తనకు బాసట కాగా దుఃఖముచే దహింపబడుచున్న మనస్సుతో రాజు విశ్వామిత్రుని సమీపించి ఎదుట నిలిచెను. నిలువగా మాలరూపమున, దుఃఖతుడైయున్న త్రిశంకుని జూచి మునీంద్రుడు మిక్కిలి దయతో "ఓరాజా! శాపముచే మాలరూపమును బొంది యిచ్చటకు వచ్చిన కారణమేమి?" యని ప్రశ్నించెను. రాజు చేతులు మోడ్చి గురువును, గురుపుత్రులును, నన్నాదరించి నా కోర్కె తీర్చకపోగా నన్నిట్లుచేసి యవమానించిరి. దేహముతో స్వర్గమును బొందుటకై నిష్టతో నూరు యజ్ఞములు చేసితిని. నేనూహించిన ఫలము మాత్రము శూన్యమైనది. మునీంద్రా! ఇంతవరకబద్ధమాడి యెఱుగను. ఇక ముందెప్పుడును కల్లలాడను. క్షత్రియ ధర్మమును వీడలేదు. శపథము చేసి చెప్పెదను. ఎంత కష్టమువచ్చినను నిజమే పల్కుదును. ధర్మము తప్పక ప్రజలను వేయివిధముల రక్షించితిని. క్రతువులెన్నో చేసి, గురువులకు నా గుణగణములచేత చాలసంతోషము కలిగించితిని. ప్రఖ్యాతిగాంచితిని. కాని నే చేయ గోరిన క్రతువు చేయించుటకు వారికి దయకలుగలేదు. కావున దైవమే అధికుడని భావింతును. పౌరుషము నిరర్థకము. భూమిపై సర్వము దైవాధీనము. దైవమే సర్వాధికముని తలంతును. మునీంద్రా! నేను దైవోపహతుడను. నీవేనాకు శరణము. ఇంకొక చోటునకు బోను. ఇది నిశ్చయము. నాదుర్దైవమును నివారింపుము. నీ పురుషకారముచే నన్ను నీవిపుడ రక్షింపుము" అని విన్నవించెను.



# ఏబది తొమ్మిదవ సర్గము

ఇట్లు దీనోక్తుల నాడుచున్న రాజుని జూచి మునిరాజు మంచి మాటలతో "నాయనా నీకు మేలుకలుగును. వెఱవకుము. నీవు మంచి నడవడి గల వాడవని తెలిసి కొంటిని. నీ కొరతను నేను తీర్చెదను. మునిసంఘమును బిలిపింతును. వెంటనే క్రతువును ప్రారంభింపుము. గురువు యొక్క శాపముతో వచ్చిన యీ రూపముతోనే నిన్ను స్వర్గమునకు పంపెదను. భయపడకుము. నీకు కీర్తి చేకూరునట్లు చేసెదను. అధికముగా చెప్పుటెందులకు? వాస్తవము చెప్పుచున్నాను. ఇక నీకు స్వర్గము అరచేతిలోని యుసిరికకాయ వంటిదిగా భావింపుము. నన్ను శరణు జొచ్చిన కారణమున నీపని నెరవేరినట్లే యని భావింతును" అని చెప్పి విశ్వామిత్రుడు తనపుత్రులను, జూచి యజ్ఞమునకు కావలసిన సామాగ్రిని సిద్ధముచేయుడని ఆజ్ఞాపించి, శిష్యులనందఱను జూచి నా ఆజ్ఞగా మునులను శిష్యులతో, ఋత్విజులతో గలిసిరండని పిలుచుకొని రండు వేగముగా పొండు. ఎవరైనను నామాటలను మీరి పల్కిన నాకు జెప్పుడు. అనగా వారందఱు దేశదేశములకు వెడలి విశ్వామిత్రుని యాజ్ఞను చెప్పి పిలిచిరి. సమస్తమైన బ్రాహ్మణులు, మునులు యజ్ఞమునకు విశ్వామిత్రుని యాజ్ఞ చొప్పున వచ్చిరి. శిష్యులు వచ్చి మునీంద్రా ! అందరిని పిల్చితిమి. వారందఱును యజ్ఞమును జూచుటకు వచ్చియున్నారు. మహాతపస్సంపన్నుడగు వసిష్ఠుడు రాలేదు. అదిగాక అతని పుత్రులు రోషవశులై యౌద్ధత్యముతో నిట్లుపల్కిరి.

“యజ్ఞదీక్షితుడు చండాలుడట ఆ చండాల యజ్ఞము చేయించు యాజకుడు విశ్వామిత్ర భూపాలుడట! బలే! ఆహా! యీ సద్బ్రాహ్మణులందఱు నా చండాలాన్నము నెట్లుతిందురో గదా ! దేవతలు సంప్రీతితో వత్తురా! చండాలుడెట్లు స్వర్గముజేరునో ఆ స్వర్గ మెట్టిదోగదా!” అని మహోదయుడు మున్నుగా గల వసిష్ఠపుత్రులు పల్కిరి మునీశ్వరా ! అని విన్నవింపగా విని ముని కన్నుల నిప్పులు రాలునట్లుగా జూచుచు అచట నున్న వారితో నిట్లనెను.

“అనవరత తపస్సమాధిలో నుండువాడను, ధర్మమునందాసక్తి గలవాడను, అగునన్ను దుర్భాషలాడి తిట్టిన దుర్మతులు మసియై యమభటులచే పాశములు గట్టపడినవారై భూమియందు శవభక్షకులగుచు నేడు నూర్ల జన్మములందుదురు. ఆపై కుక్క మాంసమును దినుచు దిక్కుమాలి దయా దాక్షిణ్యములు లేని నీచజాతి వారై, వికృతవేషులై, యపూజ్యులై భూమిమీద సంచరింతురు. తిట్టదగని నన్ను తిట్టిన ఆ మహోదయుడు బోయయై ధరణిని దిరుగుచు ఆత్మహత్య యను పాతకముచే దుర్గతిని బొంది నా కోపముచే అందు నశించును.”



# అఱువదవ సర్గము

**ఈ** ప్రకారముగా శపించి మునిసంఘమును, జూచి విశ్వామిత్రుడు మునులారా! ఈ రాజు మహాబుద్ధిమంతుడు. ధర్మాత్ముడు ఇక్ష్వాకు వంశమున బుట్టిన వాడు త్యాగశీలుడు ఈ దేహముతోనే స్వర్గమునకు బోవలెనని తలచి నన్నుశరణు గోరెను. అందుచే మనమందరము ఆ ఫలముదేనిచో సాధ్యమగునో అట్టి గొప్పదైన క్రతువును జేయ ప్రయత్నించుదము. అని చెప్పగా మునులందరు తమ మనస్సులలో గాధిజుడు కోపముగల వాడు. అగ్నిహోత్రుని బోలినవాడు. ఎదురు చెప్పిన మనలను కూడ బూడిదగా జేయును. ఈ పీడ యెందులకు? ఈ మోటుమనిషి యేది చెప్పిన దానినే మంచిదనిన మౌని యొక్క మహానుభావత్వముచే ఈ రాజు కోరిక ఈడేరుగాక. జాగ్రత్తగా సర్వము జరిపించుదము అని అనుకొనిరి. విశ్వామిత్రుడు యాజకుడై క్రతువునంతను పూర్తిచేయగా మునులు వారివారికి నిర్దేశింపబడిన పనులను నెరవేర్పగా, బ్రహ్మసమాన తేజశ్శాలియగు మౌని హవిర్భాగములను పుచ్చుకొనుటకై దేవతలను బిలువగా వారు మేము రాము మునీంద్రా యనగా ముని రోషముచే నెర్రవడిన కన్నులు గలవాడయ్యెను.

## విశ్వామిత్రుడు త్రిశంకుని స్వర్గమున కనుచుట

విశ్వామిత్రుడు స్రువమును చేతితో నెత్తిపట్టుకొని ఓ రాజా ! చూడుము. ఈ క్రతువట్లుండనిమ్ము. అమోఘమైన నాతపోబలము చేతనే నిన్ను శరీరముతో స్వర్గమునకు బంపెదను అని పల్కి మరల రాజును జూచి యిట్లనెను. నాయొక్క తపశ్శక్తి యింకను గొంచెమున్నది గాన ఎవ్వరికిని వెళ్ళుటకు వీలుగాని

స్వర్గమునకు శరీరముతో నా తపశ్శక్తిచే వెడలుము. అని విశ్వామిత్రుడు పలుకగనే మునులందఱు జూచుచుండగ ఆరాజు శరీరముతో పైకెగిసి స్వర్గము సమీపించినట్లుగా వెడల దొడగెను. దేవతలతో గూడి యింద్రుడారాజును జూచి, “ఓ రాజా! నీవు స్వర్గమునకిట్లు రాకూడదు. మరల భూమిమీదకు బొమ్ము. గురుశాపమును పొందిన వాడా! ఓ త్రిశంకూ! నీకు స్వర్గమా! భూమి మీద తలక్రిందుగా పడిపొమ్ము” అని పల్కగా రాజు పడిపోవుచు “ఓ గురుతేజా! నేను పడిపోవుచున్నాను. నన్ను కాపాడవే” యని గోలపెట్టగా గాధిజుండా యార్తనాదమును, విని, ఎక్కువైన కోపముతో గూడినవాడై రాజా! నిలునిలుమని అక్కడనే నిలిపి సప్తర్షులను, చుక్కలను సృష్టించెను. దక్షిణదిక్కున ఒక ఇంద్రునైన సృష్టిచేసెదను లేదా యింద్రుడే లేకుండు గాక అని దేవతలను సృష్టింపబోగా, దేవతలు, ఋషులు వచ్చి “ఓ మౌనీంద్రా! యిది నీకు తగునా? ఈరాజు గురువు యొక్క శాపమును బొందినవాడు. ఇతనిని మేనితో స్వర్గమున నుంపదగునా? నీవే దీనిని బాగుగా ఆలోచించి విరోధమును వదిలిపెట్టుము. అన విని విశ్వామిత్రుడు వారిని చూసి ఇట్లనెను. ఈ రాజును నేను స్వర్గము నుంచెదనని పల్కి, ఆమాట నెట్లు తప్పుదును? అయిన మీరు ఇట్లు చేయుడు. నేను సృష్టించిన తారలన్నియు ఈ సృష్టియున్నంతవఱకు ప్రకాశించు గాక” అనగా దేవతలట్లే యగుగాక, ఈ నక్షత్రములన్నియు శాశ్వతములై ప్రసిద్ధమగు వైశ్వానరాధ్వమునకు వెలుపల నిలుచును. వాని మధ్య ప్రకాశించుచు తల క్రిందుగా నీ త్రిశంకుడు దేవతలతో సమానుడై యుండుగాక. ఈ నక్షత్రము లీతనినెల్లప్పుడు స్వర్గమువలెననుసరించును. ఇతడందు స్వర్గసౌఖ్యములందను” అనిపల్కిరి. మౌనియు అట్లే కానిండని అంగీకరింపగా సురలును, మునులను, యధేచ్ఛగా జనిరి. ఆయజ్ఞమునకు వచ్చిన మునులును తమతమ నివాసములకు వెళ్లిరి.

# అఱువది యొకటవ సర్గము

**అ**ట్లందరును వెడలగా విశ్వామిత్రుడావనములో నున్న మునులను జూచి, ఇచ్చట తపస్సునకు విఘ్నములు కలుగుచున్నవి. ఇక వేఱొక దిక్కునకు పోయి తపస్సు చేయుదమా?పడమటిదిక్కు విశాలమైన వనములతో అందమైనది. అందు పవిత్రమైన పుష్కరతీర్థము గలదు. కాన నటకు వెళ్లి అందరము విశేషమైన తపము చేయుదమని పల్కి పడమటిదిక్కునకు వెళ్లి ఘోరమైన తపమొనరించెను. ఈ ప్రకారముగ విశ్వామిత్రుడు తపము చేయుచున్న సమయంబున అయోధ్యా నగర రాజైన అంబరీషుడు, ఆర్యులచేత మెచ్చబడినవాడు, గుణములచే ప్రకాశించువాడు, ధరణి ధర్మముగా పాలించువాడు క్రతువు చేయసాగెను. ఆ యజ్ఞపశువును ఒకరాత్రి దేవేంద్రుడుపహరింపగా బ్రాహ్మణులు "ఓ రాజా ! నీవు రక్షించెడి ఆ పశువు పోయినది. ఇట్టి అశ్రద్ధ తగునా? యజ్ఞపశువు పోయినచో ఆ పశువును రక్షింపలేని రాజును ఆ దోషము హతుని జేయును. ఇట్టి మహావిషయములందు మతిమరుపు తగునా? నీవు అజాగ్రత్తగా నుండుటే యింత చేసినది. పోయినదానిని గానీ, అది దుర్లభమైనచో క్రతువున కొక మనుష్యుని గానీ తీసికొని రమ్ము" అనగా రాజు ప్రతిపల్లెయు, ప్రతిగ్రామమును, ప్రతివనమును, ప్రతిపట్టణమును స్వయముగా వెదుకదొడగెను. ఎక్కడనైనను ఒక్కడు యజ్ఞపశువుగా నుపయోగపడువాడు దొరుకునాయని రాత్రియనక, పగలనక తిరుగదొడగెను.

## శునశ్శేఫోపాఖ్యానము

ధర్మపరిపాలకుడైన అంబరీష మహారాజిట్లు వెదకుచు నొకచోట

భార్యాపుత్రుల తోనున్న ఋచీకుడను మునిని చూచి మ్రొక్కి నీకు నూరువేల ఆవులనిచ్చెదను. ఒక్క కుమారుని క్రతుసంరక్షణార్థముగ ఇమ్మని బ్రతిమాలుచు మౌనితో మరియు నిట్లనెను. "కాళ్లు తీపులు పుట్టునట్లు చాల దేశములను తిరిగితిని. ఎందును యజ్ఞపశువు దొరకలేదు. యజ్ఞపశువుగా నీ కుమారులలో నొకనిని నాకమ్ముము". అనగా రాజా! నీవేమిచ్చినను ప్రేమపాత్రుడైన నా పెద్దకుమారుని నేనీయలేను" అని మౌని పల్కెను. అంత నతని భార్యయు రాజును జూచి "వింటివా రాజా మునియన్న మాటలను, తన పెద్దకొడుకు నీయడట. మా చిన్నకుమారుడగు శునకుని నమ్ముటకు నేనంగీకరింపజాలను. తల్లికి కడగొట్టు కొడుకునందు ప్రేమగదా. సాధారణముగా తండ్రికి పెద్దకుమారుని యందును, తల్లికి పిన్నవానియందును ప్రీతి యధికముగాన చిన్నవానిని నేను రక్షించుకొందును" అని పల్కగా తండ్రి మాటలు ఆపయి తల్లిపలుకులు విని మధ్యవాడైన శునశ్శేపుడు రాజును జూచి మిక్కిలి యుదారతతో నిట్లనెను. నాతండ్రి పెద్దకుమారునీయడు. చిన్నతనయుని నమ్ముటకు తల్లి యొప్పదు వారిద్దరిమాటల విధము చూడగా మధ్యవాడనైన నన్నమ్ముట వారికిష్టమైనటులు తెలియుచున్నది. అందుచే ఇదిగో నేను వచ్చుచున్నాను. రాజా నన్నుతీసుకొని వెళ్లుము. నీ విచ్చెదనన్న నూరువేల యావులను నాతండ్రికిచ్చి వేయుము. "అనగా రాజా గోవులనిచ్చి వెంటనే ధర్మరతుడైన యా మునికుమారుని సంతోషముతో తీసికొని వెళ్లుచుండగా మార్గమున పుష్కరతీర్థము దగ్గరకు వచ్చునప్పటికి మధ్యాహ్నమయ్యెను.



# అఱువది రెండవ సర్గము

**ఆ** యెండ వేడిమికి సహింపలేక రాజచ్చట విశ్రమించగా శునశ్శేపుడు పరువెత్తుకొని వచ్చి ఋషి శ్రేష్ఠులతో గూడియున్న వాడును, మేనమామయు తపోవ్యాపృతుడును అగు విశ్వామిత్రుని జూచి దాహముతోను, అలసటతోను, మహా దీనదశతోను మొగము పాలిపోవుచుండగా వేగముగా అతని యొడిలో వ్రాలెను.

## శునశ్శేపుడు విశ్వామిత్రుని శరణు వేడుట

"ఓ మామా ఏమని చెప్పుకొందును. ఇక నన్ను నీవే రక్షింపుము. భూమిమీద నాకు తండ్రియు లేడు. తల్లియు లేదు. నన్ను కాపాడెడు చుట్టములు లేరు. "ఓ మునీశ్వరా! నీ వెట్లైనను ఆలోచించి రాజుయొక్క సరియైన కోరిక నెరవేరునట్లును నేను తాపసినై స్వర్గమును పొందునట్లును చూడుము. నాకు చిరాయువు కల్గునట్లు చేయుము. నాకు ఒక్కడు కూడ దిక్కులేడు. నీవేనాకు దిక్కగుము. తండ్రి కుమారుని వలె ఆపద రానీయక నీవే కాపాడుము. నీ కిష్టమైనచో నీ లోకములోని వారందరిని దయతో కాపాడగలవు." అని ప్రార్థింపగా కౌశికుడు మేనల్లుని నూరడించి తనకుమారుల జూచి యిట్లనెను. "పుత్రులారా మీరలు పితృఋణముదీర్చు సమయము ఆసన్నమైనది. ధర్మపరాయణులారా! భూమిపై తల్లిదండ్రులు తనయులు కావలెనని కోరుకొనుట, తాము చెప్పుమాటలు వినువారు జన్మించుటకు, అధిక స్వర్గసుఖము లందుటకుయే గదా. చిన్నబాలుడైన యీ మునికుమారుడు కాపాడుమని భయభ్రాంతుడై వచ్చి నన్ను శరణుకోరెను. మీలో నెవ్వడైన నొక్కడీతనికి ప్రాణదానము చేయుడు. ఈ నా వాక్యమును పాటింపుడు. ఇది నాకిష్టమైన కార్యముగాన నాకుమారులగు మీరీ కోర్కెనెరవేర్పుడు. మీరెరుగని ధర్మములు గాని, మీరు చేయని ధర్మములు గాని భూమిమీద లేవు. కాన రాజుయొక్క యజ్ఞవేదిక యందు మీకు క్రతుపశువుగా నుండ యగ్నికి తృప్తిని కలిగింపుడు.

దీని వలన గలుగు అనంతఫలము చెప్పనలవి గానిది. ఇతడు రక్షింపబడును. రాజు యజ్ఞము నిర్విఘ్నముగా పూర్తియగును. దేవతలు సంతోషించెదరు. నా మాట నెరవేర్చిన వారగుదురు. అని చెప్పిన తండ్రి మాటలను విని అహంకారముతో, పరిహాసముతో గూడిన మొగములతో "ఓ తండ్రీ! తన పుత్రులను బలిపెట్టి యితరుల పుత్రుని రక్షించుట తగునా? ఇది కుక్క మాంసము భుజించుట వలె తగని కార్యమని వెంటనే పుత్రులందరు పలికిరి. అప్పుడు మౌని ఏమీ నేనౌనని చెప్పినది మీరీ విధముగా భయముగాని, ధర్మబుద్ధిగాని లేక కాదుకాదని యందురా? నామాట జవదాటి మీరలిక మనగలరా? ఆవసిష్ఠుని పుత్రునివలెనే కుక్కమాంసమును దినుచు, హీనాత్ములై వేయేండ్లు పడియుండును" అని మహారోషముతో శపించి, ఆ బాలుని జూచి యభయమిచ్చి నీకు క్షేమము గలుగును. వైష్ణవంబగు యూపమునకు నిన్ను కట్టినప్పుడు అగ్నిహోత్రమున కెదురుగా నుండి వీనిని పఠింపుమని విశ్రుతములైన మంత్రములను రెండింటి నిచ్చెను. "వీనిని మఱవక పఠించినచో రాజుయొక్క యజ్ఞము నెరవేరును. నీకు సిద్ధియు గలుగును." అని చెప్పి పంపగా అతడు వేగముగా వెడలి రాజును జూచి "ఓ రాజచంద్రా! ఇక ఆలస్యమెందుకు? యజ్ఞవాటికకు వెళ్లుదము. యజ్ఞము చేయుటకు తొందరగా దీక్ష వహింపుము" అని పల్కెను. మునిపుత్రుని ఆ మాటలకు సంతోషించి రాజు పురోహితుని సమ్మతితో క్రతువు చేయుటకు ప్రారంభింపగా బ్రాహ్మణులు ఆ బాలుని మెడయందు పువ్వులుచుట్టి యెఱ్ఱని బట్టలను గట్టి యజ్ఞయూపమునకు గట్టగా భయపడక బాలుడు ఆ మంత్రములను, మనసులో పఠించి యింద్రుని, ఉపేంద్రుని నానందమున ముంచెను. ఇంద్రుడు వెంటనే ఆ ముని పుత్రునికి దీర్ఘాయువు నొసగి రాజు యజ్ఞమును సఫల మొనర్చెను. అగ్నితో సమానమైన తేజస్సు గల విశ్వామిత్రుడు నిండుగా వేయిసంవత్సరములు. తనను లోకము పొగడునట్లుగా నిష్ఠతో పుష్కర తీర్థమున తపస్సు చేసెను.

# అఱువది మూడవ సర్గము

ఇట్లు వేయేండ్లు నిండగా బ్రహ్మ దేవతలతో గలిసి యా ముని శ్రేష్ఠుని జూడవచ్చి శుభమైన వాక్కులతో నిట్లనెను. "నీవు సద్భక్తితో చేసిన తపస్సు యొక్క పుణ్యముచేత ఋషిత్వమును పొందితివి. ఓ దండితవైరీ!" అని పల్కి అంతర్హితుండయ్యెను. అంతటితో సంతృప్తిని పొందక మహాత్ముడైన గాధిజుడు మరల తపస్సు చేసెను. దేవతల పంపున నాపుష్కర సరోవరమున జలక్రీడ లాడుటకు తన మహాసౌందర్యముచే మన్మధుని బల్లెమోయనునట్లున్న మేనకయను నొకయప్సరస వచ్చెను.

## విశ్వామిత్రుడు మేనకను మోహించుట

వచ్చిన, ఆ పద్మముల వంటి కనులు గలదియు, పుష్పమువలె మనోహరమైన మేనుగలదియు, జలవిహారమునందాసక్తి గలదియు, మేఘములవలె నల్లని శిరోజములు గలదియు, మల్లెమొగ్గల వంటి పల్వరుసగలదియు, చంద్రుని వంటి ముఖము గలదియునగు నామె జలకములాడుచుండగా, మేఘమునందలి మెరుపుతీగయోయను నట్లుగా జూచి మన్మథబాణములచే గొట్టబడిన వాడై తామరాకు మీది జలమువలె కలగిపోవుచు ఆమెను సమీపించి యిట్లనెను.

ఓ అచ్చర కన్నియా! నీకు శుభమగు గాక. నిన్ను జూచి నప్పటినుండి మన్మథుడు నన్ను వాడి బాణములతో బాధపెట్టుచున్నాడు. భరింపలేను. నీ విష్టపూర్వకముగ నిచ్చట నిలిచి ఎక్కువైన తమకముతో నన్నేలుకొనుము. నీ సేవకుడనయ్యెదను నన్ను నమ్ముము" అని వేడుకొనెను. ఆ కాంతయు నట్లేయని

విశ్వామిత్రు నాశ్రమమున నిలిచెను. ఇట్లు పదియేండ్లు జరుగగా ఒకరోజున ముని తన మనస్సులో నిట్లు తలంచెను. పట్టువదలక బ్రాహ్మణత్వమును సాధింపదలచిన విరాగియైన గాధిజుడెక్కడ? కలత చెందక మహాతపస్సు చేయుటెక్కడ? వేశ్యతో గడుపుటెక్కడ? ఆహా ఈ మాట విన్నచో బ్రాహ్మణులెల్ల నన్ను జూచి ఫక్కున నవ్వరా? సిగ్గుపుచ్చురా? నిన్న, యీ రోజువలెనే పదియేండ్లు వేశ్యతో గడచిపోయినది. మన్మథుని బారినిబడితిని. సిగ్గువిడచితిని. రాజట, సుఖమును వదలినవాడట, బ్రాహ్మణత్వమును గోరి వనములో ఏండ్లు పూండ్లు మునియైయుండి వెలయాలికి దక్కెనట. ఇట్టి వింత లెచ్చటనైన గలవా? గొప్పదైన నాబుద్ధి మోసముతో చెడిపోయితిని. వట్టి బూటకపు తపమెందులకు? మునియట–వెలియాలి పొందట. విన్నవారలు ఇది వట్టివేసమని నవ్వరా?" అని సిగ్గుతో తలవంచి ఈ జంజాటమెట్లు ప్రాప్తించె నని ఆలోచించి దేవతలు నాతపస్సు చెడగొట్టుటకై చేసిన మోసమిది యని నిట్టూర్చి, విచారించి, భయముచే కంపించుచున్న ఆ మదిరాక్షిని జూచి విశ్వామిత్రుడు మృదువైన మాటలతో నిట్లనెను. ఎందుకు భయపడెదవు? ఓ దేవకన్యా! కామునకు లొంగిపోయిన అల్పుడను. నీ కేళీవినోదములలో పడి చెడిపోయితిని. నిన్ననేల? ఓ తరుణీ ఇక వెడలి పొమ్ము అని చెప్పి ఆ దేవవేశ్యను పంపంచి తానును హిమనగము చెంతకు తపము చేయవెడలెను. కామము జయింప వలెనను నిశ్చయముతో కౌశికీ తీరమున గట్టితపమొనర్చెను.

### విశ్వామిత్రుడు మహర్షి యగుట

ఉత్తరపర్వతమున మహోద్యమ తత్పరుడై తపస్సు వేయిసంవత్సరములు పూర్తిచేయగా దేవతల సంఘము చేతులు జోడించి బ్రహ్మదగ్గరకు వెళ్లి ఈ మునీశ్వరుడు మహర్షి యనుటకు తగిన తపము చేసెను. లోకములలజడి

చెందినవి. నీవు వచ్చి మునుని శాంతుని జేయుము. అనగా బ్రహ్మవచ్చి మునిని జూచి ఆదరించి నాయనా మహర్షి వైతివి అని పల్కెను. ఆ మాటలకు చింతింపక విశ్వామిత్రుడు తనివితీరని వాడై బ్రహ్మమొగము చూచి యిట్లనెను. “నీవు మహర్షి వని యనుటచే నేను జితేంద్రియుడను గానా?” అనగా గాధిజుడా! నీవింకను జితేంద్రియుడవు కావు. దాని కింకను ప్రయత్నము చేయుమని బ్రహ్మచెప్పెను. అట్లేయని గాలిమాత్రమే ఆహారముగా గొని చేతులెత్తి ఏ ఆధారముగాలేక నిశ్చలుడై అద్భుతమైన నిష్ఠతో విశ్వామిత్రుడు తపమొనర్చెను. వేసవికాలమున పంచాగ్నుల మధ్యయందును, వదలక కురియ వానలలో ఆరుబయటను పుండువంటి చలిలో చల్లని నీటిలోను నిలబడి రేబవళ్లు తపించెను. దానిచే లోకములు తల్లడిల్లెను. ఇంద్రుడు దేవతలలో గలిసి మిగుల చింతించి తమకు మేలును, మునికి కీడును గలిగించు మాటలను రంభతో నిట్లు చెప్పెను.



# అఱువది నాలుగవ సర్గము

## రంభ విశ్వామిత్రు తపంబు చెరుప బోవుట

"రంభా! యోగిపుంగవుల ప్రయత్నముల మాన్పగలదానా! నీ నైపుణ్యమును చూపుటకు అదనువచ్చినది. విశ్వామిత్ర మౌని సంరంభము నాపుము. ఇది దేవకార్యము. దీనిని నిర్విఘ్నముగా దీర్పవలెను" అను నింద్రుని జూచి సిగ్గుచెంది చేతులు జోడించి దీనములగు వాక్కులతో రంభ యిట్లనెను. "ఓ సురేంద్రా! కౌశికుని దగ్గరకు వెళ్లవలెనన్న గుండెజల్లుమనుచున్నది. శరీరము వణకు చున్నది. అతని నోటిదురుసు తనము నీ వెరిగినదే కదా. కొరవితో తల గోకి కొనవచ్చునా? సురేంద్రా! నను దయదలంపుము. మంచి హృదయముతో నన్ను కరుణజూడుము". అని దీనమైన వాక్కుతో ప్రార్థించు రంభను జూచి ఇంద్రుడు "రంభా! ఏల వెరచదవు? ఇది తగునా? నీకు శుభమగు గాక. నీ శరీరము మరింతగా ప్రకాశించగా నీయందమినుమడించగా రమ్ము. నేనును నీ సమీపముననే యుండెదను. ఓ సుమకోమలమైన శరీరముగల దానా! మన్మథునితో గలిసి కోకిలనై వసంతముచే చిగిర్చిన కొమ్మలపై నుండి కూయుదును," అని పల్కెను. ఆ మాటలకు రంభ అంగీకరించి క్రొత్త క్రొత్తగా అలంకరించుకొని ఆ మౌనిని చేరబోయి చిరునవ్వులు చిందించుచు నొక్క మనోహరమగు పాటపాడెను. వినగా వినగా ఇంపు పుట్టించుచున్న ఆ పంచమ స్వరమును ముని విని కన్నులుతెరచి తనముందు పాడుచున్న దేవకాంతను జూచి మదిలో సంశయించిన వాడై ఇదియంతయు శచీకాంతుని యొక్క కుతంత్రమని తెలిసికొని మనసులో కోపము రాగా కన్నులెఱ్ఱవడగా రంభతో నిట్లనెను.

## విశ్వామిత్రుడు రంభను శిలగా శపించుట

ఓసీ రంభా! కామక్రోధములను జయించు యత్నము చేయుచుండ నీవిట్లు దోషమని యెంచక నా తపస్సును భంగము చేయదగునా? ఓ దుశ్శీలురాలా! వేషమును ధరించి వచ్చితివి. భూమి మీద రాయివై పదివేల యేండ్లు పడియుండుము. ఆపైన శుభముకల్గును. ఓ రంభా నేనిచ్చిన ఈ శాపమును అమితమైన తపోబలము గలవాడును, మేధస్సు గలవాడును, మహాతేజస్సుగలవాడును అగు బ్రాహ్మణుడు పోగొట్టి రక్షించును. అని తిట్టి ఓర్పులేనందుకు మనస్సులో ఆందోళన జెందెను. దేవకాంతయు వెంటనై శిలయై పడెను. దానిని జూచి ఇంద్రుడును మన్మథుడును పారిపోయిరి. అంత నా మౌనీశ్వరుడు కొంచెమైన శాంతము లేకపోవుటకు చాలా చింతించి, ఎంతఘోరములు జరిగినను కోపమును పొందను. ఇది నిశ్చయము. నోరుతెరచి మాటలాడుటయే మానివేసెదను. అంతటితో సరిపోకపోయిన ఎన్ని శతాబ్దములైనను ఊర్పు విడచుటమానివేసెదను. శరీరము చిక్కి పోవునట్లు చేసెదను. ఇంద్రియముల పటుత్వము నణచివేసెదను. కామమును దరిజేరనీయను. త్రొక్కినను, మ్రొక్కినను ఈ దారినే యుండెదను. ఆహారము తీసికొనను. ఊపిరి విడువను. మఱికోపమను మాటనే మనస్సునకు రానీయను. బ్రాహ్మణత్వము సిద్ధించువఱకు పట్టువిడువను అని నిశ్చయించుకొనెను.



# అఱువది యైదవ సర్గము

**ఉ**త్తర దిశను వదలి తూర్పునకు వెడలి మౌనము పూని వేయి సంవత్సరములు నియమముతో తపమొనరించి విశ్వామిత్రుడు పూచికపుల్లవలె శుష్కించిపోయెను. మధ్యమధ్యన గొప్పవైన అంతరాయములు కలిగినను కోపగించుకొనక నిశ్చయబుద్ధితో మనసు చెదరనీయక నిండుగా వేయేండ్లు తపము చేసెను. ఇట్లు వేయేండ్లు పూర్తిచేసి భుజింపబోగా ఇంద్రుడు బ్రాహ్మణవేషధారియై వచ్చి 'ఆకలికి ఆగలేకున్నాను అన్నము పెట్టుమని యడుగగా మహాభక్తితో మరుమాటాడక, కోపము చెందక, సర్వము నిచ్చివేసెను. ఇట్లుపవాసముతోనే ఉచ్ఛ్వాసనిశ్వాసములను మాని మరల వేయేండ్లు తపస్సు చేయగా అతని శిరస్సునుండి గొప్ప ధూమము బయలుదేరినది. లోకములు భయమునందినవి. దేవతలను, గంధర్వులును, రాక్షసులును, పన్నగులును కలత చెందిన మనస్సులతో బ్రహ్మదేవుని యొద్దకు వెళ్లి " ఓ దేవాధీశ్వరా! గాధిజుని వలన ఎల్ల జగములను దహింపబడుచున్నవి. ఎన్నియో యుక్తులు పన్నితిమి గాని, కామమును గాని, కోపమునుగాని అతడు పొందలేదు. అతని హృదయము పుటముపెట్టిన బంగారము వలె మిక్కిలి పరిశుద్ధిని పొందెను. ఇంక ఆలస్యము చేయుట తగదు. అతని కోర్కెను దీర్పుము. దిక్కులన్నియు వ్యాకులతపొందెను. సముద్రజలములు క్రాగిపొంగుచున్నవి. కొండలు క్రుంగు చున్నవి. భూమికంపించుచున్నది. పెనుగాలలు వీచుచున్నవి. నిఖిల లోకములు అతని తపోగ్నిలో దహింపబడకముందే కాపాడుము. నాస్తికుల వలె జనులు ఉపాసనను విడచిరి. సూర్యుడు తన తేజమును గోల్పోయెను. జగత్తు ఆపదను పొందెను. గాధిజుడు ఉపవాసముతో తపస్సు చేయుటచే నింతయైనది. కాలాగ్ని సమానమైన తనతపస్సు యొక్క వేడిచే లోకములను కాల్చుటకు మొదలుపెట్టెను. దేవేంద్రపదవి యిచ్చియైనను జగములను కాపాడుము" అని విన్నవించిరి. అంత నా పితామహుండు దేవతలతో గలసి కౌశికమునీంద్రుని యొద్దకు వెళ్లి 'మునీంద్రా! ఇకలెమ్ము. బ్రాహ్మణత్వమును పొందితివి. మఱియు నీకు చిరాయు

విచ్చితిని. నీకు భద్రములు కలుగును. గాధిజా! యథాసుఖముగ నేగుము. అని పల్కగా విశ్వామిత్రుడు బ్రహ్మను, దేవతలను జూచి నమస్కరించి ఇట్లు పల్కెను.

**బ్రహ్మ విశ్వామిత్రునకు బ్రహ్మఋషిత్వమిచ్చుట**

"దేవా ! నాకు బ్రాహ్మణత్వమును దీర్ఘాయువును కలిగినచో ఓంకారము, వేదములు, వషట్కారము నన్ను చెందుగాక. మరియు నింకొక్కటి గలదు. క్షత్రవేదవిదులలో బ్రహ్మవిధులలో మొదటివాడయిన వసిష్ఠముని వరేణ్యుడు నన్నిట్టి వానిగా అంగీకరింపవలయును. ఇదియే నాయొక్కకోరిక. దేవతలార! నా ఈ కోర్కెను దీర్చి వెళ్లుడని" విశ్వామిత్రుడు పల్కగా, వారందరు వేడగా ఆవసిష్ఠమహర్షి విశ్వామిత్రునితో స్నేహముపాటించి నీవు బ్రహ్మర్షివైతివనెను. "నీవు నిశ్చయముగా బ్రహ్మర్షివైతివి. బ్రాహ్మణులకు దగిన క్రియాకలాపము లన్నియు నిన్ను జెందును." అని పలికి దేవతలు వెడలగా ఈ మౌని అప్పటినుండి వసిష్ఠునితో స్నేహము గలిగి యుండెను. రామా ! ఈ విధముగా బ్రహ్మ సమానుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణ్యమును పొంది తన యిష్టమునను సరించి భూమండలమున దిరుగుచుండెను. ఈ విశ్వామిత్రుడనగా నేమనుకొనుచున్నావో ఇతడు మునిశ్రేష్ఠుడు. ఆకారమును బూనివచ్చిన తపస్సు. వీర్యమునకు, శౌర్యమునకు నిలయమైనవాడు. ధర్మాసక్తుడు. ఓ రామా ! వింటివా ఈ మౌని వృత్తాంతమును? అని చెప్పి గౌతముని పుత్రుడగు శతానందుడు విరమించగా జనకుడు రామలక్ష్మణులతో పాటు ఈ చరిత్ర నాసక్తితో విన్నవాడై చేతులు జోడించి విశ్వామిత్రుని ముఖమును జూచి ఇట్లనెను. "మౌనీంద్రా! నీవు రాజపుత్రులతో గూడి వచ్చుటచే ధన్యుడనైతిని. మాన్యుడనైతిని. నీ దర్శనముచేత పావనుడనైతిని. నీ తపస్సు యెక్క విశేషములను వింటిని. నీ గుణము లెన్నరానివి. నీ తపోబలము కొలువ రానిది. నీ బలమింతింతయనరానిది. ఎంతవినినను తృప్తికలుగుటలేదు. సూర్యుడు పశ్చిమాద్రిపై గ్రుంకుచున్నాడు. సాయంత్రపు కర్మలకు వేళయైనది. ఇక సెలవిండు. వేకువనే మరల చూడవచ్చెదను, అని మునిరాజునకు బ్రదక్షించి సపరివారముగా వెడలెను. రామ లక్ష్మణులును మునులును వెంటరాగా విశ్వామిత్రుడు తన నివాసమునకు వెడలెను.

# అఱువది యాఱవ సర్గము

## విశ్వామిత్రుడు జనకునితో రామలక్ష్మణులకు శివునివింటిని చూపుమని చెప్పుట

ఆ మరునాడు వేకువనేలేచి (15వ నాటి ఉదయము) ఉదయము చేయవలసిన కృత్యములను దీర్చికొని జనకమహారాజు, శ్రీరామునితో గూడ రావలసినదని విశ్వామిత్రుని బిల్వ నాజ్ఞాపించి వారురాగా, గౌరవించి ఓ మునీంద్రా మీకేది ఇష్టమో తెల్పుడు. నేను దానినాచరించెదను. అనిఅడుగగా మునీంద్రుండిట్లు చెప్పదొడగెను.

"ఓ రాజా! వీరలు దశరథమహారాజు యొక్క కుమారులు. సూర్యవంశమున కలంకారమైనవారు. గొప్పవీరులు జగమున ప్రసిద్ధిపొందినవారు. నీ ధనువును జూడ గోరుచున్నారు. దానిని జూపింపుము. దానిని జూచి కృతార్థులై ఈ కాకుత్థ్సవంశ్యులు యథేచ్ఛముగా వెడలుదురు" అనగా విని జనకుడిట్లనెను.

ఓ మునిచంద్రమా! వినుము. ఈ విల్లిచ్చట నుండుటకు హేతువును వినిపించెదను. మా వంశకర్తయగు నిమికి ఆఱవతరము వాడు దేవరాతుడను రాజుండెను. అతడు మహాప్రభావము గలవాడు. నిర్మలుడు. దేవతలతనికడ ఈ వింటినుంచిపోయిరి. దక్షాధ్వరమును ధ్వంసము చేయునప్పుడు రుద్రుడు దేవతలను జూచి కోపముతో మీ యజ్ఞభాగములను మీరు తీసికొని నా భాగము నాకెందుకీయలేదు? ఇదిగో ఒక దెబ్బకు మీ శిరస్సుల నీవింటితో బలి చేసెదననెను. అప్పుడు దేవతలు దైన్యముతో వేడుకొనగా క్షమించి పన్నగ భూషణుడు వారికి ఈ ధనువు నిచ్చెను. వారు దానిని నావంశ పూర్వుడైన దేవరాతున కిచ్చిరి. నాటినుండియు నిది నాయింట నుండి యర్చింప

బడుచున్నది. యజ్ఞము చేయు తలంపు గలిగి భూమిని దున్నించుచుండగా నొక బాలిక నాగటిచాలులో గన్పించినది. నేనా చిన్నారికి సీతయని పేరిడితిని. పుణ్యచరిత్రయు, పవిత్రయు అయోనిజగా జన్మించినదిగాని సామాన్యమైనది కాదు సుమా. ఈమెను నేను కన్నకూతురుగానే పెంచితిని. వీరులయొక్క సొత్తుగా నిర్ణయించితిని. ఎందరో రాజులువచ్చి మాకీ కన్యనిమ్మని వేడిరి. కాని నేను వారితో ఇట్లుంటిని. “ఈ విల్లు నెవ్వరెక్కుపెట్టగలరో వారికే నా కుమార్తె నిచ్చెదను. అంతే గాని వీర్యశుల్కయగు నీ కన్యను సారహీనుడగు వానికీయను.” అనగా విని ఎందరో రాజులు విల్లు చూడవచ్చిరి. కాని వారెవ్వరు వింటికొప్పునకు నారి తగిలించుటట్లుండ దానినెత్తనేలేకపోయిరి. ఆ సమూహమంతయు వట్టి గొప్పలు చెప్పుకొను వారేకాని శూరులుకారని తెలిసి కన్యనివ్వననగా వారు మిథిలాపట్టణమును చుట్టుముట్టిరి. నేను వారిని లక్ష్యపెట్టలేదు. వారందరు కలిసి చాలా బలముతో కూడివచ్చిరి. ఒక ఏడాది వారితో పోరాడితినిగాని, రణమున నా బలము సన్నగిల్లెను. ఎంతయో విచారించి గొప్ప తపస్సుచేసి దేవతలను తృప్తినొందించితిని. సంతోషించి వారు చతురంగబలములను ఈయగా విజృంభించి మహాయుద్ధమున వీరులమని విర్రవీగు వారినెల్లర చెండాడగా వారు పారిపోయిరి. ఆ ధనుస్సే ఇది. అనఘశీలా! దానిని రామ లక్ష్మణులకిప్పుడే చూపించెదను. ఈ రాముడు వింటి నెక్కుపెట్టినచో అయోనిజయగు సీతను ప్రేమతో రామునకిచ్చెదను.



# అఱువది యేడవ సర్గము

**ఆ** జనకుని మాటలువిని, ముని ధనువును జూపుమన రాజు మంత్రులను జూచి విల్లుగొని తెండని యాజ్ఞాపించెను. వారును వేగముగ నంత:పురికేగి, మహాబలాఢ్యులు మహాకాయులు నగు ఐదువేల మంది భటులచే ఇనుపపెట్టెలో నున్న ధనువును తెప్పించి దేవతలతో సమానమైన తేజస్సుతో వెలుగుచున్న రాజుతో "రాజా! ధను:శ్రేష్ఠమును దెచ్చితిమిచూడు" మనిరి.

## జనకుడు రామలక్ష్మణులకు వింటిని జూపుట

ఆ మాటలను విని జనకుడు వింటిని జూచి లేచి చేతులు జోడించి, మౌనిని, రామలక్ష్మణులను చూచి "ఓ ముని చంద్రమా! ఇదియే మా వంశ పూర్వులచే పూజింపబడిన విల్లు. దీని నెక్కుపెట్టలేక ఎందరో మహాబలవంతులు భంగపడి తమ యభిమానములను గోల్పోయిరి. రాజులమాటలకేమి? దేవతలు రాక్షసులు యక్షకిన్నరలు కూడ ఎత్తజాలరనిన ఎక్కుపెట్టుటెక్కడ? నీ కిష్టమేని యీ వింటిని రామలక్ష్మణులకు చూపించుము." అని పల్కెను. ఆ వాక్యములను విని విశ్వామిత్రుడు మోదముతో రాముని జూచి, వత్సా! రాఘవా! చూడమీకోదండమును అనిన రాముడు ముని మాటలచే ప్రేరిపితుడై ధనువున్న పెట్టె యొద్దకు వెళ్ళి మూతదీసి చూచి, మునివరా! ధనువును చూచితిని, ముట్టుకొంటిని నీ వాజ్ఞయిచ్చిన భయపడక వెలుపలికిదీసి ఎక్కుపెట్టెదననగా అట్లే కానిమ్మని జనకుడును గాధినందనుడును ప్రేమతో బలికిరి.

## శ్రీరాముడు హరువిల్లు విఱుచుట

వెంటనే దశరథనందనుడు ఊరక అవలీలగా చాపము నఱచేతితో దీసి

రాజులు చూచుచుండగా వింటినారిని బిగించి ఎక్కిడబోగా ఆబలమేమని చెప్పవలెను. విల్లు ఫెళ్లుమని విరిగెను. పిడుగుపాటువలె ఆధనుస్సునుండి పుట్టిన శబ్దము భరింపరానిదై యుండ భూమి ఎక్కువగా వడకెను. పర్వతములు మహాధ్వనితో బీటలు వారెను. రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు, జనకుడు తప్ప తక్కిన వారెల్ల దిమ్మరపోయిన మనస్సులతో తెలివిదప్పి బొమ్మలవలె భూమిపై నొరగిరి. సభ్యులెల్లరు తేరుకొనిన తరువాత భయము తొలగి జనకమహారాజు మునిశ్రేష్ఠుని జూచి కేలుమోడ్చి "మునీంద్రా! రాఘవుని అద్భుతమైన భుజశక్తిని జూచితిని. మహాద్భుతముగా వింటిని విరచెను. చూడగా నిదియసాధ్యమైన పనిగాని సామాన్యమైన పనిగాదు. మా సీతచే నేను, రామచంద్రుని భర్తగా పొందుటచే సీతయు ధన్యులమైతిమి. నా ముద్దుల కూతురైన సీత దశరథ తనయుడైన రాముని జనులెల్లరెరుగ పతిగా బడసి మా జనకవంశమునకు కీర్తిని తెచ్చినది.

### జనకుడు దశరథునొద్దకు దూతలను బంపుట

మునీంద్రా! నాసుత వీర్యశుల్కయని నేననిన మాటలు ఫలించినవి. నా జీవితమునకంటె మిన్నగా ప్రేమపాత్రమైన భూపుత్రిని సద్గుణసముద్రడైన రామచంద్రునకిచ్చెదను. నీ యనజ్ఞయైనచో ఇప్పుడే నా మంత్రులు కోసల దేశమును వెళ్లెదరు. (15వ నాటి వృత్తాంతము) వెడలి యచ్చట "ఓ దశరథ మహారాజా! నీ కుమారులు విశ్వామిత్ర రక్షితులై మా పట్టణమునకు వచ్చిరి. రాముడు శంకరధనుస్సును సభలోని వారెల్ల చూచుచుండగా ఎక్కుపెట్టి విరిచెను. వీర్యశుల్క యగు తన తనూజను నీకుమారునకీయదలచి మా మిథిలానగరాధిపతి యగు జనకుడు మమ్ము మీ యొద్దకు పంపెనని చెప్పి మీరు రావలెనని మారాజు వేడుచున్నాడని విన్నవింతురు." అని జనకుడు పల్కెను. ముని సరేయనగా దశరథునికి విన్నపము చేయుటకు తన మంత్రులను పంపెను.

# అఱువది యెనిమిదవ సర్గము

**రా**జుచేత పంపబడిన దూతలు, గుఱ్ఱము లాయాసపడునంతగా పరువు లెత్తించుచు మూడుదినములు ప్రయాణముచేసి, నాలుగవ దినమున దశరథుని పట్టణమును జూచిరి. (19వ దినము) ద్వారము నొద్ద కావలియున్న భటులను జూచి జనకమహారాజు యొక్క దూతలము వచ్చితిమని మీ రాజునకు దెల్పుడనగా వారలు వెళ్లి చెప్పివచ్చి మారాజు తొందరగా మిమ్ములను రమ్మనెనని చెప్పగా వారలు లోనికేగి వృద్ధుడును, దైవసమానుడగు నగు దశరథుని జూచి నిర్భయముగా చేతులు జోడించి మంచిమాటలతో, ఓ రాజశేఖరా! జనక మహారాజు సర్వులతో, పురోహితులతో, మంత్రులతో, వహ్నులతో కూడ నీ యొక్క క్షేమమును తెలిసికొన గోరుచున్నాడు. ఇంకొక వార్త గాధినందనుని యంగీకారముతో ఆరాజు ఇట్లు మనవి చేయుచున్నాడు. వినవయ్యా ! దశరథమహారాజా ! నా కుమార్తె వీర్యశుల్కయని మున్నేప్రతిన చేసితిని. ఎందరో రాజులు నా కుమార్తెను వరింపవచ్చి నేనిడిన విల్లునెత్తలేక వెనుదిరిగిపోయిరి. అనుకొనకుండ గాధేయునితో గలసి వచ్చిన నీసుతులు సీతను గెల్చుకొనిరి. సభవారందరు చూచుచుండగా రాముడు వింటిని రెండుగా విరిచివేసెను. కాన మహాత్ముడైన రామునకు వీర్యశుల్కగా నిర్ణయించిన నా కుమార్తెను భార్యగా నీయగోరుచున్నాను. అట్లొనర్చుటకు సెలవొసంగుడు. కొడుకులను జూడ వచ్చును. సంతోషమును పొందవచ్చును. నేనడిగిన కోర్కెదీర్పవచ్చును. కాన పురోహితులతో, హితులతో, మంత్రి సమూహముతో దేవేరులు గొలుచుచుండగా

ఆలసింపక మా పట్టణమునకు రమ్ము. మిక్కిలి ప్రీతితో నీ కుమారులను చూచుకొనుము" అని చెప్పి సందేశహరులు విరమింపగా, రాజు వామదేవుడు, వసిష్ఠుడు మొదలగు మునులను, మంత్రులను చూచి మహానందముతో నిట్టనెను. గాధిజునిచే రక్షితుడై కౌసల్యాతనయుడు లక్ష్మణునితోగూడి మిథిలా పట్టణమున నున్నాడట. రాముని యొక్క గొప్పదైన పరాక్రమమును జూచి జనకరాజు తన కుమార్తెనిచ్చుటకు సమ్మతించెనట. జనకుని సందేశమిది. మీ కందఱకిష్టమైనచో అక్కడికి తరలి వెళ్లుదము. అనగా మంత్రులందఱు ఇది తగినదని పల్క, రాజు సంతుష్టిని పొందినవాడై రేపే బయలుదేరి వెళ్లుదమని మంత్రులకు జెప్పి జనకుని మంత్రులకు వారు సంతోషించునట్లుగా బహుమతుల నిచ్చెను. ఆ రాత్రి మహానందముగా గడచెను.



# అఱువది తొమ్మిదవ సర్గము

**ఉ**దయముననే రాజు సభ తీర్చి చుట్టాలు, మౌనులు కొలువుగా సుమంత్రుని జూచి ఇప్పుడే ధనమును కుప్పలుగా దీసికొని కోశాధిపతులు తరలవలెను. చతురంగ బలములు వేగముగా పంపుము. వెంటనే పల్లకీలు సిద్ధము చేయింపుము. వామదేవుడు, బ్రహ్మపుత్రుడైన వసిష్ఠుడు, జాబాలి, కాశ్యపుడు, మార్కండేయుడు, కాత్యాయనుడు, ముందుగా వెళ్లవలెను. నాకొక రథము సిద్ధము చేయింపుము. ఈ దూతలు తొందరపెట్టుచున్నారు. ఆలస్యము తగదు. అనగా సుమంత్రుడు రాజాజ్ఞచొప్పున సర్వసైన్యమును పంపించి ఋషులకు రథములేర్పాటుచేసి దశరథునకు తెలిపెను. దశరథుడును మునులు, మంత్రులు, రాజులు తన్ను వెంబడింపగా ఇంద్రునివలె వెడలి ఐదవదినమున విదేహ రాజ్యమును చేరగా, సంతోషముతో జనకుడు వచ్చి దశరథుడు సంతోషించునట్లు పూజించెను.

## జనకుడు దశరథునితో కుశలప్రశ్నలు సేయుట

ఓ రాజచంద్రమా! నీకు స్వాగతము. నా భాగ్యముపండి వచ్చితివి. సూర్యవంశములో పుట్టినవాడా ! కన్నకుమారుని శౌర్యము వలన వచ్చిన సంతోషము ననుభవింపుము. నా అదృష్టమున నిన్నుచూచు పుణ్యము కలిగినది. నాభాగ్యము చేత మునులతో గూడిన వసిష్ఠుని చూడగల్గితిని. నా పుణ్యముచేత విఘ్నములన్నియు పిండి పిండియైపోయెను. నా పుణ్యముచేత సూర్యవంశపు

రాజులతో వియ్యమందుచున్నాను. మహాపరాక్రమవంతులైన మీ సంబంధము వలన మా వంశము పూజ్యమయినది. దశరథమహారాజా! నీదయచే నా కోర్కెలెల్ల తీరినవి. రేపు ఉదయమున హెూమాదికృత్యములయిన తరువాత పరమఋషుల సమ్మతితో విధివిహిత రీతిగా పరిణయము జరిపింపుమని పల్కిన జనకునితో అజనందనుడగు దశరథుడిట్లనెను. "రాజా ! ఇచ్చువారిని బట్టి పుచ్చుకొనుట యుండునని పూర్వము వినియుంటిని. కాన నీవెట్లుచెప్పిన నట్లేనేను నడచెదను. నేను పరుడునా?" కీర్తికరము, ధర్మయుక్తమునగు నా రాజుమాటలకు జనకు డాశ్చర్యమందెను. వచ్చిన మునిసమూహము ఆ రేయి సుఖముగా గడపెను. దశరథుడును కుమారులతో సుఖగోష్ఠి నుండెను. జనకుడును తన యజ్ఞమును పూర్తిగావించి తన పుత్రికలను పెండ్లికుమార్తెలను జేసెను.



# డెబ్బదియవ సర్గము

**జ**నకుడు తెలతెలవారుచుండగా లేచి నిత్యకర్మలను జరిగించి తన పురోహితుడగు, శతానందుని జూచి ధర్మశీలుడైన నా చిన్నతమ్ముడు సాంకాశ్య పట్టణమును ఇక్షుమతీ జలంబులను గ్రోలుచు నేలుచున్నవాడు. కుశధ్వజుడను పేరు గలవాడు. వానిని చూడవలెనను కోర్కె నాకు గలిగినది. అతడీ యజ్ఞము నన్నివిధముల రక్షించినవాడు. ఈ వేడుకను నాతోబాటుగా నా సోదరుడు కూడ ననుభవింపవలెనని ఆశనాకు గలదు. అందుచే అతనికి వార్తాహరుల పంపవలెనని పలికి వెంటనే కొందఱు వేగవంతులగు వార్తాహరులను బంపెను. రాజుయొక్క ఆజ్ఞచే వారు వేగముగా బోవు గుఱ్ఱములనెక్కి ఆలస్యము లేక ఇంద్రుని యాజ్ఞచే విష్ణువును గొనివచ్చు దేవతలవలె వెళ్లి ఈ వార్తను కుశధ్వజునకు దెలుపగా, అన్నగారు రమ్మన్నారను వార్త వినగానే మిథిలకు వచ్చినవాడై అన్నకును బురోహితునకును నమస్కరించి ఒక యాసనమున గూర్చొనెను. అన్నదమ్ములిద్దఱును నిట్లాసనముల మీద గూర్చొన్నవారై మిక్కిలి ప్రీతితో సుదాముడను మంత్రిని బిలిచి "ఓ మంత్రి సత్తమా! నీవువెళ్లి పురోహితులతో, బంధువులతో, మంత్రులతో, పుత్రులతో సహితముగా దశరథ మహారాజును దీసికొనిరమ్ము" అని చెప్పగా, వెళ్లి రాజును జూచి నమస్కరించి చేతులు జోడించి పురోహిత సచివ బంధుపుత్రులతో సహితముగా మిమ్ములను చూడ జనకమహారాజు కోరుచున్నాడు. అని చెప్పగా దశరథుడు ఋషులతోను, నిజబంధు వర్గముతోను, జనకుని వద్దకు వెళ్లి అతనితో నిట్లనెను. జనకరాజా!

ఈ వసిష్ఠుడిక్ష్వాకు వంశమునకు దైవము. ఈ యుత్తమశీలుడు గొప్ప వక్త. మహాశక్తి సంపన్నుడు. గాధిజుడు మొదలుగా గల మేధావులగు నీమును లెల్లరనుమతించిన మా వంశవిధము నిస్సంశయముగా చెప్పగలడు అనిపలికి మౌనము వహింపగా, మౌని హిత పురోహితులతో గూడియున్న మిథిలానాథుని గనుగొని ఇట్లు చెప్పదొడగెను.

## వశిష్ఠుడు జనకునితో సూర్యవంశక్రమము తెల్పుట

అవ్యక్తమునుండి జనించిన వాడును, నిత్యుడును అవ్యయుడును నైన బ్రహ్మ మరీచిని గనెను. అతడు కశ్చపమునిని గనెను. కశ్చపునకు వివస్వంతుడు పుట్టెను. అతనికి మనువు పుట్టెను. మనువునకిక్ష్వాకుడు పుట్టెను. అతని యొక్క రాజధాని యయోధ్యాపురము. ఇక్ష్వాకుని కుమారుడు కుక్షి, కుక్షికి వికుక్షి జన్మించెను. వికుక్షికి బాణుడు, అతనికి అనరుణ్యుడు జన్మించెను, (రావణుని శపించిన రాజయోగి ఇతడే). అతని సుతుడు పృథువు. పృథువునకు త్రిశంకుడు పుట్టెను. అతని సుతుడు మహాబలవంతుడగు ధుంధుమారుడు. అతనికి యువనాశ్వుడను పేరు కూడ కలదు. అతని తనయుడు మాంధాతయనురాజు, మాంధాత సుతుడు సుసంధి. అతనికి ధ్రువసంధి, ప్రసేనజిత్తు అనునిద్దరు తనయులు గలిగిరి. ధ్రువసంధి తనయుడు భరతుడు. భరతుని పుత్రుడు అసితాఖ్యుడు. శత్రువులగు తాలజంఘ శశిబిందువులను హైహయవంశీయులు అతనిపై దండెత్తిరాగా యుద్ధమున నోడి అడవుల బడి మంత్రులతో గూడి పారిపోయి హిమవత్పర్వతమున భృగుప్రస్రవణమున నుండెను. అతని భార్యలిరువురు పూర్ణగర్భవతుయియుండిరి. అందొకతె ఎట్లో తనసవితి కాళిందికి విషముతో గూడిన భక్ష్యమునుబెట్టెను. ఒక్కనాడు భార్గవుడగు చ్యవనాఖ్య మునీంద్రుడు అచ్చటికి రాగా ఆ కాళింది మునీంద్రుని సమీపించి నాకు

కుమారుడు కల్గునట్లును గ్రహింపుమనుచు దండప్రణామమాచరించెను. అప్పుడు ముని ఆమెను జూచి ఓ సుందరీ! శోకమును పొందకుము. శౌర్యవంతుడగు పుత్రుని గాంచెదవు. గర(విష) సహితుడై పుట్టుటచే సగరుడను నామంబున నుండును. అని ఆశీర్వదించెను. తరువాత  కాళిందికి సగరుడు జన్మించెను. సగరుని కుమారుడు అసమంజుడు. అతనికి అంశుమంతుడు పుట్టెను. అతని తనయుడు దిలీపుడు. అతని సుతుడు భగీరథుడు. ఆ భగీరథునకు కకుత్థ్సుడు పుట్టెను. అతనికి రఘువు జన్మించెను. ఆ రఘువు యొక్క కుమారుడే ప్రవృద్ధుడు. అతనికి కల్మాషపాదుడను పేరుగలదు. అతని కుమారుడు శంఖణుడనువాడు. అతని సుతుడు సుదర్శనుడు. ఆరాజునకగ్నివర్ణుడు పుట్టెను. అతని సుతుడు శీఘ్రగుడు. అతని పుత్రుడు మరువు. అతడు ప్రశుశ్రుకుని, అతడంబరీషుని గనిరి. అంబరీషునకు నహుషుడు జన్మించెను. అతని సుతుడు ప్రఖ్యాతిగాంచిన యయాతి. అతని పుత్రుడు నాభాగుడు. నాభాగునకు అజుడు సుతుడయ్యెను. అతనికి దుర్ధర్షుడగు దశరథుడను ధన్యుడుదయించెను. ఆఘనునకు గొప్ప తేజముగల ఈ రామలక్ష్మణులుదయించిరి. వీరు వంశములను పావనము చేయువారును, ధర్మరతులును, సత్యైకరతులనునై యున్నారు. ఓ జనకరాజా! ఈ వీరులగు రామక్ష్మణులకు వారికి తుల్యసద్గుణవతులగు నీకుమార్తైలనిచ్చి వివాహము చేయగోరుచున్నాను. నా మనవి దీర్పుము.” అనగా విని జనకుడిట్లనెను.



# డెబ్బది యొకటవ సర్గము

## జనకుడు వసిష్ఠునకు నిజవంశ చరిత్ర చెప్పుట

"ఓ మునీంద్రా! మా వంశముయొక్క క్రమమును దెల్పెదను. వినవయ్యా! కన్యను దానముచేయువాడు మంచి వంశము వాడైనచో దనవంశమును గురించి చెప్పుట కర్తవ్యము. (శ్రీరామునిది యజుర్వేదము కాశ్యప గోత్రము. సీతాదేవిది ఆత్రేయ గోత్రము). మా వంశము యొక్క మూలపురుషుడు సద్ధర్మనిరతుడగు నిమియను నాతడు. అతని పుత్రుడు మిథి. అమ్మహాత్ముని చేతనే మిథిలాపురము నిర్మింపబడెను. (మిథిచేత కట్టబడుటచే మిథిలానగరమయ్యెను.) అతడు మావంశమున ప్రథమజనకుడని ప్రసిద్ధిగాంచెను. అతని సుతుడు ఉదావసువు. అతని తనయుడు నందివర్ధనుడు. అతనికి సుకేతుడును, ఆ రాజునకు దేవరాతుడును జన్మించెను. అతడు దేవతలతో సమానమైనవాడు. అతని సుతుడు బృహద్రథుడు. అతని పుత్రుడు మహావీరుడైన యనఘుడు. ఆతని పుత్రుడు సుధృతి. సుధృతి తనయుడు ధృష్టకేతుడు. ఇతనికి హర్యశ్వుడుదయించెను. ఇతడు మహాబలవంతుడు. హర్యశ్వునకు మరువు దయించెను. ధీరుడగు నా మరువునకు ప్రతీంధకుడు కలిగెను. అతనికి కీర్తిరథాఖ్యుడుదయించెను. అతని సుతుడు దేవమీఢుడు. అతని పుత్రుడు విబుధాఖ్యుడు. అతని తనయుడు మహీధ్రకుడు. ఇతని కుమారుడే కీర్తిరాతుడు. ఇతని సుతుడు శూరవర్యుడగు మహారోముడు. స్వర్గరోముడను వాడితని తనయుడు. ఇతనికి హ్రస్వరోముని కిరువురు పుత్రులు. అందు పెద్దవాడను నేను. నాతమ్ముడితడు. నా తండ్రి వనంబున కేగుచు నన్ను రాజుగా చేసెను. నేను పెద్దవాడనగుటచే చిన్నవాడైన

నాతమ్ముని నాకప్పగించెను. నాపేరు జనకుడు. నా తమ్ముడు కుశధ్వజుడు. నా తండ్రి స్వర్గమున కేగిన తరువాత నేనేతమ్ముని జూచుకొనుచు రాజ్యమేలు చుండగా, సాంకాశ్య దేశపు రాజైన సుధన్వుడు సరసిజాక్షియగు సీతను, శివుని విల్లును ఇమ్మని నాయొద్దకు దూతలబంపెను. నేనీయకపోవుటచే అతనితో భయంకరమగు యుద్ధము జరిగెను. ఆ సమరమునందు సుధన్వుని జంపి నా తమ్ముని సాంకాశ్యపట్టణమునకు రాజుగా చేసితిని. ఈతడే నా తమ్ముడు. నేను జ్యేష్ఠుడను. ఇదే రామలక్ష్మణులకు వీర్యమే శుల్కముగా స్త్రీలలో రత్నమువంటిదగు సీతను, ఊర్మిళను ఇచ్చెదను. ముమ్మాటికి నిచ్చెదను. ఇందు సందేహము లేదు. ఓ రాజా! నీ సుతులగు రామలక్ష్మణులకు గోదాన మంగళము చేయింపుము. నేడు మఖానక్షత్రము. నేటికి మూడవదినమున వివాహమును జరిపింపుము. ఓ రాజా! ఆ దినము ఉత్తరఫల్గునీ నక్షత్రము నీతనయులకు సుఖోదర్కముగ నుండును.



# డెబ్బది రెండవ సర్గము

**అ**ని జనకుడు చెప్పగా అంత గాధిసుతుండైన విశ్వామిత్రుడు వసిష్ఠునితో గూడి యిట్లు చెప్పెను. "ఓ అనఘా ఇక్ష్వాకు విదేహవంశములు ఊహాతీతమయిన గొప్పదనముగలవి. భూమియందు మీకు సమానులెవ్వరును గనరారు. సంబంధమందును, రూపసంపద యందును రామలక్ష్మణులకు సీతోర్మిళలకు తగియున్నది. మేమింకొక్కమాట చెప్పవలసియున్నది. నీ తమ్ముడును సద్ధర్మనిష్ఠుడునునగు ఈ కుశధ్వజుని కుమార్తెలను భరతశత్రుఘ్నులకు భార్యలుగా నిమ్ము. ఈ దశరథ తనములందఱును అందమును, భుజబలమునను, పరువమునను ఒక్కమాదిరివారే. దిక్పాలురంతటి బలవంతులు. లోకులచే మెప్పుబడసిన వారు. సరిసరియని జగత్తు మెచ్చుకొనగా సరిసమానమైన బాంధవ్యము మీకు కలుగును. మీరెండు వంశములు గలసినచో పొరిపొరిగా వృద్ధినందును" అనగా విని, జనకుడు ముని సింహులగు మీరు తుల్యవంశముతో సంబంధము జరుగునట్లు మీరే ఆనతిచ్చుట వలన మా వంశము పవిత్రము ధన్యమునయ్యెను. మహాత్ములారా వినుడు మిక్కిలి ప్రీతితో కుశధ్వజరాజుయొక్క కుమార్తెలను కైకకుమారునకు, వాని తమ్మునికి భార్యలుగా నిచ్చెదను. వీరందరకు నొక్కనాడే వేడుకమీర పెండ్లి చేయవచ్చును. నలువురు కోడండ్రను చూచి దశరథుని మనస్సు సంతోషమును పొందుగాక. మూడవ దినమున ఉత్తరఫల్గునీ నక్షత్రమగును. అప్పుడు వివాహము చేయుటమేలు. ప్రజాప్రతియగు

భగుడు దానికధిపతి గాన, విజ్ఞులు ఉత్తమమని యందురు గదా! మీ శిష్యుడను. మీ దయకు పాత్రుడను. మీరు పరమమైన ధర్మమును చెప్పితిరి. అని జనకుడు మునులతోను, మరియు దశరథునితోను ఇట్లనెను. “ఓ మునివర్యులారా! ఈ మూడు ఆసనముల నధిష్టింపుడు. ఈ మూడురాజ్యములు మీవికావా? దశరథనకీ రాజ్యమెట్లో, నాకయోధ్యయట్లే కనుక సందేహింపక మీరలు కార్యక్రమమునకు గడంగుడు. యధార్థ్వముగా వివాహములను చేయింపుడు.” అనగా పంక్తిరథుడు సంతుష్టుడై, అన్నదమ్ములు మీరలనంతములైన సద్గుణములు గల వారలు. కోటానుకోటులైన రాజులను, మునులను, పూజించిన వారలు కడుధన్యులు. ధరణినాయకా! నేను ఇంటికి వెళ్లివచ్చెదను. నాంది మొదలైనవి జరిగించవలెను గదా” అనెను. అప్పుడు వసిష్ఠుడును, కౌశికుడును వెంటరాగా దశరథ మహారాజు విడిదికి వెళ్లెను. ఈ ప్రకారముగా ఇచ్చి నలువురు పుత్రులతో గూడి దశరథుడు దిక్పాలురుతో గూడిన బ్రహ్మ మాదిరిగా నొప్పెను.



# డెబ్బది మూడవ సర్గము

## యుధాజిత్తు దశరథుని జూడ వచ్చుట

ఏదినమున గోదాన మంగళము (కేశఖండనము) జరిగించిరో ఆదినమున దశరథుని, భరతుని జూచుటకుగాను కేకయ రాజపుత్రుడును, దశరథుని బావమరిదియును, భరతుని మేనమామయునగు యుధాజిత్తు వచ్చెను. తండ్రి పంపున తన మేనల్లుడగు భరతుని తోడుకొని పోవవచ్చెను. అతనిని చూచి దశరథుడు తన మామగారి క్షేమమడుగగా యుధాజిత్తు అందరును క్షేమమేయని "నా తండ్రి తనకుమార్తెయొక్క సుతుడైన భరతుని చూడగోరి తీసికొని రమ్మని నన్నుబంపగా నేను నిన్నుజూడ నయోధ్యకేగితిని. అందరితో గలసి వివాహమునకై నీవిచ్చుటకు వచ్చుట తెలిసి నేనును పరుగున నిచ్చటికి వచ్చితిని." అని చెప్పగా విని దశరథుడు సంతోషముతో యుధాజిత్తును యధావిధిగా పూజించెను. దశరథుడారాత్రి కొడుకులతో గడవి, తూర్పుకొండ మీద భానుడుదయింపగా తొందరగా నిత్యవిధులాచరించి జనకుని యజ్ఞగృహమును బ్రవేశించును. అందమైన సొమ్ములను ధరించి, తమ్ములతోగూడి, మంచి ముహూర్తమున దీక్షాకంకణములు ధరించినవాడై, రామచంద్రుడు ముందుగా విశ్వామిత్రుడును, వసిష్ఠుడును తనతో నడువగా యజ్ఞశాలను ప్రవేశించెను. వేగముగావెళ్లి వసిష్ఠుడు జనకుని గాంచి యధావిధిగా పెండ్లికుమారులైన తనకుమారులతో దశరథుడిక్కడకు వచ్చి కన్యాదాతకై ఎదురు చూచుచున్నాడు. దాతయు ప్రతిగ్రహీతయు ఇష్టముతో ఒక చోటికి వచ్చినగదా! తదుపరి కార్యములు పూర్తియగుట. ప్రఖ్యాతినొందునట్లు వివాహములు జరిపింపుము.' అని పల్కగా ఆ రాజచంద్రుడు మునిచంద్రునితో నిట్లనెను.

'మునీంద్రా! ఇంకను ఆలస్యమెందులకు? ఇందు క్రొత్త వారెవ్వరు?

అడ్డువచ్చు వారెవ్వరు? ఎవరి ఆజ్ఞకొరకు చూచెదరు? ఇన్ని చెప్పనేల. ఈ భూమి యంతయును మీదేయని చెప్పితిని గదా! నా గృహమున మీకు జంకెందుకు? అలంకారభూషితలై అందమైన వధూవేషములతో నా కుమార్తెలు వేదిక కడ ప్రజ్వలించు అగ్నివలె సంతోషముతో నున్నవారు. ఇవే అన్నియు సిద్ధముగ నున్నవి. కుమార్తెలను వేదిక కడ నిలిపి మీకై ఎదురుచూచుచున్నాను. ఆలస్యమెందులకు? మీరందరు నా యందు దయతో పెండ్లి జరుగునట్లు చూడుడు." అని జనకుడు చెప్పగా దశరథుడు కుమారులను, మహర్షులను క్రతుశాలకు బంపించెను. వసిష్ఠుని జూచి సంతోషముతో మరల జనకుడిట్లనెను. 'ఓ మునీంద్రా! ఋషులతో గూడి నీవు జగన్మోహనాకారుడగు నీ రామునకు సొంపుతో తొందరగా వివాహప్రక్రియలను చేయించుము.' అనగా అట్లేయని వసిష్ఠుడు విశ్వామిత్ర శతానందులు తోడు రాగా, చలువపందిరిలో శాస్త్ర ప్రకారముగా వేదికను వేయించి, పుష్పములు, సువాసనద్రవ్యములు అలంకరించి – బంగారు పోలికలతో, మొలకలతో ప్రకాశించు ఛిద్ర కుంభములతో, చిగుళ్లతో నొప్పుచున్న మూకుళ్లతో, ధూపముతో గూడిన ధూమపాత్రములతో, స్రుక్ స్రువములతో, ఆర్ఘ్య పాత్రలతో, పేలాల పాత్రలతో, అక్షతపూర్ణ పాత్రలతో వేదిని నింపెను. మంత్రపూర్వకముగా దర్భలను పరచి యథావిధిగా వేదియం దగ్నిని ప్రజ్వలింపజేసి యందు హోమము చేసెను.

## శ్రీ సీతా కల్యాణ ఘట్టము

అంత సంతోషముతో జనకరాజు అగ్నిహోత్రుని కెదురుగ సర్వాభరణము లతో అలంకరింపబడిన సీతాదేవిని శ్రీరాముని కభిముఖముగా నిలిపి రామచంద్రునితో నిట్లనెను. "ఈ సీత నా యొక్క కుమార్తె. నీ సహధర్మచారిణి గా గైకొనుము. కౌసల్యాకుమారా! నీకు శుభము కలుగును. ఈమె పాణిని (హస్తమును) నీ పాణితో గ్రహింపుము. పతివ్రత, మహానుభావురాలు నగు ఈ సీత నిన్నెప్పుడును విడచి యుండదు. నీ వెంట నీ యొక్క నీడవలె నుండును. అని చెప్పుచు మంత్రపూతములగు జలములను జనకుడు రామచంద్రుని చేతిలో

ధారవోసెను. ఇది లోకములకు చాలా మేలు అని దేవతలు ఋషులు మెచ్చు కొనిరి. మనస్సులలో నిండైన సంతోషముతో అందరు ఉప్పొంగిపోయిరి. దేవతలు పువ్వుల వాన కురియించిరి. పెద్దధ్వనితో దేవతలు దుందుభులు మ్రోగించిరి. ఇంద్రుడు మొదలగు వారందరును శోకమును, దైన్యమును విడిచిపెట్టిరి. ఈ ప్రకారము మంత్రములతో, పవిత్రమైన జలములతో ధారా పూర్వకముగా భూపుత్రియైన సీతను రామునకిచ్చి మఱియు జనకుడు సంతోషముతో నిట్లనెను. (26వ దినము సీతాకళ్యాణము) లక్ష్మణా! రమ్ము ఊర్మిళాదేవిని ప్రేమతో నొసగెదను. దానముగా గైకొనుము. ఈమె చేతినందు కొనుము. శుభమగును. ఇంక ఆలస్యమెందులకు? అని చెప్పి జనకమహారాజు భరతునిదెస జూచి మాండవి యొక్క చేతిని గ్రహింపుమని చెప్పి శత్రుఘ్నుని శ్రుతకీర్తిని చేకొనుమని ప్రేమతో పలికెను. మీరందరు సౌమ్యులు. సుందరులగు ఈ భార్యలతో ఆచారములను నడపుకొనుడని చెప్పి విరమించెను.

ఈ ప్రకారముగా చెప్పిన జనకరాజు మాటలనువిని తమగురువైన వసిష్ఠుని ఆజ్ఞపొంది నలువురును తమతమ పత్నులచేతులను పట్టుకొన్నవారై భక్తితో అగ్నికి, వేదికలకు నమస్కరించి, ప్రేమతో దశరథ, జనకులకు వందనము చేసిరి. వివాహేము యధావిధిగా వైభవముగా జరిగెను. పూలవాన కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. దేవకాంతలు నాట్యముచేసిరి. గంధర్వులు పాడిరి. సమూహముగా దేవతలు ఆకసమున నిండియుండిరి. వాద్యధ్వనులు చెలగు చుండగా సంతోషముతో రామ,లక్ష్మణ,భరత, శత్రుఘ్నులు భార్యలతో అగ్నికి ముమ్మారు ప్రదక్షిణించి, తమ విడుదులకు జనిరి. దశరథుడును చుట్టములతో మునులతో కలసి విడిదికి వెడలెను.



# డెబ్బది నాలుగవ సర్గము

**వే**కువనే లేచి దశరథ మహారాజుయొక్క సమ్మతిని పొందినవాడై రాజకుమారులైన రామలక్ష్మణ భరత, శత్రుఘ్నులను బాగుగా దీవించి, విశ్వామిత్రుడు హిమవత్పర్వత సమీపమునకు వెళ్లెను. అట్లు విశ్వామిత్రుడు వెళ్లగా, దశరథుడు జనకుని జూచి మేము తిరిగి అయోధ్యకు వెళ్లుటకు సెలవిచ్చెదరా? అని అడుగగా జనకరాజు ప్రఖ్యాతి కల్గునట్లుగా తనగారాబు కుమార్తెలకొక్కరికి లక్ష లక్షగోవులను, మేలి వన్నెలు దిద్దిన నేతకంబళ్లను, మంచివైన దుకూలములను, సాలంకారలయిన దాసీ జనంబులను, కాంతిమంతములగు రథములను, ఏనుగులను, వడిగా పోవు గుఱ్ఱములను, పౌరుషముగల భటులను శ్రేష్ఠములగు మౌక్తికములను బంగారమును, పగడములను అరణముగా నొసగెను. ఈ ప్రకారముగా కుమార్తెలను బంపి తాను గూడ కౌసల్యాపతిని కొంతదూరము సాగనంపి, వారి యనుమతితో తన ఇంటికి జనకరాజు వెళ్లెను. ఆరామచంద్రుని సౌకర్యమును, అందమును, గొప్పదైన గాంభీర్యమును శౌర్యమును జూచి ఆ పురస్త్రీలు మెచ్చుకొనుచు నిట్లనిరి. "ఇతడేనటే యుద్ధరంగమున తాటకిని జంపిన మేటి విలుకాడు. ఇతడేనటే విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించిన వాడు. సుబాహుని జంపిన బిరుదుగలిగిన వాడు. వీడెనా గౌతము సతిశాపమును దీర్చి స్త్రీగా జేసినవాడు. ఇతడేనా మనయూరి రాజు దాచియుంచిన గొప్పదైన వింటిని విరచిన వీరశిఖామణి. ఇతడా నిన్న మనసీతను బెండ్లియాడి సంతోషముతో నన్న అందమైనవాడు. ఔరా ! ఈ రాముని నల్లునిగ పొందగలిగిన మనరాజు

జనకుడెంతటి పుణ్యాత్ముడోగదా! ఆహా! ఏమినోములు నోచెనో కౌసల్య ఈ రాముని తనకడుపున కనుటకు ఈ రాముని భర్తగా పొందుటకు మనసీత ఏమితపస్సును నిష్ఠతో జేసినదో గదా! ఈతని నల్లునిగా బొందుటకు జనకుడేమి జపములను చేసెనో తమకీతడు రాజై పరిపాలించుటకు ఆయోధ్యావాసులు ఏమి తపస్సుచేసిరో! ఓ యింతులారా! ప్రతినిత్యము శ్రీరామభద్రుని కన్నుల కరవుదీర గాంచుటకు అయోధ్యావాసులు ఏ నియమములను పాటించిరో గదా! ఆయయోధ్య పుణ్యతీర్ధమును బోలియున్నది. ఓ ఇంతులారా! ఇంక నొక్కమారైనను ఈ సుందరాకారుని జూడగలమా? ఓ సుందరులారా! ఈ తామరరేకులవంటి కన్నులు గలిగిన రాముని మఱల నొక్కమారైన కాంచ గలమా? చూడగలమా మరొక్కమారైన నల్లకలువల పోలుశరీరచ్ఛాయగల యీ రాముని, ఈ కాంతామనోహరుని ఇంకొక్క మారైన దర్శింపగలమా? ఓ సుందరులార పూర్వజన్మమున నేమిపుణ్యము చేసితిమో ఈ దినము నిండుగా కన్నులపండువుగా ఈ రామచంద్రుని జూడగలిగితిమి.

## దశరథునకు మార్గము నందపశకునములగుట

దశరథుడు నిండు మనసుతో తనకుమారులు కోడండ్రు ముని సంఘములు వెంటరాగా అయోధ్యకు జనుచుండ, మార్గమున కొన్ని ఘోరదృశ్యములు కనబడెను. పక్షులు తీక్షణముగా కూయుచు నక్షత్రపథంబున బోదొడగెను. ఆక్షణముననే మృగములు గుంపులుగా చుట్టుతిరిగి పరువెత్తజొచ్చెను. వానినన్నిటిని జూచి దశరథుడు భయముతో మునీంద్రా ! యిది యేమి యని వసిష్ఠమునీంద్రునడుగగా మునీంద్రుడు పక్షి కూతలచే పెద్దకీడు సూచింప బడినను భయపడకుము. మృగములు ప్రదక్షిణముగా పోవుటచే ఆపదలేదని సూచింపబడినది. అని పల్కునంతలో చూచువారల గుండెలు జల్లుమను నట్లు గాలి సుడివడి విపరీతముగా వీచెను. భూమి కంపించెను. చెట్లు నేలవ్రాలెను. దండిగా చీకట్లు గ్రమ్మి, సూర్చుని గప్పివేసెను. ఏదిక్కుఏదో తోచనిదయ్యెను.

భూమినుండి దుమారము లేచి రాజు యొక్క సేనలను గప్పివేసెను. సేన యంతయు తెలివిదప్పి నివ్వెఱపాటు చెంది ఏమి చేయుటకును దోచక నిలిచి పోయెను. అయ్యో ఏమని చెప్పవచ్చును. ఆ సమయమున నక్కడ దశరథుడు అతని కుమారులు, మునులు తప్ప తక్కినవారందరు తెలివి దప్పి నిశ్చేష్టులై యుండిరి.

## పరశురాముడు శ్రీరాముని జూడవచ్చుట

ఆ కటికి చీకటిలో భయంకరుడును, భయమును గొల్పుతేజస్సు గలవాడును రాజులపాలిటి యముడును, దుర్ధర్షుడను మేరుపర్వతోన్నతుడను, కోపోద్రేకముచే ప్రళయకాల వహ్నివలె జ్వలించుచున్నవాడును, జనుల కన్నులచే చూడశక్యము కాని వాడును, గొప్ప జడలుకలవాడును, విల్లుచేబూనినవాడను, ఆ పురహరుని బోలిన వాడును అగు భార్గవుడు మహాటోపముతో, భుజమున నున్న గండ్రగొడ్డలి కాంతులు అందరును గ్రుడ్డివానినిగా చేయుచుండ, మదించిన ఏనుగు వంటి నడకతో భూమి ధంధం అని శబ్దించునట్లు వచ్చెను. ఈప్రకారముగా వచ్చిన పరశురాముని జూచి వసిష్ఠుడు చెప్పుకొనదొడగిరి. 'తనతండ్రినొక క్షత్రియుడు చంపెనను కోపముచే ఈ సచ్చరిత్రుడగు పరశురాముడు రాజసమూహములను సంహరించి తరువాత మాను కొనెనుగదా.

ఇప్పుడు మరల రాజులను చంపునా? అట్టి కోరికలు లేవు గదా' అని తమలో దాము అనుకొనుచు మునులు 'ఓ పరశురామా! ఇదే అర్ఘ్యము గొనుమని మధురముగ పల్కుచునీయగా పుచ్చుకొని దశరథుని కుమారుడైన రామునితో జమదగ్నిసుతుడగు పరశురాముడిట్లు పల్కెను.



# డెబ్బది యైదవ సర్గము

**“ఓ** రామా! దశరథ కుమారా! నీ యద్భుతమైన బలమును విన్నాను. నీవు బలముతో శంకరధనుస్సును విరుచుటను, భూమియందంతటను చెప్పగా వింటిని. ముక్కంటి విల్లు విరుచుటనగా అద్భుతము. ఊహింపశక్యము గానిది. అది విని నేనుకూడ నీ గొప్పదనమును జూచుటకు వేఱొక గొప్పధనుస్సును తెచ్చిన వాడను. ఇదిగో జమదగ్ని కుమారుని యొక్కధనుస్సు. ఇది చూడగానే గుండెలదరును. దీనియందు జాగ్రత్తగా శరమును సంధించి నీ యొక్క గొప్పబలమును పరాక్రమమును చూపింపుము. ఈ వింటిని నీవెక్కుపెట్టుటను చూచి నీతో తరువాత ద్వంద్వ యుద్ధమును చేసెదను.” అనెను.

**దశరథుడు పరశురాముని శమింప వేడుట**

అయోధ్యాపతియగు దశరథుడు తన ముఖము వెలవెల పోవుచుండగా చిన్నబోయినవాడై పాదములు వణకుచుండగా మాటలు తొట్రుపడుచుండగా పరశురామునితో నిట్లుచెప్పెను. “ఓ మహానుభావా! కులమునకు బ్రాహ్మణుడవు. రాజులయందు క్రోధమును వదలి శాంతుడవైతివి గదా. ఇంద్రునితో నీవు శస్త్రములను పట్టనని ప్రతిజ్ఞచేసితివి గదా. నాయొక్క కుమారులయిన వీరు ఆటలాడుకొను వయస్సు గల బాలురు. తప్పులున్న వాటిని మనసుననుంచక కరుణించుము. మంచిస్వభావముగలవారు వేదాధ్యయన పరాయణులు నగు భార్గవుల వంశమున జన్మించిన నీకు కోపగించుకొనుట తగునా? ఈ భూమినంతను కాశ్యపునకు దానము చేసి ధర్మమును దప్పక మహేంద్రపర్వతమే యిల్లుగా నిలిచితివి. ఇట్టినీకిట్లు కోపగించుకొనుట తగునా? ఓ మునీంద్రా!

నా కోరికలనెల్ల నాశనముచేయ మేమందఱమును వానితో జచ్చువారమే. అని దశరథుడు చెప్పుచున్నను ఆ మాటలను లక్ష్యపెట్టక వీరుడగు భార్గవరాముడు రామునితో నిట్లు పలికెను. “రామా! వినుము. ధనుస్సుల యొక్క చరిత్రను చెప్పెదను.

## శైవ వైష్ణవ ధనుస్సుల వృత్తాంతము

ఈ రెండు ధనుస్సులు గొప్పబలము గలవి. దివ్యములు, శ్రేష్ఠములు దృఢమైనవి, కలవు. వీనిని విశ్వకర్మ గట్టిప్రయత్నముతో తయారుచేసెను. అందొకదానిని త్రిపురాసుర సంహారమునకై దేవతలు శివునికిచ్చిరి. నీవు విరిచిన విల్లదియే. చూడు నాయొద్ద యున్న ధనుస్సు విష్ణువుది. ఇది కూడ మహాశక్తి గలది. బలాతిశయమున నిది శైవధనువునకు దీటైనది. కొంతకాలము తరువాత దేవతలు బ్రహ్మదగ్గరకు వెళ్లి విష్ణు మహేశ్వరులలో నెవరు మిక్కిలిబలము గలవారని అడిగిరి. అంత బ్రహ్మ వారి యుద్దేశము నెఱిగినవాడై రమాభర్తయైన విష్ణునకును, ఉమాదేవి భర్తయైన శివునకును విరోధమును బుట్టింపగా, ఆ విష్ణుశంకరులకు మహాభయంకరమగు యుద్ధము జరిగెను. చూచువారలు వింతపడునట్లుగా వారిరువురికి పరస్పర జయేచ్ఛతో యుద్ధము సాగెను. విష్ణుమూర్తి యొక్క భయంకర హుంకారముచే శివుని ధనువు చిట్లిపోయెను. త్రిలోచనుడగు శంకరుడేమియును చేయలేనివాడయ్యెను. నాకవాసులైన దేవతలు, మునులు, చారణులు మొదలగు వారది చూచి విష్ణువును, శివుని నధికముగా స్తోత్రములు చేయగా వారలాయుద్ధమును మానుకొనిరి. విష్ణువు హుంకారమునకు శివధనుస్సు పెటలి పడుటచే దేవతలు మునులు విష్ణువే అధికుడని తమయెదలో భావించిరి. కోపముతో శివుడా వింటిని బాణముతో గూడ దేవరాతున కొసగెను. ఇది వైష్ణవమగు శరాసనము. దీనిని విష్ణువు భృగువంశజుడైన ఋచీకుడను ఋషికిచ్చెను. అతడు లోకవిఖ్యాతి గాంచిన తన పుత్రుడైన జమదగ్నికిచ్చెను. అతడే నా తండ్రి. అతడు శస్త్రములను

వదలినవాడై తపస్సుచేయుచుండగా, మధించినవాడై కార్తవీర్యార్జునుడు నీచమానసుడై సంహరింపగా, దారుణమైన నా తండ్రి వధవార్త విని నా యెదలో క్రోధమతిశయించెను. దానితో క్రూరముగా పెక్కుమారులు రాజులందఱను జంపివేసి, భూమినంతను క్రతు సమాప్తివేళ కశ్యపునకు దక్షిణగా నొసగి నేను మహేంద్రపర్వతమును నివాసముగా జేసికొని సుఖముగా తపస్సు చేయు చున్నవాడను. ఇప్పుడు నీవు ఎక్కువైన బలముతో హరుని విల్లు విరిచితి వని విని పరుగున నీ యొద్దకు వచ్చితిని. ఓ రామా! ఇదిగో నా యొద్దనున్నది వైష్ణవమైన చాపము.

నీ తండ్రి తాతల యొక్క క్షత్రియ ధర్మమును నిలబెట్ట దలచినవాడవైన ఈ ధనుస్సు నెక్కుపెట్టుము. అప్పును చూచెదను నీ భుజబలమును, ఎక్కుపెట్టి శరమును సంధించిన నీ తోడ ద్వంద్వయుద్ధమునకు నేనసహాయుడనై యుపక్రమించెదను. తొందరగా కానిమ్ము” అని పలికెను.



# డెబ్బది యాఱవ సర్గము

## శ్రీరాముడు పరశురాముని ధిక్కరించి నిస్తేజుని చేయుట

ఆ పరశురాముని మాటలు విని కోపించిన బుద్ధిగలవాడయ్యు దశరథ రాముడు, తనదగ్గర తండ్రియైన దశరథమహారాజుండుటచే గౌరవముతో సరళమైన స్వరములతో నిట్లుపలికెను. ఓ భార్గవరామా! ఏమంటివి? నీ యొక్క కథయంతయును విన్నాను. నీ తండ్రియొక్క ఋణమును దీర్చుట సరియైనదే యనుకొంటిని. నన్ను దుర్బలునిగా భావించితివి గదా. క్షత్రియధర్మమున బేల నంటివి గదా! నా తేజము నీవు తెలిసికొనలేవుగదా! చూడుము నా పరాక్ర మాతిశయమును చూపింతును. అని పరశురాముని చేతియందున్న భయంకరమైన ధనుస్సును దీసికొని ఎక్కుపెట్టి శరమును సంధించి కన్ను లెఱ్ఱవడగా కోపమతిశయింపగా భార్గవునితో నిట్లనెను. (వింటితోడనే పరశు రాముని తేజమును హరించెను. పరశురామావతారము ఆవేశావతారము. శ్రీరామావతారము పూర్ణావతారము. రెండు తేజస్సులొకచో చేరినపుడు తక్కువ తేజస్సు, ఎక్కువ తేజస్సుతో గలసిపోవును. ఇది అవతార తత్త్వము. (కావలసిన శ్రీకృష్ణావతార తత్త్వమును జూడుడు.) ఓ భార్గవరామా! నీవు బ్రాహ్మణుడవగుట చేతను, పైగా విశ్వామిత్రుని చుట్టమువగుటచేతను, ఇది నిన్ను జంపుటకు సాధనమైనను, నీపై వేయుటకు నామనస్సొప్పుట లేదు. నీయొక్క పాదములను గాని, నీ పుణ్యముచే ఆర్జింపబడిన పరలోకగతిని గాని, నీ యిష్టము ననుసరించి యిప్పుడే యీ బాణముతో ఖండించెదను. ఇది నిజము. ఇందులో నీకేది యిష్టమో తెల్పుము. శత్రునగర ధ్వంసకమగు వైష్ణవశరమిది వ్యర్థముగా నేరదు. సార్థకమయి లక్ష్యమును ఖండించనిదే పోదు. కాన అర్థింపుము. " అని పరశు రాముని శ్రీరాముడు తర్జించుచుండగా విపరీతమైన ఆశ్చర్యమును పొందుచు దేవతలు, మునులు ఆకాశమున నుండి చూచిరి. వీరుడును, భయంకరాకారు

డును, గొప్పచాపబాణములు ధరించినవాడునునగు దశరథనందనుని జూచుటకు చారణులు, కిన్నరులు మొదలగు వారితో బ్రహ్మ అచ్చటికి వచ్చెను. గొప్పదైన ధనువును పట్టిన పరాక్రమమును జూచి జగమంతయు ప్రాన్పడి యుండెను. భార్గవుడు గూడ చలనములేని వాడై వీర్యము నశించినవాడై రాముని జూచుచు బొమ్మవలె నిలిచెను. రామునిచేత పరాభవింపబడిన వాడై జమదగ్ని కుమారుడు బలములేనివాడై జడత్వమును గాంచి కమలములవంటి నేత్రములు గల రామచంద్రుని జూచుచు సగౌరవముగా మెల్లనిమాటలతో నిట్లుచెప్పెను.

**పరశురాముడు తన పుణ్యలోకములను గొట్టుమనుట**

నేను భూమినంతయును కశ్యపునకు దానముగా యజ్ఞదక్షిణగా నొసగితిని. ఆయన నన్ను తనదైన ఈ నేలపై రాత్రులందు నివసింపవద్దనెను. అందుచే నేను ఆ మహాత్ముని శాసనము నను సరించి రాత్రియందు నిలుచుటకు వీలుకాదు. నేను తొందరగా మహేంద్రపర్వతమునకు వెళ్లవలెను. నీవు నేనుచేసిన తపస్సు వలన లభించిన పుణ్యలోకములను గొట్టివేయుము. నేను నీ యెడల మరువలేని తప్పుచేసితిని. నీవు నాధనువును వంచి శరమును సంధించుటచే నీ పరాక్రమమును తెలిసికొంటిని. నీవు శాశ్వతుడవగు మధువిరోధివని మరచి నీ యెడ తప్పుచేసితిని. నన్ను మన్నింపుము. నీకు శుభములు చేకూరుగాక. ఈ దేవతలందఱు నీయొక్క పరాక్రమమును చూచిరి. లలితమైన నీ కృపారసమును నాపై ప్రసరింపజేయుము. దశరథనిపుత్రుడైన రామా! దైవస్వరూపుడవైన నీచేత అనమానింపబడినను నా మనస్సు సిగ్గుపడుట లేదు. సీతామనోహరా! సాటిలేని పరాక్రమముగల ఈ శరమును తొందరగా విడువుము. నాపుణ్యలోకములను నీవు కొట్టుటనుచూచి మహేంద్రపర్వతమునకు వెళ్లెదను. అని పల్కగా రాముడు శరమును విడచెను. తనచే ఆర్జింపబడిన పుణ్యగతులాశరముచే దగ్ధములు కాగా మెచ్చుకొనుచు రామునకు ప్రదక్షిణించి పరశురాముడు మహేంద్రగిరికి వెళ్ళెను. దిక్కులనలుముకొన్న చీకట్లు తొలగెను. రామునియొక్క గొప్పదైన బలమును చూచి దేవతలు, మునులు మెచ్చుకొనిరి. సేనయందందఱకు తిరిగి తెలివివచ్చినట్టయ్యెను.

# డెబ్బది యేడవ సర్గము

## పరశురాముడు వెళ్లిన వార్త తెలిపి శ్రీరాముడు తండ్రిని ప్రయాణము సేయ గోరుట

ఇట్లు పరశురాముడు వెడలిపోవగా ధనుస్సును శరమును వరుణుని చేతికిచ్చి వసిష్ఠాది మునులకు నమస్కరించి ఆశ్చర్యమున మునిగిన తన తండ్రియొద్దకు వెళ్లి “ఓ తండ్రీ జామదగ్న్యుడు వెడలిపోయెను. అందఱమునింక అయోధ్యకు వెడలవచ్చును. బలమంతయు హాయిగా నున్నది. వారందరు నీయొక్క అనుమతికై జలములకై మేఘములను జూచుచున్న చాతకముల వలెవేచి యున్నారు. నీ కిష్టమగు నేని తొందరగా అనుజ్ఞనిమ్ము” అని పల్కెను. పరశు రాముడు వెళ్లిపోయెనని విన్న దశరథుడు సంతోషముతో పొంగి పోవుచున్నవాడై తన కుమారుడైన రాముడు చచ్చి మరల పుట్టినయట్లుగా తలంచి, ఆ రాముని దగ్గరకు తీసుకొని చేతులతో నురంబునకు చేర్చుకొని శిరంబు మూర్కొని సైన్యమున కంతకును ప్రయాణమున కనుజ్ఞ నిచ్చెను.

## దశరథదు లయోధ్య ప్రవేశించుట

ఈ ప్రకారముగా బయలుదేరి వచ్చి పలువన్నెల పందిళ్లను గట్టి మంగళకరములైన వాద్యములు మ్రోతలాకసము ముట్టుచుండగా, వీధులన్ని నీళ్లు చల్లి పువ్వులవెదజల్లి సంతోషము కలిగించునట్లు మామిడాకుల తోరణములు గట్టి, అందముగా ముగ్గులు పెట్టి అలంకరించిన అయోధ్య పురమున ప్రవేశించిరి. సన్ననైన చేలములను ధరించి మేలిమిబంగారు సొమ్ములను ధరించి పురజను లెల్లరును మంగళాచారము ప్రకారముగా మిక్కిలి

సంతోషముతో తన్నెదుర్కొనగా పుత్రసహితుడై దశరథుడు హిమగిరిని పోలిన తన మేడలో సంతోషముతో ప్రవేశించెను. కోర్కిమీరగ, కౌసల్య, సుమిత్ర, కైకేయి మొదలైన రాజపత్నులు, యూర్మిళను, మాండవీ, శ్రుత కీర్తులను వీనులకువిందుగా మంగళవాద్యములు మ్రోగుచుండగా ప్రకాశించుచున్న అంతఃపురమున ప్రవేశపెట్టి చలువవస్త్రములతో నలంకరించిరి. చందన గంధములతో శరీరములలంకరించిరి. తమయిలువేల్పుల మందిరములలో అర్చనలు చేయించిరి. గురువులు మొదలైన పెద్దలకు నమస్కరింపజేసిరి. కోడండ్రుచే ధనమును, ధాన్యమును ఆవులను బ్రాహ్మణులకిప్పించి వారిని సంతోషపరచిరి. ఆనవవధువులు తమతమ సౌధములలో భర్తలతో సంతోషముగా నవసౌఖ్యముల ననుభవించిరి. వీరులు, వివాహితులు, సుకుమారులు, తమరూపసంపదచే మన్మథునే తిరస్కరించువారు, మంచినడవడిగలవారు నయిన ఆ కుమారులు తమతండ్రికి మహానందకరులై సంచరించిరి. ఈ ప్రకారముగా కొంతకాలమరుగగా రాజు కైకకుమారుడైన, భరతుని జూచి "నాయనా! నీ మేనమామ ఇచ్చట నిన్ను గూర్చి యప్పటినుండియు, విడువక యున్న వాడు. కాన అతనితో బయలుదేరుము." అనగా తండ్రికిని తల్లులకును నమస్కరించి, శత్రుఘ్నునితో గలిసి భరతుడు వెడలెను. అట్లు భరతుడు వెడలగా మంచి గుణములు గలిగిన రామలక్ష్మణులు దైవభావముతో తమజనకుని బూజించుచు సంతోషమున మునుగజేయుచుండిరి. చేయవలసిన సమయమున జనకుని యాజ్ఞతో పురజనులకు మంచినియిష్టమును చేయుచు తల్లిదండ్రులకు గురువులకును గొప్పసంతోషమును గలుగ జేయుచుండిరి. సమస్తసద్గుణములు గలవాడును, సత్ప్రవర్తనము గలవాడును, మహాబలవంతుడును, కీర్తిగలవాడును నగు ఆ శ్రీరాముని చూచి యార్యులగు బ్రాహ్మణులు హర్షము నొందిరి.

**సీతారాములు స్వపురంబున సుఖంబులననుభవించుట**

శ్రీరఘురామచంద్రుడు సీతాదేవితో గూడి యనేకములైన సంవత్సరములు

స్వేచ్ఛగా అనేక విధములైన లీలలతో విహరించుచుండెను. ఆ జనకరాజపుత్రి యందు తీరని కూరమితో నున్నవాడై యుండెను. ఆమెయును ఎక్కువైన ప్రేమతో మనస్సు తనభర్త యందుంచినదై యుండెను. దేవతలచే నమస్కరింపబడిన వాడగు ఆతనికి తనతండ్రిచే నీయబడిన దగుటచే మనసు ప్రీతిపాత్రుమయ్యెను. గుణములచే, రూపముచే అతనిని మిక్కిలి ప్రేమించెను. భర్తయైన రాముడు గుణవతియు, రూపవతియునగు సీతాదేవి యందు రెట్టింపయిన యనురాగముతో ప్రవర్తించెను. ఆమె హృదయములోని భావమెంత సూక్ష్మమైనను పతియెఱుగుచుండెను. సాక్షాత్తు లక్ష్మీదేవివలె ప్రకాశించుచున్న ఆ మిథిలాధిపతి కుమార్తెయైన సీత, పతికి గల ప్రేమను రాముని కంటె నెక్కువగా తెలిసినదయ్యెను. దశరథరాజకుమారడగు రాముడు మనుస్సును రంజింపజేయు నాకృతిగలదియు నగు నా జనకరాజపుత్రికను గలసి హెచ్చిన కోర్కెలుగలవాడై అనంత మోహబంధములతో లక్ష్మీదేవితో గలసి రాగముతో విహరించు విష్ణుమూర్తివలె విహారములు సల్పెను.



## బాలకాండాంత పద్యార్థములు

ఓంకారస్వరూపా ! రామచంద్రా ! శంకరునిచే, గిరిజచే, బ్రహ్మచే మనమున జపింపబడు వాడా ! రామా ! కష్టసమూహములను పారద్రోలువాడా ! రామా! సూర్యవంశమనెడి సముద్రమున జనించిన చంద్రుడా ! రామచంద్రా

సర్వులలోను శ్రేష్ఠుడైనవాడా ! సర్వులహృదయములందును నివసించు వాడా! సర్వజగత్తులకును మూలకారణమైన వాడా! ప్రశంసింపదగిన గుణములు గలవాడా! రామా ! సర్వమునకు మొదట ఆధారమైన వాడా! హరీ ! సర్వులకును శరణ్యుడైనవాడా! మహాత్మా! సర్వులచేతను స్తోత్రముచేయదగిన వాడా !

సూర్యుడు, పర్వతములు, అగ్ని, చంద్రుడు మున్నగు వానిని బాల్యచేష్టలతో (లీలగా) ఆడించువాడా ! పద్మములవంటి నేత్రములు గలవాడా ! రమాపతి యగు విష్ణుమూర్తీ! పాలసముద్రముల బోలు సజ్జనులయొక్క మనస్సుల యందు నివాసము గలవాడా! పాపములను పోగొట్టువాడా! ఒంటిమిట్ట నివాసము గలవాడా! జనకరాజపుత్రికావల్లభుడైన రామచంద్రా నీకు నమస్కారములు సమర్పించుచున్న దానను.



## గద్యము

**ఇది**

శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానసయు శ్రీ మొలుగు వెంకట నృసింహాచార్య తనూజయు, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకిత శ్రీమత్తిరుమలపెద్దింటి వెంకటరాఘవాచార్యులు అయ్యవార్లంగారి ధర్మపత్నియు నగు వేంకటసీతమ్మచే, శ్రీ వావికొలను సుబ్బారాయ ప్రణీత 'శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము' పద్యకావ్యమునకు రచింపబడిన వచనానువాదము నందు, బాలకాండము.

**శ్రీరామప్రసాదసిద్ధిరస్తు.**

**శ్రీ జగన్మాత్రర్పితమస్తు**

**శ్రీ శ్రీ శ్రీ**

**నమోస్తు రామాయ సలక్ష్మణాయ !**
**నమోస్తు దేవ్యైజనకాత్మజాయై**
**నమోస్తు వాతాత్మభువే వరాయ !**
**నమోస్తు వల్మీక భవాయ తస్మై**

**ఓం తత్ సత్**